# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?




ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!

శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O.(Geneva) Pre-qualified U.N.Supplier of Hepatitis-B Vaccine

SHANTHA BIOTECHNICS LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com



# 'హాసం'

హాస్య - సంగీత పత్రిక

## ఇవీ సంగతులు

77

**Also available on net:**
**www.haasam.com**



**ముఖచిత్రం**

'రాధా గోపాళం' చిత్రంలో స్నేహ

## హాస్యం


**సీరియల్స్:**

తాతా ధిత్తై తధిగిణతోం...

-జీడిగుంట రామచంద్రమూర్తి 58

డాక్టర్ డూ లిటిల్-2 -ఎమ్బీయస్ ప్రసాద్ 54

**కథ:**

జహంగీర్ - ఎన్.సూరి 06

**శీర్షికలు:**

హ్యూమర్ బాక్స్ 44

చౌ చౌ చౌరస్తా 20

పలకరిస్తే పద్యం- డా॥ గరికపాటి నరసింహారావు 10

**బాపురమణీయం:**

పెళ్ళిపుస్తకం (వెండితెర నవల)

- ఇలపావులూరి మురళీమోహనరావు 16

**హ్యూమరథం**

- రావి కొండలరావు 64

**స్పెషల్స్:**

**జంధ్యా మారుతం:**

ష్... గప్‌చుప్ !

- పులగం చిన్నారాయణ 22

హాసం క్లబ్ విశేషాలు 53

**సమీక్షణం:**

సరసి కార్టూన్లు 57

**స్పెషల్స్:**

బాపు బొమ్మల్లో దృశ్యసౌందర్యం 14


'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల ప్రత్యేకం

## సంగీతం


**సీరియల్:**

నేనూ నా పాటలు - శ్రీమతి జమున రమణారావు 46

రఫీ గురించి... - మృణాళిని 31

**లలితం:**

వెలిగించవే చిన్న వలపు దీపం

- చిత్తరంజన్ 66

**పాప్‌కార్నర్:**

క్రిస్టినా మిలియన్ - వి.అరుణ సత్యవతి 36

**అర్థంచేసుకుందాం-ఆస్వాదిద్దాం**

గీత్‌గాయా పత్తరోంనే - మృణాళిని 41

లేత మనసులు - (తమిళం)

- పి.ఎస్.గోపాలకృష్ణ 18

**సినిమా:**

**ఆపాత(ట) మధురం**

జగదేకవీరుని కథ - రాజా 62

**శీర్షికలు:**

కొమ్మాకొమ్మా కోకిలమ్మా-ఇంద్రగంటి జానకీబాల 50

అన్నమయ్య పద భావ దర్శనమ్

- జి.బాలకృష్ణ ప్రసాద్ 12

సరిగపదమని - 32 35

సరిగపదమని ఫలితాలు- 30 30

ఆడియోరివ్యూ

- కొంచెం టచ్‌లో వుంటే చెపుతాను 34

**స్పెషల్:**

ఘంటసాల చిత్రేతర గీతాలు 68





పాత పాటల ప్రత్యేకం 69 వ పేజీ నుండి 74 వ పేజీ వరకు




నేను పంపిన జోక్స్ ప్రచురించి ప్రోత్సహించటమేకాక, కాంప్లిమెంటరీ కాపీ, ఆడియో సి.డి.పంపినందుకు కృతజ్ఞతలు. మీ ఉత్తరం నీట్‌నెస్ మీ ఆఫీసు నిర్వహణకి అద్దం పడ్తూ ఉంది. అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం శీర్షికలో ఉర్దూ కవిత్వంలోని మధురిమను తెలుగులో అందిస్తున్నారు. ఇది ఉర్దూ రాని వారికి ఎంతో ఉపయోగంగా ఉంది. 16-31 అక్టోబరు సంచికలో సాహిర్ రచన 'ప్యాసా' సినిమాలోది ఎంతో బాగుంది.

**-కె.రామారావు, హైద్రాబాద్.**

'హాసం'పత్రిక మాకెంతో ఇష్టం. ప్రతి అంశము హర్షింపదగినవి. ప్రస్తుత పరిస్థితులలో లభ్యమవుతున్న పత్రికలన్నిటికన్నా భిన్నంగా మీరు ఎన్నుకొన్న ప్రత్యేకమైన శైలిలో కుటుంబ సమేతంగా, సంగీత, సాహిత్య ప్రియులకు ఎంతో ఆనందదాయకమైన విశేషాలు ప్రచురించుట అత్యంత అభినందదాయకం.

**-సి.హెచ్.రాజేశ్వరరావు, కాకినాడ.**

'హాసం' - పేరు నిలబెట్టుకుంటున్న, అభిమానుల హృదయాలలో తనస్థానం చిరస్థాయిగా నిలబెట్టుకుంటున్న పత్రిక. తొలిసంచిక నుండీ తాజా సంచిక వరకు, ఎంతగా ఎదుగుతున్నా క్రమశిక్షణతో, సభ్యతాసంస్కారాలతో ఎదుగుతున్న పాపలా, సుగుణాలతో అసదృశంగా 'హాసం' హాయిగా కలకాలం నిలవాలన్న ఆకాంక్షతో.

**-వసంతకుమార్, దేవరకొండ.**

'హాసం'లో నేను మొదట చదివేది 'ఆపాతమధురం'. తర్వాత హ్యూమరథం, చిత్తరంజన్‌గారి 'లలితసంగీతం', జంధ్యా మారుతం, రఫీపాటలు, అర్థం చేసుకుందాం శీర్షికలు వేటికవేసాటి. ఎమ్బీయస్‌ప్రసాద్‌గారు రాస్తున్న 'డాక్టర్‌డూలిటిల్' అద్భుతం. అసలిలాంటి ప్రయోగాలు కనీసం టీవీల్లోనైనా ఎందుకు చెయ్యరో అర్థం కావడంలేదు. ఇంత చక్కటి స్క్రిప్టుని అందిస్తున్న 'హాసం'కి జన్మజన్మలకీ రుణపడి వుండాలి.

**-కె.ఎస్.రామారావ్, హైద్రాబాద్.**

'హాసం'లో శ్రీమతి జమునా రమణారావు గారి 'నేను నాపాటలు' ఆసక్తికరంగా ఉంటున్నాయి. 'పగటిపూట' వెన్నెల' ఆరుద్ర, పగలేవెన్నెల, సినారె ఆ పాటలు రెండింటికీ అభినయం - జమున. మంచి కాంబినేషన్. జమునగారి పాటలు నచ్చినవి ఎన్నో ఉన్నా 'ఎందుకో నిను చూడగానే'- సి.ఐ.డి -బాగా నచ్చింది. తన అనుభవాలతో ఆ తరం సినిమా కబుర్లు అందించడం అభినందనీయం.

**-డా॥ డి. శ్రీనివాసబాబు, హైద్రాబాద్.**

జానకిబాలగారి 'కొమ్మా కొమ్మా కోకిలమ్మా' లో బాలసరస్వతిగారి గురించి వాస్తూ ఇల్లాలు (1940) తరువాత నటించలేదని వ్రాసారు. కాని 40 తర్వాత 'సువర్ణమాల' లో నటించారు. గతంలో లాగా ఆకాశవాణి సంగీత సమ్మేళనం ప్రసార వివరాలు ప్రతీ ''వక్షం''లో తెలియజెయ్యగలరని ఆశిస్తున్నాను. "పలకరిస్తే పద్యం'' పలకరించడవేం కాకుండా పులకరింపజేస్తోంది.

**-వి.యస్.జగపతిరాజు, విజయవాడ.**

'హాసం' 3సం॥లు పూర్తి చేసుకున్నందుకు అభినందనలు. ఒక మంచి పుస్తకం చదువుకో అనేది పెద్ద వారి మాట. అదే అచరిస్తే 'హాసం' పుస్తకం కొనక తప్పదు. 1-15 నవంబరు,2004 సంచికలో చౌ చౌ చౌరస్తాలో పేరడీ పెరేడ్ లో మామిడి మహేంద్ర 'కులగోత్రాలు'లోని పాటకు పేరడీ పాట సెల్‌ఫోన్ బిల్లుల మీద వ్రాసారు. ఇది మధ్య తరగతి వారికి కనువిప్పు.

**- కూనపరెడ్డి రమేష్‌బాబు, పోతేపల్లి.**

ఉత్తమ పత్రికగా 'హాసం'ను సంగమ్ ఫిలిం అవార్డ్స్ వారు సన్మానించిన సందర్భంగా శుభాభినందనలు. ఇలాంటి అవార్డులు మరెన్నో రావాలని కోరుకుంటున్నాను. 'హాసం' పత్రిక కోసం ఆసక్తిగా ఎదురుచూస్తుంటాం. 16-30 సెప్టెంబరులో మా అభిమాన ఎవర్‌గ్రీన్ హీరో అక్కినేని రేఖా చిత్రం పత్రికకే హైలైట్. ఆయన సినిమా పేర్లతో ఆయన బొమ్మను చిత్రించిన రాజభద్రయ్యకు, 'హాసం' యాజమాన్యానికీ మా కృతజ్ఞతలు. నేను నాపాటలు శీర్షికన అక్కినేని గారివి కూడా వస్తాయని ఆశిస్తున్నాం. ఈ పత్రికలోని ప్రతిపేజీ ఉపయోగకరమే. జంధ్యాల 'పడమటి సంధ్యారాగం' విశేషాలను తెలియజేసినందుకు థ్యాంక్స్. 16-31అక్టోబరులో ఆ పాతమధురం 'వాగ్దానం' చిత్రంలోని 'వన్నెచిన్నెలన్నీ' పాట గురించి వివరించారు కాని రాగం పేరు తెలుపలేదు. తెలియజేయగలరని మనవి. పలకరిస్తే పద్యం, అన్నమయ్య పదభావదర్శనమ్, కొమ్మాకొమ్మా కోకిలమ్మా, తనికెళ్ళ భరణి వ్యాసాలు, చిత్తరంజన్ లలితసంగీతం, పాతపాటల ప్రత్యేకం వేటికవే గర్వకారణంగా వున్నాయి. ఆపాత మధురం గురించి ఎంత వర్ణించినా తక్కువే. ఈ మధుర రసాలను మాకు అందిస్తున్నందుకు స్పెషల్ థ్యాంక్స్. ఈ శీర్షికన దేవదాసు, అనార్కలి, దొంగరాముడు, రోజులుమారాయి చిత్రాలగురించి తెలుపగలరు.

**- డా॥ రాజశేఖరాచారి, మాన్‌దొడ్డి.**

**('హాసం' 4వ సంచికలో 'దేవదాసు' పాటల గురించి, 14వ సంచికలో 'అనార్‌కలి' పాటల గురించి, 16వ సంచికలో 'రోజులు మారాయి' పాటల గురించి, 18వ సంచికలో 'దొంగరాముడు' పాటల గురించి వివరించటం జరిగింది.**

**- ఎడిటర్)**

'హాసం' మొదట్లో అందరి లాగానే నేను కూడా మాములు పత్రిక అనుకున్నా. మా అబ్బాయి గత మార్చిలో ఇంటికి తెస్తే చదివి మనకు చాలా ఉపయోగపడే ఒక నిఘంటువు అని సంతోషించి మీ పత్రిక లైఫ్ మెంబర్ని అయిపోయా. నిన్ను చూసిందిలేదు- కన్ను మూసిందిలేదు-అని ఓ పాటలో అన్నట్టు పత్రిక ఎప్పుడు వస్తుందా అని ఎదురు తెన్నులు చూస్తున్నాం- ముఖ్యంగా మీరు ఇస్తున్న పాతపాటలు మాకు ఎంతో ఉపయుక్తంగా ఉంటున్నాయి. ఏమని పాడెదనో- విజయవాడ- వస్త్రలత - ప్రోగ్రాంలో పాడాను. అలాగే అన్నమయ్య -నిగమ నిగమాంత-గుంటూరు దగ్గరలో వేంకటేశ్వర దేవాలయం (గోరంట్ల గ్రామం)లో పాడాను. మీరు ప్రచురించిన ఘంటసాల హరికథ కూడా ఇదివరకు చాలా స్టేజీలమీద ప్రదర్శించాను. పాత చిత్రాలపాటల పుస్తకాలు మాలాంటి వారికి చాల ఉపయోగంగా ఉంటున్నాయి. కళామతల్లికి వీణాధారియైన ఆ సంగీత సరస్వతికి తమరుచేస్తున్న సేవ వెలకట్టలేనిది. ఈ సర్వీసులో మీ జీవితాంతం కొనసాగాలనీ ఆ యొక్క శక్తి ఆ శ్రీసరస్వతీ అమ్మవారు-సకల దేవతలు మీకు ఇవ్వాలని సదా కోరుకుంటూ...

**-నెమ్మలూరు చంద్రశేఖర్,విజయవాడ.**

'హాసం' చదువుతూ ఆనందంతో ఓలలాడుతున్న వారిలో నేను కూడా ఒకణ్ని. ప్రతీ సంచికకీ ఉత్తరం వ్రాయాలనిపించినా వ్రాయలేక పత్రికకి వచ్చిన ఉత్తరాల్లోనే నా స్పందనని చూసుకుంటూ ఇన్నాళ్ళు గడుపుకుంటూ వచ్చాను. కానీ 74వ సంచికలో 'వాగ్దానం'లోని హరికథ పూర్తిపాటం, దానిమీద అనన్య సామాన్యమైన విశ్లేషణలోని ఆనందాన్ని అనుభవించిన తర్వాత కూడా నా స్పందన స్వయంగా తెలియజేయకపోతే నా ఆనందానికి అర్థం లేదనిపించి ఈ ఉత్తరానికి శ్రీకారం చుట్టాను. ఈసంచిక కొనుక్కుని ఇంటికి వెళ్ళేటప్పటికి రాత్రి 11 దాటింది. అయినా సరే పరిసరాల విజ్ఞానాన్ని కాసేపు పక్కనబెట్టి నేనూ నా అర్థాంగి కలిపి మొత్తం హరికథని ఎలుగెత్తి పాడుకుని మురిసిపోయాం. ఆంధ్రజాతికి ఉచిత నలహాలిచ్చే గుణం అధికం కాబట్టి సంపాదకీయంలో మీరు ఆ రకమైన చింతన చేయడం అవసరమే. పత్రికను చాలా ఒద్దికగా నడుపుతున్నందుకు అభినందనలు. మనిషి జీవితానికి అత్యంత ముఖ్యమైన రెండు కళల పరిరక్షణ, ప్రచారం కోసం మీరు సల్పుతున్న కృషి బహుధా ప్రశంసనీయమైనది. ఆ క్రమంలో మీకు మా తోడ్పాటు ఎల్లప్పుడూ ఉండగలదు.

**- కె.కె. మోహన్,హైద్రాబాద్.**

సంపుటి: 4 సంచిక: 05

**1-15 డిసెంబరు 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
**పి.గిరి**

చీఫ్ లే-అవుట్ డిజైనర్
**జి.రాజేష్**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P.Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 77

ఒక ప్రఖ్యాత కర్ణాటక విద్వాంసుడి గురించి ఓ ఉదంతం చెబుతూంటారు - 'నగుమోము గనలేని' పాడడంలో ఆయన దిట్ట అన్న పేరు వచ్చాక ఆయన ఎక్కడ కచ్చేరీ చేయడానికి వెళ్లినా ఆ కీర్తనను పాడమని అభ్యర్థనలు వచ్చేవి. పాపం ఆయన ఎన్ని కొత్త పాటలు, రాగాలు తయారుచేసుకుని వెళ్లినా 'నగుమోము' పాడమనే చీటీలు ఎక్కువగా వస్తూండడంతో ఓ సారి ప్రాణం విసిగి, 'ఎన్ని సార్లు పాడను? అది అలాగే వినడానికి ఇంతదూరం రావడమెందుకు? పాతికేళ్ల క్రితమే పాడినది క్యాసెట్లో దొరుకుతోంది. పోయి వినండి.' అని బాధ పడ్డారట!

మనకు కంఫర్ట్ జోన్స్ ఉంటాయి. అవి విడిచి రావడానికి మనసొప్పదు. 'తెలిసిన ఊరయితేనే మేలు'. 'మళ్లీ మళ్లీ ఆ ఊరికే వెళదాం.' 'కలక్టరేటులో తెలిసినవాడెవడైనా ఉన్నాడేమో చూడు. కొత్తవాడయితే మన గోడు వింటాడో లేదో!' ' కొత్తరకం టిఫెన్లు తెప్పించడం ఎందుకు? బాగుంటాయో లేదో? హాయిగా మన రెగ్యులర్ ఐటమ్స్‌నే తెమ్మని సర్వర్‌కి చెప్పేయి!' ఇదీ వరస!

వీళ్లని కంఫర్ట్ జోన్‌నుంచి బయటకు లాక్కునివస్తే చాలా ఫలితాలుంటాయి. 'ఘంటసాల పాటలంటూ ఓ అరవైయ్యో, డబ్బయ్యో మాత్రం వింటున్నావు. నువ్వు తరచుగా వినేవే కాకుండా ఇంకా అనర్ఘ రత్నాలు బోలెడున్నాయి తెలుసా?' అని చనువుగా చేరదీసి, బుజ్జగించి, సరైన రీతిలో పరిచయం చేసి వినిపిస్తే వాటికి కూడా వీరాభిమాని కాగలడీ సజ్జనుడు!

కానీ అలా చేరదీసి, ప్రాముఖ్యం కాని పాటలను శ్రోతలకు చేరవేయడానికి విపరీతమైన ఓపిక ఉండాలి. సంగీతవిభావరులు నిర్వహించేవారికి మరీ మరీ కావాలి. వేరే ఉద్యోగాలు చేసుకుంటూ పార్ట్‌టైమ్‌గా వచ్చే గాయనీగాయకులకు, ఆర్కెస్ట్రావారికి - ఎక్కువ సమయం కేటాయించైనా తర్ఫీదుకమ్మని నచ్చచెప్పాలి. సరైన వ్యాఖ్యానం ద్వారా ఆ పాటలో అందాలపై శ్రోతల దృష్టి నాకర్షింపజేయాలి. కొన్ని పరిచితమైన పాటలతో కలగలిపి శ్రోతలకు అందించాలి. ఇన్ని కష్టాల కోర్చి సంగీతనిధులను శ్రోతలకు చేర్చినపుడే వారిని నిజమైన సంగీతసేవకులనవచ్చు.

కానీ చాలా సంగీతకార్యక్రమాలలో ఈ పని జరగటం లేదు. కొన్ని రెగ్యులర్ రొటీన్ పాటలకు మించి ఈ కార్యక్రమాలలో వినబడవు. శీర్షికలు వేర్వేరే కానీ పాటలు మాత్రం అవే! అవే పాటలు వినివినీ క్రమేణా శ్రోతలకు ఆసక్తి తగ్గుతోందనడానికి నిదర్శనం - టిక్కెట్టు పెడితే సభ నిండదన్న భయంచేత నిర్వాహకులు స్పాన్సర్ల ఔదార్యంపై ఆధారపడడం!

ఈ పరిస్థితి మారాలి. మరుగున పడ్డ మంచి పాటలెన్నో ఉన్నాయి. కొన్ని క్యాసెట్ల రూపంలో షాపుల్లో లభ్యం కావు. సేకరించి దాచుకునే వారి దగ్గరుంటాయి. అటువంటి వారి సహాయంతో ఆయా పాటలను సంపాదించి, సాధన చేసి, ప్రేక్షకులకు వినిపించగలిగినప్పుడు మన స్థానం ప్రత్యేకంగా ఉంటుంది.

'హాసం' చేస్తున్న కృషి ఫలితంగా మరుగున పడ్డ పాటలెన్నో పాఠకశ్రోతల స్మృతిపథంలో మెదలుతున్నాయి. పాటల అందాలను విశ్లేషించి చెప్పడం వలన వాటిని మళ్లీ విని కొత్త దృక్పథంతో మరింతగా ఆస్వాదించాలన్న కోరిక కలుగుతోంది. 'హాసం' అటువంటి పాటల సాహిత్యాన్ని అందివ్వగలదు. కానీ అభిమానులకు నేరుగా వినిపించలేదుగా... కనుక ఆ పాటలను ప్రత్యక్షంగా వినిపించి మరింతమందిని రంజింప చేసే ప్రయత్నం సంగీతసభానిర్వాహకులే చేయాలి.

ఈ పక్షంలో ఘంటసాల జయంతి రాబోతోంది. రాష్ట్రవ్యాప్తంగా ఎన్నో సంస్థల ఆధ్వర్యంలో వందలాది కార్యక్రమాలు జరుగబోతున్నాయి. వాటిలో కొన్ని సంస్థలైనా పైన చెప్పిన రీతిలో కృషి చేసి ప్రాచుర్యంలో లేని ఘంటసాల పాటల్లో కొన్నిటినయినా ప్రజల్లో తెస్తే ఈ వాక్యాల లక్ష్యం కొంతమేరకు సిద్ధించినట్లే!



# జైకంగారు

(క్రీ.శ.2004)

- ఎన్.సూరి

"సెంటర్‌లో నుంచుని సైటేస్తే అదుర్స్‌కదా గురూ!"

"నిజమే కాని మావా, మనవంతా ఇక్కడే నిలబడిపోతే పక్కసెంటర్‌లో వాళ్లంతా బాధపడిపోరూ?"

"అందుకని అటూ ఇటూ తిరుగుతూ ఉంటే కొన్ని కలర్లు కరిగిపోతాయిరా నాయనా!"

మొదటి డైలాగు మా సునీల్‌గాడిది.

రెండోది రఘు.

ఆఖరిది నేనే. రోజూ సాయంత్రం కాలేజీ అయిపోయాక మా రోజువారీ కార్యక్రమం అది.

"లాభం లేదు మావా! ఊళ్లో వున్న కలర్లన్నీ ఒక్కసారే చూసేయ్యాలంటే ఏం చేద్దామంటావ్?"

"ఏవుందీ, ఊళ్లో వున్న ప్రతి యంగ్‌లేడీ విధిగా ప్రతిరోజూ సాయంత్రం మనూరు స్టేడియంలోకి వచ్చి కుర్రాళ్లందరికీ కనిపించి వెళ్లాలని ఓ రూల్ ఒకటి పాస్ చేద్దాం".

వీడి పేరు హరి. ఇప్పుడే వచ్చాడు వీడు. వస్తూనే మా మాటల్ని విని చెప్పిన డైలాగిది. నవ్వి వూరుకున్నాం. వాడు మాత్రం ఊరుకోలేదు. ఊరుకుంటే వాడు హరిగాడే కాడు.

"ఏ ఆడదైనా సరే తను యంగ్ అనే అనుకుంటుంది. అంచేత మొత్తం లేడీసంతా వస్తారు. ఛాయిస్ మనిష్టం" అన్నాడు సైక-లాజికల్‌గా, ఎవరూ మాట్లాడపోయేసరికి.

"చెప్పండ్రా! జెడ్పి ఛైర్మన్ మా పెదనాన్న. మొన్న గెలిచిన ఎమ్మెల్యే మా వీధిలోనే వుంటాడు. వీళ్లవల్ల పనికాదనుకుంటే హైద్రాబాదెళ్లిపోదాం. లేదా ధర్నాలు, స్ట్రైకులు చేసి మన కనీసపు కోర్కెలు ప్రభుత్వాన్ని నెరవేర్చమందాం".

"ఒరే మావా! మాకంత ఓపిక లేదురా, మమ్మల్నొదిలెయ్‌రా ఏదో కళ్లకి కనిపించినవాళ్ళతో కాలక్షేపం చేసుకుంటూ గడిపేస్తాం". రఘుగాడికి పాపం ఏడుపొక్కటే తక్కువ.

హరిగాడు ఏ విషయం డీల్ చేసినా అలాగే వుంటుంది. సబ్జెక్టులో అడ్డదిడ్డంగా వెళ్లిపోయి, ఎదుటివాడు జడుసుకు చచ్చేలా, ఒక్కొక్కప్పుడు పిచ్చిపట్టేలా మాట్లాడం వాడి స్పెషాలిటీ. అసలు వాడో ప్రత్యేకమైన మనిషి. వాడి థియరీలు వాడే డెవలప్ చేయాలి కానీ, మరొకడి వల్ల సాధ్యం అవ్వవు.

ఓరోజిలాగే ఏం జరిగిందంటే-

ఎడమభుజం వైపు తల



తిప్పి నడుచుకుంటూ వస్తున్నాడు. మెడ పట్టేసిందేమో అనుకున్నాం. వాడే చెప్పాడు-

"ఫేస్ క్రీమ్ అయిపోయిందిరా. మన క్లాసులో అమ్మాయిలు కుడిపక్కన కూర్చుంటారు కదా! అందుకని మిగిలిన అడుగు బొడుగు క్రీమంతా కుడిపక్కనే రాసాను. లెఫ్ట్ సైడు కాస్త గ్లామర్ తక్కువయ్యింది. కనిపించకుండా కవర్ చేస్తున్నాను".

హరిగాడి గురించి తెలుసుకోవాలనుకుంటే ఒకటి రెండు సంఘటనలు చాలవు. అయినా ఒకటి చెప్తాను. ఒకమ్మాయి గురించి.., ఎప్పుడూ అమ్మాయిల టాపిక్కేనా? అంటే వయసులో ఉన్న కుర్రాళ్లం, మాకు అది తప్ప వేరే టాపిక్కేముంటుందండీ? ఎవరి సంగతెలా వున్నా హరిగాడికి మాత్రం అమ్మాయిలే పెద్ద టాపిక్...టానిక్ కూడా! ఆ టానిక్ టైటానిక్ ఎలా అయిందో తర్వాత తెలుస్తుంది గానీ ముందు ఫ్లాష్‌బ్యాక్‌లోకెళ్దాం...

ఓ రోజు మా ఇంటిసందులో అరుగుమీద కూర్చుని ఏదో మాట్లాడుకుంటున్నాం. ఉన్నట్టుండి 'ఓసారి తుమ్మరా' అన్నాడు వాడు.

'ఎందుకురా' అనడిగాను.

'తుమ్మెహె... చెప్తాను' అన్నాడు వాడు.

తుమ్మాను.

'కాదు ఇంకా గట్టిగా తుమ్ము, ఇంకా గట్టిగా..' అంటూ నాలుగైదు సార్లు తుమ్మమన్నాడు.

తుమ్మాక "ఎందుకురా? " అనడిగాను.

" ఏం లేదు. సత్యనారాయణ అంకుల్ వాళ్ల పప్పీ ఇందాకట్నుంచీ నాకేసే చూస్తోంది. ఎక్కువగా తుమ్మే మొగాళ్లని లేడిస్ అంతగా లైక్ చెయ్యరు. కాంపిటీషన్ వుండకూడదు కదా !"

వాడి కాన్సెప్టుకి నాకు కళ్లు తిరిగిపోయాయి. కాస్సేపున్నాక ఆ అమ్మాయి కేసి చూశాను. వాళ్ల బాల్కనీలో నుంచుని సెల్‌ఫోన్‌లో మాట్లాడుతోంది.

"ఆ అమ్మాయసలు నీ కేసి చూట్టమే లేదు కదరా!"

"నేరుగా చూస్తే దిష్టి తగులుతుందని ఓరగా చూస్తోంది లేరా!"

"లేదెహె.. ఫోన్లో మాట్లాడుతోంది".

"అది మాట్లాడడం కాదురా అబ్బాయ్! 'నాకు సెల్‌ఫోన్ వుంది. ఫోన్ చెయ్యండి' అని సిగ్నల్ ఇవ్వడం."

"ఆ సెల్ నెంబర్ నీకు తెలుసా?"

"కాస్సేపయ్యాక కాయితం మీద రాసి, రాయిలో చుట్టి విసురుతుంది. రెడీగా వుండు మురుక్కాలవలో పడిపోకుండా పట్టుకోడానికి"

హరిగాడు ఆ అమ్మాయి కేసి చూస్తూ నిల్చున్నాడు. ఆ అమ్మాయి ఆకాశం కేసి చూస్తూ సెల్ మాట్లాడుతోంది. నేను పిచ్చి చూపులు చూస్తూ నిలబడ్డాను. కాస్సేపటికి ఆ అమ్మాయి లోపలికి వెళ్లిపోయింది.

"చూసావా...ఆ అమ్మాయి వెళ్లిపోయింది. అంటే నిన్ను చూట్టం లేదనేగా".

"అదికాదురా. రేపట్నుంచి మనకి ఎగ్జామ్స్ వున్నాయిగా, 'చదువుకోండి. నాకోసం టైం వేస్టు చేసుకోకండి' అని వెళ్లిపోయింది".

నాకు నిజంగానే పిచ్చెక్కిపోయింది. కనిపించిన ప్రతి అమ్మాయి వీడ్ని ప్రేమించేస్తోందన్న భ్రమలో వీడు వుండటమే కాకుండా, ఆ అమ్మాయి ప్రతిచేష్టకీ అర్థం చెప్పడం -ఫేస్ రీడింగ్, లిప్ రీడింగ్‌లా అది కూడా ఒక కళేమో!?

ఇదంతా మూడేళ్ల క్రిందటి మాట! ఇప్పుడు మేమంతా ఎక్కడి వాళ్లక్కడ విడిపోయాం. ప్రస్తుతం నేను హైద్రాబాద్‌లో ఓ చిన్న ఉద్యోగం చేస్తున్నాను.

పాత సంగతులన్నీ ఇప్పుడెందుకు గుర్తొచ్చాయంటే, మా రఘుగాడి పెళ్లి శుభలేఖ వచ్చింది. వాడూ ఫోన్జేసి చెప్పాడు, 'పెళ్లికి రాపోతే చీరేస్తానొరేయ్' అని. లక్కీఫెలో, చదువైపోగానే డీఎస్సీలో ర్యాంకు కొట్టేసి గవర్నమెంట్ జాబ్ పట్టాడు. ఇప్పుడు పెళ్లిచేసుకోబోతున్నాడు. ఆ పెళ్లికి వెళ్తే మావాళ్లనందర్నీ కలవొచ్చు కదానే సంబరంలో వున్నాను.

కాకినాడంటే నాకు మా ఇంట్లో వాళ్లకన్న ఫ్రెండ్సే ముందు గుర్తొస్తారు. వాళ్లలో హరిగాడు మరీను. వాడ్ని తలుచుకుంటే ఒక్కొక్కప్పుడు జాలేస్తుంది. ఒక్కోసారి పిచ్చికోపం, విసుగూ వస్తాయి. నేను ఊరొదిలి వచ్చేసరికే వాడు జెడ్‌వంతెన దగ్గరొకటి, జగన్నాథపురంలో ఒకటి, భానుగుడి దగ్గర ఒకటి - మూడు లవ్‌స్టోరీలు నడుపుతున్నాడు.

"వాళ్లల్లో ఎవర్ని ప్రేమిస్తున్నావురా"? అని అడిగితే-

"ముగ్గుర్నీను. ఎందుకంటే వాళ్లు నన్ను ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నారు".

"నీకెలా తెలుసు"?

"లుక్ రీడింగ్".

అదండీ మా హరిగాడంటే!

నరే, హైద్రాబాద్‌నుండి బయలుదేరి రఘుగాడి పెళ్లికి వెళ్లాను. రాజోలులో పెళ్లి. వెళ్తూనే రఘుగాడెదురొచ్చాడు.

"మావా.. వచ్చావా!" అంటూ

"రాననుకున్నావా?"

"రాకపోతే చంపేయ్‌నూ"!

"మనోళ్లంతా వచ్చేరా?"

"అంతా వచ్చారు. నువ్వొక్కడివే తక్కువ. పద పద''. అంటూ రఘు నన్ను లోపలికి తీసుకెళ్లాడు.

లోపల హరిగాడు కచ్చేరీ చేస్తున్నాడు. నేనొచ్చానని పలకరించే అవకాశం కూడా లేదు వాడికి. అంత సీరియస్‌గా ఏదో ప్రేమగీతం

పాడుతున్నాడు. పాట అయిపోయింది. అందరూ చప్పట్లు కొట్టారు. ఆ చప్పట్లు బ్రేక్ చేస్తూ వాడు అనౌన్సు చేశాడు -

'అబ్బాయ్‌లూ! ఇప్పటి దాకా సోకాల్డ్ సినిమా రచయితల సాహిత్యం విన్నారు. ఇప్పుడు ఈ హరిగారి స్వీయ అనుభవాల్ని పాట రూపంలో వింటారు'.

"వినిపించు!" అంటూ అందరూ ఒక్కసారిగా అరిచారు. హరిగాడు పాటందుకున్నాడు.

"చక్కని చిన్నది అన్నా అంటే
చచ్చేటంత చిక్కు కదా!
చిన్న పిల్ల బావా అన్నా
చక్కిలిగింతే లేదు కదా!"

"చించేసావు గురూ!" అని అరిచాడు సునీల్ గాడు.

"నోర్మూసుకుని వినరా వెధవా!" అంటూ వాడ్ని చరిచాడింకొకడు.

హరిగాడు ఉత్సాహంగా పాడేస్తున్నాడు -

"కంటికి మంటికి ఏకధారగా
ఏడుస్తావేం పిచ్చినాయనా!
వయసులోన విరహం వేస్తే
దిండు ఒకటే దిక్కుకదా!"

"అబ్బే లాభం లేదు గురూ! ఫస్ట్ రెండూ బావున్నాయ్. చివర్రెండూ స్పీడు తగ్గాయ్".

"అలాగా. వేటూరి సుందర్రామ్మూర్తికో, సీతారామశాస్త్రికో పంపించి ఫెయిర్ చేసిమ్మందాం".

"ప్రస్తుతానికొద్దులే గాని, చరణాలు పట్టుకోరా నాయనా".

హరిగాడు మళ్లా మొదలెట్టాడు-

"శుక్రవారం మసీదు కెళ్లు
ప్రతి శనివారం గుళ్లో కెళ్లు
ఆదివారం చర్చికి వెళ్లు
ఇంట్లో కన్నా గుళ్లో పదిలం
భారం అంతా మోసేను దైవం"

"బాగానే వుంది. గుళ్లో కెళ్లి ఏం చెయ్యాలో చెప్పరా గురూ!"

"లాంగ్‌షాట్‌లో కన్నుకొట్టు
మిడిల్‌షాట్‌లో కొంగు పట్టు
క్లోజప్‌లోన స్మైల్ కొట్టు
పీకల మీదికి వచ్చేదాకా ఓపిక పట్టు
తప్పకపోతే తప్పనిసరిగా తాళికట్టు"

మా వెధవ పైత్యానికి కాస్సేపు అందరం నవ్వుకున్నాం ఈలోపు మా రఘుగాడికి లోపల్నుంచీ పిలుపొచ్చింది.

"ఒరే మీరంతా బాగా ఎంజాయ్ చేయండ్రా, మందుకొడతారో, పేకాడతారో, ఏం చేస్తారో చేసుకోండి. ఎవడేనా అడిగితే.."

"పెళ్లికొడుకు ఫ్రెండ్స్‌మని చెబుతాంలే".

"అలా మాత్రం చెప్పకండ్రా బాబూ! మావగారి వూళ్లో పరువు పోతుంది. పండక్కి వచ్చినప్పుడల్లా అందరూ నవ్వుతారు".

"ద్రోహీ! పెళ్లాం దొరగ్గానే ఫ్రెండ్స్‌ని మర్చిపోతావురా? ఫోరా, పోయి ఆ అమ్మాయి కొంగు పట్టుకు తిరుగు. నీ బతుకింతే".

కాస్సేపు సద్దుమణిగాక అడిగాను హరిగాడ్ని-

"అయితే ఏం చేస్తున్నావురా ఇప్పుడు?"

"ఆదిత్యాలో చేస్తున్నాను".

"ఓహో! ఇప్పుడు లెక్చరర్ సార్ అన్నమాట".

"అదే నా కొంప ముంచిందిరా"

"ఏం?"

"రోడ్డు మీద ఏ అమ్మాయిని చూసి నవ్వినా 'తప్పు సార్ నేను మీ స్టూడెంట్‌ని' అని అంటుందేమోనని భయం".

"నీకు అంత జరిగినా బుద్ధి రాలేదురా?" అన్నాడు సునీల్‌గాడు మధ్యలో వాడ్ని తిట్టిపోస్తూ.

"ఏం జరిగిందిరా?" అనడిగాను.

"నువ్వూరు వదిలివెళ్లేప్పుడు వీడో అమ్మాయిని ప్రేమిస్తున్నాడు గుర్తుందా?" అంటూ గుర్తు చేయబోయాడు సునీల్.

"ఒకమ్మాయేంటి? ముగ్గుర్ని కదా!"

"ఆ.. ఆ ముగ్గురిలో ఒకమ్మాయినే వీడు మరీ ఘోరంగా ప్రేమించింది".

"వీడు ప్రేమించడంలో ఘోరం ఏవుంది? వీడ్ని ఆ అమ్మాయి ప్రేమిస్తే ఘోరం కానీ".

"అసలు ఘోరం అది కాదు. వేరే ఉంది. ఆ అమ్మాయికి ఆల్రెడీ పెళ్లయిపోయింది".

"నిజమా"?

"అవును. వాళ్లాయన కళ్లెదురుగానే వీడామ్మాయిని తెగ ప్రేమించేసాడు".

"ఏరా. పెళ్లయిపోయిన దాన్నెలా ప్రేమించావ్‌రా? వెనకా ముందూ చూసుకోవద్దూ". హరిని తిట్టాను.

"అసలు సంగతి విను. వీడి భాగోతం ఆ మొగుడికి తెలిసిపోయింది".

"తెలిసిపోలేదు. నేనే చెప్పాను".

సునీల్ స్టేటుమెంటుకి హరిగాడి సవరణ.

"నువ్వే చెప్పావా!"

"అవును.'మీ అమ్మాయి నన్ను ప్రేమిస్తోంది. మా ఇద్దరికీ పెళ్లి చేస్తావా అంకుల్ 'అని అడిగాను. వాడు దాని మొగుడని నాకేం తెలుసు?"

నాకు నవ్వాగడం లేదు. నవ్వాపుకుంటూనే అడిగాను. "తర్వాతేమైంది"?

"ఏముంది? వాడు ముందు వీడ్ని చితక బాదేశాడు. తర్వాత పెళ్లాన్ని కూడా చితక్కొట్టేసి 'నువ్వు నాకక్కర్లేదు ఫో!' అని విడాకులిచ్చేసాడు. ఎవరు చెప్పినా వినిపించుకోలేదు. పాపం ఆ అమ్మాయికి వీడెవడో కూడా తెలీదు. వీడిలో వీడే అన్నీ ఊహించేసుకుని తెగ రెచ్చి పోయాడు" సునీల్ వ్యాఖ్యానం!

"ఛ!అనవసరంగా నీ వల్ల ఒక ఆడపిల్ల సంసారం ముక్కలైపోయింది".

"ముక్కలైంది దాని సంసారం కాదు, నా బతుకు".

"నీకేమొచ్చింది మాయరోగం?"

"ఏముంది? కూతురి సంసారం పాడైపోతే ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఊరుకుంటారేంటి? నానాహంగామా చేసి పారేసారు. ఇంత అల్లరైపోయేసరికి ఆ అమ్మాయేమో తన పరువు పోయింది వీడి మూలంగానే కాబట్టి, వీడ్నేపెళ్లి చేసుకుంటానని, లేకపోతే చస్తానని బెదిరించింది. చివరికి ఆ అమ్మాయికే వీడ్నిచ్చి పెళ్లిచేసేసారు".

"ఓర్నీ! అయితే నీ పాటలో చివరి చరణం నిజమై పోయిందన్నమాట! మరి మాకు చెప్పలేదేంరా?"

"నాకు తెలిస్తేనే కదా, నీకు చెప్పేది. బలవంతగా లాక్కెళ్లి నిఖ్ఖా జరిపించేసారు". అన్నాడు హరిగాడు బిక్కమొహం పెట్టి.

"నిఖ్ఖా జరిపించేసారా? అమ్మాయి పేరేంటి?"

"నూర్జహాన్"!





# సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్

(31 అక్టోబర్ 1875 - 15 డిసెంబరు 1950)



"ప్రపంచ దేశాల సరసన మనం సముచిత స్థానం సాధించాలనుకుంటే - అది కోరుకున్నంత మాత్రాన లభించదు. అందుకోసం మనం అణువణువునా కృషి చేయాలి"

- సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్



**పటేల్ 129వ జయంతి సందర్భంగా**
**దేశం ఆ మహానాయకునికి నివాళులు అర్పిస్తోంది.**



సమాచార ప్రసార మంత్రిత్వ శాఖ, భారత ప్రభుత్వం

davp2004/365



మహాసహస్రావధాని

డా॥ గరికపాటి నరసింహారావు

# పలకరిస్తే పద్యం...

1116 పృచ్ఛకులతో 750 పద్యాలను ఏకధాటిగా ధారణ చేసి 'మహాసహస్రావధాని'గా కీర్తి ప్రతిష్ఠలనందుకున్న డా॥ గరికపాటి నరసింహారావుగారు సాగించిన అవధానయజ్ఞాలలో చమత్కారంగా దొర్లిన ఆశు పద్యాలివి. ఈ పద్యాలకు పృచ్ఛకులుగా వ్యవహరించినవారు శ్రీకాంత్, మంజుల, కుమార్, జ్యోతి, సాయి... చిత్తగించండి....

◆ **అవధానిగారూ... ఏమీ అనుకోకపోతే చిన్న అధిక ప్రసంగం. ఇప్పుడు మిరపకాయ బజ్జీ అన్నారు... తిన్నాం. తరువాత కాఫీ తాగాం, అమృతప్రాయంగా ఉంది. ఆ తరువాత చాలామంది సిగరెట్ ఓ దమ్ము లాగుతారు కదా... మరి దాని గురించి కూడా చెబితే బాగుంటుందేమో ... ?**

ఇందులో సంకోచించాల్సింది ఏమీ లేదు సిగరెట్ కాల్చిన అనుభూతి అప్పటికి బాగానే వుంటుంది. ఎందుకంటే

**పొగ రింగులు రింగులుగా**
**నగవులనది దాటివచ్చు నాట్యముసేయున్**

పొగ అరుగులమీద కూర్చుని రింగులు రింగులుగా వదులుతూ ఉంటే సరదాగా మధ్యలో నవ్వుతూ వుంటే అది నగవులనదిని దాటి వస్తుంది. నాట్యం చేస్తుంది.

**పొగ రింగులు రింగులుగా**
**నగవులనది దాటివచ్చు నాట్యముసేయున్**
**తగమూతి సున్న చుట్టగ**

మధ్యలో ఆ రింగులు వదిలేవారు మూతి సున్నా ఆకారంలో చుడతారు. అదే దారి వెంట ఆడవారు ఎవరైనా వెళ్తుంటే, అపార్థం చేసుకునే అవకాశం ఉంది కనుక జాగ్రత్తగా ఉండాలి.

**తగమూతి సున్న చుట్టగ**
**పొగరెక్కువ వీనికంచు బోటుల్ తిట్టన్**

అయినా దమ్ములాగినప్పుడు అప్పటికప్పుడు అనుభూతి బాగానే ఉంటుంది కానీ, తరువాత ఈ వ్యవహారం మన ప్రాణాల్ని లాగేసే ప్రమాదం లేకపోలేదు. ఎందుకంటే పొగ అలాగే పుట్టిందీ అని నా అభిప్రాయం.

**నగజాపతి విషభక్షన తగ సేయకముందే**
**కొంత ధారుణి కలిసెన్**

క్షీర సాగర మథన సందర్భంలో అమృతం పుట్టింది, దాన్నుంచి కాఫీ పుట్టిందని గతంలో చెప్పుకున్నాం. అదే మథన సందర్భంలో విషం కూడా పుట్టింది. అయితే ఆ విషాన్ని మింగటానికి శివుణ్ణి పిలిచారు. పాపం ఆయన కైలాసం నుండి దిగివచ్చేసరికి ఎంతైనా కొంత సమయం పడుతుంది కదా. ఈ లోపు ఆ విషం కొంత ధారుణిలో కలిసిపోయింది.

**నగజాపతి విషభక్షన తగ సేయకముందే**
**కొంత ధారుణి కలిసెన్**
**భగభగ పొగాకు మొలిచెన్**
**పొగ త్రాగిన వాడు గుండెపోటున చచ్చున్**

అందుకని జాగ్రత్తగా ఉండటం మంచిది. అతి సర్వత్రా వర్జయేత్.

**పొగ రింగులు రింగులుగా**
**నగవులనది దాటివచ్చు నాట్యముసేయున్**
**తగమూతి సున్న చుట్టగ**
**పొగరెక్కువ వీనికంచు బోటుల్ తిట్టన్**
**నగజాపతి విషభక్షన తగ సేయకముందే**
**కొంత ధారుణి కలిసెన్**
**భగభగ పొగాకు మొలిచెన్**
**పొగ త్రాగిన వాడు గుండెపోటున చచ్చున్**

◆ **అవధానిగారూ... ఓ చిన్న ప్రశ్న. కనీసం మన భారతదేశంలో సిగరెట్లనేవి మగవాళ్ళకే ప్రత్యేకం కదా... అలాగే ఈ అవధానం అనేది మగవాళ్ళకే పరిమితమంటారా? ఆడవాళ్ళు చేయరా? చేయకూడదా, చేయలేరా?**

ఆడవాళ్లు అవధానాలు చేయలేరు అనే ప్రశ్న లేదు. అన్నీ చేయగలరనే విషయం ఆధునిక కాలంలో ఋజువైంది. చేయకూడదు అని ఆడవాళ్లను ఎవరూ ఆపనూ లేదు. అయితే చేయరా అంటే చేయటం లేదెక్కువగా. నా దృష్టిలో ఆడవాళ్లు ప్రత్యేకించి అవధానాలు వేదిక మీద చేయవలసిన పని లేదు. వాళ్ల ఇళ్లలో ప్రతి రోజూ చేస్తూనే ఉన్నారు. సూక్ష్మంగా పరిశీలిస్తే ఒక అష్టావధానంలో ఉండే అంశాలన్నీ ఒక గృహిణి జీవితంలో కూడా ఉన్నాయి. అష్టావధానంలో నిషిద్ధాక్షరి, సమస్య, దత్తపది, వర్ణన, ఆశువు, ఘంటాగణనం, అధిక ప్రసంగం అన్నీ ఉంటాయి కదా. ఇవన్నీ ఉన్నాయి చూడండి..

**అడుగడుగున నిషేధాజ్ఞ జారీచేయు భర్త**
**నిషేధాక్షరార్తి దోప**

నిషేధాక్షరి ఎవరయ్యా స్త్రీ జీవితంలో అంటే కట్టుకున్న భర్త. మాటిమాటికీ అక్కడికెందుకెళ్లావ్ ఇక్కడికెందుకెళ్లావ్... ఆలస్యంగా ఎందుకొచ్చావ్... ఆ గడప ఎందుకు దాటావ్... ఈ గడపెందుకు తొక్కావ్ అని ప్రశ్నించటం ఉందే ఇది నిషేధం కాదండీ. దీన్ని తట్టుకుంటే నిషిద్ధాక్షరిని తట్టుకున్నట్టే. మరి సమస్య ఏమిటీ అంటే

**గుప్పిళ్లనిండని గుడ్డి గవ్వల తోడ**
**మాసమ్ముగడప సమస్య కాగా**

చాలీచాలని జీతంతో నెలంతా గడపడం ఉందే.. ఇది మగవాళ్లకంటే ఆడవాళ్లకే ఎక్కువ సమస్య. ఈ సమస్య తరిస్తే సమస్యాపూరణం చేసినట్టే... అలాగే దత్తపది... అది ఎవరయ్యా

**అది సర్దుమిదిసర్దుమని చంపు కాన్వెంటు**
**దత్తుండు దత్తపదమ్ము కాగా**

మాటి మాటికీ కాళ్లకు అడ్డంపడుతూ అమ్మా బ్యాగు సర్దావా, అమ్మా వాటర్ బ్యాగు పెట్టావా, అమ్మా పుస్తకాలు సర్దావా అని అడుగుతూ

ఉంటాడే... ఈ అర్థం పడేవాడు.... వీడు ఎలాగూ కాన్వెంటు దత్తుడు కాబట్టి వీడు దత్తపది నిజానికి.... వాడి సమస్యలను పరిష్కరించి బస్కెక్కిస్తే దత్తపది చేసినట్టే. ఇక ఇటువంటి సమస్యలను ఎదుర్కొనే స్త్రీ జీవితంలో మనోహరమైన వర్ణనాంశమేదయ్యా -

**ముద్దులొలికెడి చంటి బుజ్జాయి పాపాయి**
**వర్ణనీయాంశమై వరలుచుండ**

ఎంత పని హడావుడిలో ఉన్నా ఇంకా బడిలో కెళ్లకుండా ఇంట్లో ఉన్న ఓ చంటి పాప ఉందే.. అది వచ్చి అంత హడావుడిలో ఒక్కసారి కొంగు లాగి అమ్మా అనేసరికి ఆనందంతో ఈ తల్లి ఆ పిల్లను ఎగరేసి పట్టుకుంటుంది. అది వర్ణనీయాంశం..

ఇలాగే అవధానంలో ఆశుకవిత్వం అని ఉంటుంది. వెంటనే మొత్తం పద్యం అంతా చెప్పాలి. నాలుగు పాదాలు, నాలుగు ఆవృత్తులు అనే సమస్య ఉండదు దానికి. అలాగే స్త్రీ జీవితంలో కూడా వెంటనే హాజరు కావలిసిన పనులు కొన్ని ఉన్నాయి. ఏమిటయ్యా అవీ....

**పాలు, కూరలు, పండ్ల బండ్లవారల రాక**
**ఆశుధారా కవిత్వార్థమనగా**

పాలవాడు వస్తాడు.. టింగు టింగుమని బెల్లు కొడతాడు. వెంటనే వెళ్లి పోయించుకున్నామా, సరి. లేకపోతే పక్కింటికెళ్లిపోతాడు. అవసరం మనది తప్ప, వాళ్లది కాదు. ఇది ఆశు కవిత్వం కాదండీ. వెంటనే హాజరుకావలసిన పనికదా... అత్యవసరంగా. అలాగే ఘంటాగణనం ఉంటుంది, పురాణపఠనం కూడా ఉంటుంది. ఏ రకంగా పూరాణ పఠనం జరుగుతుంది. ఎవరు చేస్తారు.. ఇంట్లో పురాణం.. ఎవరు చదివేది అంటే....

**అత్తయ్య వేసేడి అక్షింతలవియన్నీ**
**పాత పురాణంబు పఠనమనగా**

అత్తగారు పొద్దుటే లేచి పురాణం విప్పుతుంది. మా కాలంలో ఇలాగే ఉన్నామా - మా మొగుళ్లను ఇలాగే చూశామా - ఏమిటో రోజులు మారిపోయాయని... పాపం ఈ కోడలు కూడా అనుకుంటుంది - విప్పిందిరా పురాణం, ఇక సాయంత్రం వరకూ మూయదు అని ! ఇది పురాణ పఠనం కాదా. అలాగే ఘంటాగణనం కూడా ఉంది.

**పోనీని రానీని ఫోను మోతల రోత**
**ఘంటికా గణనంబు కరణి దోప**

మాటిమాటికీ ఫోను మ్రోగుతూ ఉంటుంది. వచ్చే వరకూ ఆగదు. వచ్చాక పలకదు. అందుకని ఇటువంటి ఫోను మోతల్ని తట్టుకోవటం, సాయంత్రం భర్త రాగానే మీ కోసం వారు ఫోను చేశారు, వీరు ఫోను చేశారు అని ఇవన్నీ అప్పగించటం ఉందే.. ఇది ఘంటికా గణనం. ఇక అతి ముఖ్యమైనటువంటి అప్రస్తుత ప్రసంగం ఎవరు చేస్తారయ్యా అంటే...

**బోరు కొట్టించెడి ధారవాహిక సుత్తి అధిక ప్రసంగమై అడ్డుపడగ**

ఆ టీవీలు, ఈ టీవీలు.. అన్ని రకాల టీవీలు గలిపి రోజూ పదహారు సీరియల్స్ అందిస్తున్నాయ్. ఇవన్నీ అధిక ప్రసంగమే చేస్తున్నాయి. వీటిని కట్టలేము. కట్టకుండా ఉండలేము.

**దినము దినమిట్లు వనితలు తిప్పలు పడి**
**పూటపూటకు అవధాన పూర్ణ సిద్ధి తనరుచుండంగ**
**పురుషావధానులేల పరసహస్రావధానులీ పడుతులెల్ల**

ఆడవాళ్లందరూ ఇంట్లో అష్టావధానం కాదు, శతావధానం కాదు, సహస్రావధానం చేస్తున్నట్టే. అందుకని వేదికలెక్కి చేయలేదు అని బాధపడక్కల్లేదు. ఆడవాళ్లు కూడా అవధానం చేస్తే.. అవధానంలో గ్రామర్ పోటీ కంటే గ్లామర్ పోటీ ఎక్కువ అవుతుంది. అది మేం తట్టుకోలేము




కదా. అందుకని వాళ్లని ఇళ్లలోనే అవధానం చేసుకోనిద్దాం.

**అడుగడుగున నిషేధాజ్ఞ జారీచేయు భర్త నిషేధాక్షరార్తి దోప**
**గుపిళ్లనిండని గుడ్డి గవ్వల తోడ మాసమ్ముగడప సమస్య కాగా**
**అది సర్దుమిదిసర్దుమని చంపు కాన్వెంటు దత్తుండు దత్తపదమ్ము కాగా**
**ముద్దులొలికెడి చంటి బుజ్జాయి పాపాయి వర్ణనీయాంశమై వరలుచుండ**
**పాలు, కూరలు, పండ్ల బండ్లవారల రాక ఆశుధారా కవిత్వార్థమనగా**
**అత్తయ్య వేసేడి అక్షింతలవియన్నీ పాత పురాణంబు పఠనమనగా**
**పోనీని రానీని ఫోను మోతల రోత ఘంటికా గణనంబు కరణి దోప**
**బోరు కొట్టించెడి ధారవాహిక సుత్తి అధిక ప్రసంగమై అడ్డుపడగ**
**దినము దినమిట్లు వనితలు తిప్పలు పడి**
**పూటపూటకు అవధాన పూర్ణ సిద్ధి తనరుచుండంగ**
**పురుషావధానులేల పరసహస్రావధానులీ పడుతులెల్ల**

**◆ అవధానిగారూ... ఇప్పుడు ఆడవాళ్లు ఇంట్లో పడే శ్రమని మీరు అవధానంతో పోల్చారు, చాలా బాగుంది. అయితే ఈ రోజుల్లో ఆడవాళ్లు కూడా బయట ఉద్యోగాలు చేస్తున్నారు. దానివల్ల ఆడవాళ్లూ కష్టపడుతున్నారు, మగవాళ్లూ కష్టపడుతున్నారు. ఆ కష్టాలను వర్ణించండి.**

**ఈ ప్రశ్నకు అవధానిగారు చెప్పిన సమాధానం ఎలా ఉంటుందో వచ్చే సంచికలో.....**

రసజ్ఞులైన పాఠకులు కూడా ఈ 'పలకరిస్తే పద్యం' శీర్షికలో పాల్గొనవచ్చు. సంచికకు రెండు ప్రశ్నల చొప్పున పద్యాలు చెప్పడానికి మహాసహస్రావధాని గరికపాటి నరసింహారావు గారు అంగీకరించారు. 'హాసం' పాఠకులకే పరిమితమైన ఈ అమూల్య అవకాశాన్ని రసజ్ఞులందరూ వినియోగించుకుంటారని ఆశిస్తున్నాం. పద్యాన్ని కోరే పాఠకులు తాము ఇవ్వాలనుకుంటున్న సమస్యను ఈక్రింది చిరునామాకు పంపాలి.

**పలకరిస్తే పద్యం**
**హాసం, హాస్య - సంగీత పత్రిక,**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**బి.యస్.పి.కాలనీ, మోతీనగర్,**
**హైదరాబాద్ -500 018**

అవధాని గారి పద్యాలకు ఎంపికైన సమస్యలను పంపే పాఠకులకు తగిన బహుమతి ఉంటుంది.





# అన్నమయ్య పద భావ దర్శనమ్ 5



నిర్వహణ
జి.బాలకృష్ణప్రసాద్

## కడుపెంత తా కుడుచు...

సంపుటం -1- సంకీర్తనం: 302
సంగీత కూర్పు, గానం:
శ్రీ మంగళంపల్లి బాలమురళీ కృష్ణ
(టి.టి.డి.)వారి "అన్నమయ్య సంకీర్తన రవళి"
క్యాసెట్‌లోనిది.

కడుపెంత ? తాకుడుచు కుడుపెంత ? దీనికై
పడని పాట్లనెల్లఁ బడి పొరలనేల? ॥
పరుల మనసునకు ఆపదలు కలుగగ జేయు
పరితాపకరమైన బ్రదుకేల?
సొరిది నితరుల మేలు చూచి సైపగలేక
తిరుగుచుండెడి కష్టదేహమిది యేల ?॥
ఎదిరికెప్పడుఁ జేయు హితమెల్ల తనదనుచు
చదివి చెప్పని యట్టి చదువేల ?
పొదిగొన్న యాసలో బుంగుడై సతతంబు
సదమదంబై పడయు చవులు తనకేల ?
శ్రీవేంకటేశ్వరుని సేవారతికి గాక
జీవన భ్రాంతిఁబడు సిరులేల?
దేవోత్తముని నాత్మ దెలియ నొల్లక పెక్కు
త్రోవలేగిన దేహి దొరతనం బేల ?॥

తాత్పర్యము:

(మానవ జీవితానికి పరమార్థం పరమాత్మ సాక్షాత్కారం. భగవంతుని సేవించడం ద్వారా మాత్రమే ఇది సాధ్యం. దీనికి సహకరించని ఏ జీవన విధానమైనా - లౌకిక జీవితంలో ఎంతటి ఘనుడైనా - వృథాయే. ఈ విషయాన్ని స్పష్టీకరించేది ఈ సంకీర్తనం.)

మానవుడికున్న పొట్ట ఎంత ? జానెడు. దానికి కావలసిన తిండి ఎంత? పట్టెడు. ఆ పట్టెడన్నం కోసం పడరాని పాట్లుపడి, ఎంతకైనా దిగజారి మరీ మరీ ఈ సంసార కూపంలో పడి పొరులాడుతారేమిటి?

(పట్టెడి తిండికోసం అవస్థ పడటమే కాదు. అది దొరికినా )ఇతరుల మనసును గాయపరచే విధంగా ప్రవర్తిస్తూ వారిని ఆపదలపాలుచేస్తూ వుంటాడు కూడా. ఛీ ఛీ అనిపించే ఇటువంటి హీనమైన బ్రతుకెందుకు? ఇతరుల మేలు (ఉన్నత స్థితి, సంతోషకరమైన స్థితిని)చూసి సహించలేక మానసిక వ్యథతో దేహాన్ని నానా కష్టాలు పెట్టి తిరిగే జన్మ ("కష్ట దేహం" అంటే నీచమైన జీవనం అనే అర్థం చెప్పుకోవాలి) ఎందుకు ? వృథా.

వేదాలు, అనేక శాస్త్రాలు, పురాణేతిహాసాలు చాటి చెప్పిన ధర్మము, సత్యము ఒకటున్నది. అదే -" ఆత్మవత్సర్వభూతాని" (నిన్ను నీవు చూచుకొన్నట్లే అన్ని జీవులనూ చూచుకో). ఇది వంట బట్టిన వారు ఎదుటివారికి ఎన్నడూ అపకారం చెయ్యరు సరికదా - ఎదుటి వారికి జరిగిన మేలు తమకే జరిగినట్లు భావించి ఆనందిస్తారు. ఇటువంటి సుఖశాంతికరమైన విషయాలు కాక మరేవో దుర్భావాలు నూరిపోసే చదువులెవరిని ఉద్ధరించగలవు? ఒకటి తీరితే మరొకటి వంతున గుంపులు గుంపులుగా మీద పడి మానవుణ్ణి ముంచెత్తి కష్టాలతో సతమతం చేస్తాయి"ఆశలు"(దురాశలు). అటువంటి ఆశలపై రుచులు(ఆశక్తి) మనకెందుకు?(ఉన్నదాంట్లో తృప్తి చెందటమే స్వర్గసుఖాలకన్న మిన్న అని భావం)

అనేకరకాలైన ఐశ్వర్యాలు మానవుణ్ణి మత్తెక్కించి ప్రాపంచిక జీవితం మీదనే మరీ మరీ మరులు కొనేటట్లు చేసి జగత్ప్రభువైన శ్రీ వేంకటేశ్వరుని సేవానందానికి దూరం చేస్తున్నాయి. అటువంటి

సిరులెన్ని వున్నా వృథాయే కదా? అంతర్యామియై తనలోనే ఆ దేవోత్తముని దర్శించలేని అంధ మానవుడు రకరకాలుగా తన ప్రభుతను ప్రదర్శించబోతున్నాడు. బ్రహ్మాండ నాయకుడైన శ్రీ వేంకటేశ్వరుని సేవించలేని, తెలియలేనివాడు ఎంతటి చక్రవర్తియైనా ఆ దొరతనం శోభించదు. వృథాయే.

**కొన్ని పదాలకు అర్థాలు :-**

కుడుపు : తిండి, ఆహారము.
కుడుచు : ఆరగించు
పాట్లు : అవస్థలు, కష్టములు
పడిపొరలుట : తేజస్సు, కళ కోల్పోటం
సొరిదిన్ : క్రమముగా, పద్ధతిగా
హితము : మేలు
చదువు : వేదవిహితమైన జ్ఞానము; పరమాత్మ గురించి తెలియజేసేది
చదివి చెప్పనియట్టి చదువు : వేద విరుద్ధమైన మార్గంలో పడవేసే విద్య
పొదిగొన్న : గుంపులైన, అనేకములైన
బుంగుడై : మునిగి, లోబడి
పడయు : పొందు , సంపాదించు(ట)
సదమదంబై : సతమతమై, భరించలేక నలిగిపోయి
చవులు : రుచులు (ఇక్కడ భోగములు అని అర్థం చేసుకోవాలి)

**పాఠకులకు/ గాయనీ గాయకులకు గమనిక**

**ఈ క్రింది పదాలు ఇలా పలకాలి**

కడుపెంత = కడుపెన్త
తిరుగుచుండెడి = తిరుగుచుణ్డెడి
బుంగుడై = బుఙ్గుడై
సతతంబు = సతతమ్బు
సదమదంబై = సదమదమ్బై
శ్రీ వేంకటేశ్వరుని =శ్రీ వేఙ్కటేశ్వరుని
భ్రాంతి = భ్రాన్తి
దొరతనం = దొరతనమ్

**ప్రధానాంశం :**

మానవ జన్మకు ప్రయోజనము భగవత్సాక్షాత్కారము. అందుకు అత్యవసరమైన సాధనం దైవభక్తి. అది సాధించటానికి మాత్రమే జీవయాత్ర. జీవించడానికి ముఖ్యాధారం ఆహారం. ఆ ఆహారం పడవేయవలసిన కడుపెంత! (జానెడు మాత్రమే కదా!) ఆ కడుపుకు వలసిన కుడుపెంత! (కొద్దిపాటి ఆహారం చాలుకదా!) కడుపుకు వలసిన దానికి మించి భోగాలకు పోయి సంపాదించుకోవడమే అన్ని దురవస్థలకూ కారణం. చివరకు తన సాటి జీవులైన ఇతరుల మేలుచూచి ఓర్వలేక ఏవేవో చేయరాని పనులు చేస్తూ వివిధములైన కష్టాలలోపడి, తల మునిగి; చూచినవారు "అయ్యో!" అని జాలిపడే దుస్థితికి దిగజారుతున్నాడు మానవుడు.

దేవోత్తముడైన శ్రీ వేంకటేశ్వరుని (తనలోనే వున్నా) చూడలేకపోయిన మానవుడు శీలం కోల్పోయి ఎంత దొరయైతే మటుకు ఏమి ప్రయోజనం!

**ఆప్త వాక్యం**

"ఎన్నో అన్నమాచార్య సంకీర్తనలకు మధురమైన సంగీతం సమకూర్చి వేలాది అన్నమాచార్య సంకీర్తనల కచేరీలు దేశవిదేశాలలో చేసి సుప్రసిద్ధులైన బాలకృష్ణప్రసాద్‌గారు శ్రావ్యంగాను, సొగసుగాను పాడటంలో పేరెన్నికగన్నవారు. అన్నమాచార్య ప్రాజెక్టులో సీనియర్ గాయకులుగా, గత 25 సం.లుగా బహువిధాలుగా సేవలందిస్తున్నారు. క్యాసెట్స్ రికార్డింగ్ ద్వారా, విద్యార్థులకు పాఠాలు నేర్పడం ద్వారా అన్నమాచార్య సంకీర్తనలు జన బాహుళ్యంలోకి తీసుకువెళ్ళడంలో సఫలీకృతులైనారు. బాలకృష్ణప్రసాద్ గారు స్వరపరచిన అన్నమాచార్య సంకీర్తనలను నేర్చుకుని, అలాగే తిరిగి పాడాలన్న ఆకాంక్షతో పాడే గాయనీ గాయకులు దేశంలోని అనేక ప్రాంతాల్లో ఉన్నారు. అనేక అన్నమాచార్య సంకీర్తనలను స్వరసహితంగా పుస్తకాలుగా తిరుమల తిరుపతి దేవస్థానం ద్వారా ప్రచురించి సంగీత విద్యార్థులకు ఎంతో ఉపయోగపడేలా శ్రమిస్తున్నారు. మహా సంగీత విద్యావతంసులైన శ్రీ నేదునూరి కృష్ణమూర్తిగారు, శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు, శ్రీ పశుపతి గారు మొదలైన వారి ఆదర్శ ప్రాయమైన అడుగుజాడల్లో కళారంగంలో పురోగమిస్తూ ఎంతోమందికి అభిమానపాత్రులైనారు."

- ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం



**డిసెంబరు 15 బాపు పుట్టినరోజుని పురస్కరించుకుని....**

# బాపు బొమ్మల్లో

'బాపు తెలుగుజాతి గర్వించదగ్గ గొప్ప చిత్రకారుడు...
తెలుగు అమ్మాయిలు బాపు బొమ్మల్లా ఉండాలని తపస్సులూ గట్రా చేస్తూంటారు...
ఆయన సినిమాలు దృశ్యకావ్యాల్లా ఉంటాయి....'

బాపు గురించి ఎవరు చెప్పినా ఇవో, ఇలాటివో నాలుగు వాక్యాలు చెప్తారు. అందంగా బొమ్మలేసేవాళ్లు ఎందరు లేరు కనుక! బాపునే ప్రత్యేకంగా పేర్కొనడమెందుకు? బాపు బొమ్మల్లో విజువల్ బ్యూటీ ఉంటుంది కనుక!

విజువల్ బ్యూటీ అనే మాట వినగానే జనాలకు పర్వతసానువులు, పచ్చికబయళ్లు, పరవళ్లు తొక్కేనదులూ గుర్తుకురావచ్చు. కానీ మురికివాడలను కూడా హృదయానికి హత్తుకుపోయేట్లు కెమెరాలో బంధించగలిగే విద్య నేమనాలి? భావప్రకటీకరణకు అందుబాటులో ఉన్న ప్రతి అంశాన్ని అత్యంత ప్రతిభావంతంగా ఉపయోగించుకో గలిగిన నేర్పు నేమనాలి? బొమ్మలోని భావాన్ని మరింతగా ప్రస్ఫుటీకరించడానికి ప్రతి గీత, ప్రతి ఫ్రేము దోహదపడే సందర్భాల్లో దాన్ని విజువల్ బ్యూటీ అనకూడదా!?

**విజువల్ బ్యూటీని తెలుగులో హాయిగా, 'దృశ్య సౌందర్యం' అంటే మరింత అందగిస్తుందని డా॥ సి.నారాయణ రెడ్డి 'హాసం'కు సూచించారు.**

బాపు బొమ్మల్లో దృశ్య సౌందర్యాన్ని ఉదహరించడానికి ఇక్కడ కొన్ని కార్టూన్లను తీసుకోవడం జరిగింది. బాపు కార్టూన్‌లు మనకు ఓ బెంచ్‌మార్క్! జోక్‌కు, కార్టూన్‌కు తేడాను తేటతెల్లంగా చెప్పిన కార్టూన్లవి. కార్టూన్లు బాగా ప్రచారంలోకి వచ్చిన అయిదు దశాబ్దాల తర్వాత కూడా ఇద్దరు మనుష్యులను, పైన బబుల్స్‌నూ గీసి, వాటిల్లో ఓ జోక్ రాసేసి దాన్నే కార్టూన్‌గా చలామణీ చేసేవారుంటున్నారు కాబట్టి రెండింటికీ తేడా మళ్లీ పునశ్చరణ చేసుకోవలసిన అవసరం పడుతోంది.

ఎవరైనా చదివి వినిపిస్తే అందులోని జోక్ అర్థమయిపోతే దానికి కార్టూన్ అక్కర్లేదని అర్థం!

ఇది మామూలు కార్టూన్‌కు నిర్వచనం అయితే, మరి బాపు కార్టూన్ ప్రత్యేకత ఏమిటి? కొన్ని కొన్ని కార్టూన్లయితే, వాటినోసారి చూసినవారు అభినయించి చూపితే అవతలివారు అర్థం చేసుకోగలరు. కానీ బాపు కార్టూన్ల విషయంలో అది కుదరదు. అవి స్వయంగా చూసి తీరవలసినదే! అప్పుడు కానీ వాటిని పూర్తిగా ఆస్వాదించలేం!



అప్పు అడిగి, దొరకదని తెలిసిపోయాక అప్పటిదాకా తలతడిమి ముద్దు చేసిన కుర్రాణ్ని పోతూ పోతూ ఓ తాపు తన్నే అప్పారావు కార్టూన్ గుర్తు చేసుకోండి. ఆఖరి బిట్‌లో వంపు తిరిగిన అప్పారావు కాలిమీద మీ దృష్టి పడకపోతే మీరెంతో మిస్సయినట్టే!




అరిపాదం మీద కాఫీ కప్పు పెట్టి మర్యాదకు లోటు రాకుండానే కోడల్నేడిపించిన గడుసు అత్తగారి కొంగున వేళ్లాడే తాళం చెవులగుత్తి మీ కంటపడకపోతే మీరో మంచి పాయింటు మిస్సయినట్టే!



# దృశ్య సౌందర్యం

అలాగే ఈ క్రింది కార్టూన్నోసారి చూసి మీ ఫ్రెండు కెవరికైనా వివరించి చెబుదామని ప్రయత్నించండి చూద్దాం. తలకాయ కాస్త వంచి కళ్లజోళ్లోంచి కొడుకు కేసి గారంగా చూసే తండ్రి డాక్టరు బొమ్మ, పేషంటు మోచేతిని కూడా పట్టుకుని, అమాయకత్వం ఉట్టిపడే కళ్లతో స్టూలుమీద కూచున్న కుర్రడాక్టరు బొమ్మ మంచి చిత్రకారుడెవరైనా గీయగలరు, కార్టూన్‌ను రక్తి కట్టించగలరు. కానీ అక్కడ అదనపు ఆకర్షణ - బుగ్గలమధ్య థర్మామీటరు బిగిసిపోయి, మొహం కరంటుబల్బు షేపు కొచ్చేసిన పేషంటు అవస్థ! అది చూసి తీరవలసినదే కానీ వర్ణనకు, అభినయానికి లొంగదు.




ఈ కార్టూన్ చూడండి - ఎలుకల బాధ తప్పించుకోవడానికి పిల్లులు పెంచితే అవి నెత్తికెక్కి తొక్కడం అన్నది ప్రధానాంశం. కార్టూన్ చూడగానే అది మనసుకు తడుతుంది. నవ్వు వస్తుంది. కానీ ఇంకా పరికించి చూస్తే మరిన్ని అంశాలు తోస్తాయి. పిల్లులతో సహవాసం చేసి, చేసి భార్యాభర్తలిద్దరికీ పిల్లి పోలికలు వచ్చేశాయి. ఆయన మీసాలు పిల్లిమీసాలుగా పరివర్తనం చెందాయి. ఆడది కాబట్టి ఆవిడకు మీసాలు రాలేదు. ముక్కు, పెదాలు కలిసిపోయి పిల్లిరూపు సంతరించుకుంది. ఇదీ 'బాపూ టచ్'!




దీనిలో అతిథి తల మీద ఇంటివాళ్లబ్బాయి బంతితో పుటికీలు కొట్టుకోవడం అనే ఆలోచన నవ్వు తెప్పిస్తుంది. అక్కడికి కార్టూన్ పూర్తయినట్లే! కానీ బాపు అంతటితో వదిలిపెట్టలేదు. ఆ అతిథి బట్టతల పరికించండి. పుటికీ దెబ్బలు తిని, తిని స్ప్రింగులా ఎలా పైకి సాగిందో! నిజానికి పుటికీలు నేల మీద కానీ, గోడమీద కానీ కొట్టినప్పుడు నేల, గోడ ఈ విధంగా వ్యాకోచించినట్టు మనకనిపించదు. కానీ తలను ఒక స్ప్రింగులా ఊహించుకుని, ఆ దెబ్బలకు సాగినట్టు ఊహించి దాన్ని ప్రదర్శించి దృశ్య సౌందర్యాన్ని పెంచారు బాపు!




ఉద్యోగం కోసం వచ్చినవాడి కుర్రతనపు వేషాలు చూపించే ఈ కార్టూన్లో ఆ కుర్రాడు జులపాల జుత్తు, వెనక్కి వాలిన తీరు, చిటికలు వేసే విధానం - వీటిలో ఏది చూపించినా చాలు కార్టూన్ ప్రయోజనం సిద్ధించడానికి! ఫక్కున నవ్వేసి పేజీ తిప్పేస్తే మనకు దక్కే ఫలం కొంతే! అందుకే కాస్త ఆగండి. మీ కంటి కెమెరాను 'పాన్' చేసి టేబుల్ క్రిందగా తీసుకొచ్చి ఓనరుగారి మోకాళ్లపైకి తీసుకురండి. అక్కడ కనబడతాయి, కుర్రాడి బూట్లు! అప్పుడు బంగారానికి తావి అబ్బుతుంది! మొదటి నవ్వు కెరటం అణగారే లోపున రెండోనవ్వు కెరటం ప్రారంభమవుతుంది. పాలక మారుతుంది.




ఇవి నిశ్చలచిత్రాలు కాబట్టి స్టడీ చేయడానికి పాఠకుడు ఎంత సమయమైనా తీసుకోవచ్చు. కానీ చలనచిత్ర ప్రేక్షకుడికి అంతసేపు చూసే సావకాశం ఉండదు. అటువంటి సందర్భాల్లో బాపు కెమెరా కన్ను సహాయంతో ఆ దృశ్య సౌందర్యాన్ని ప్రేక్షకుడికి ఎలా చేరవేశారో వచ్చే సంచికలో...




# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

వెండితెర నవల 18

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
**ఇలపావులూరి మురళీమోహనరావు**

**జరిగిన కథ**

కుటుంబ బాధ్యతలున్న కృష్ణమూర్తి, భామలకు పెళ్లవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. అది భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలకు దారితీస్తుంది. శ్రీధరం బావమరిది గిరి, భామను బ్లాక్‌మెయిల్ చేసి గెస్ట్‌హౌస్‌కు రమ్మంటాడు. అక్కడ శ్రీధరం భార్య అతనికి బుద్ధి చెప్తుంది. ఇటు వసుంధర విదేశాలనుండి వచ్చిన బావను తనకు కాబోయే భర్తగా కృష్ణమూర్తికి పరిచయం చేసి క్రిస్మస్ పార్టీకి పిలుస్తుంది. ఇంటికి తిరిగివచ్చిన భామకు భర్త వసుంధరతో కలిసి పార్టీకి వెళ్లాడని తెలియడంతో అపార్థం చేసుకుని భర్తనుండి విడిపోవడానికి నిశ్చయించుకుంటుంది. కృష్ణమూర్తి చెప్పేది వినిపించుకోదు. ఈలోగా యజమాని శ్రీధరరావు షష్టిపూర్తి వేడుకలు సమీపిస్తాయి. -(ఇక చదవండి)

గార్డెన్లో అదొక వేదిక. దాని మీద ఒక రైల్వే కంపార్టు మెంట్ ఉన్నది. దాని ముందర వచ్చిన వాళ్ళు కూర్చోడానికి సరిపోయే చిన్నప్లాట్‌ఫామ్ లాంటిదుంది. అక్కడ ఉద్యోగులు, ఆహ్వానితులు కూర్చున్నారు. శ్రీధరం గారు చెప్పబోయే కబుర్లు వినాలని అంతా ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు.

స్టేజి మీద కొండల్రావు, శ్రీధరం నిలుచున్నారు.

"సైలెన్స్...సైలెన్స్.." అరిచాడు కొండల్రావు. అంతా నిశ్శబ్దమైంది. "కూచోండి, కూచోండి. వీడున్నాడే..వీడు.. మా వాడు..మీ బాసు ...వాడు లక్ష్మీపుత్రుడు. ఆగర్భశ్రీమంతుడు. వాడు పుట్టడమే ఓ పే....ద్ధ విమానంలో ఏర్ కండీషన్లో పుట్టాడు. కోటికి పడగెత్తి...." చెబుతున్నాడు కొండల్రావు.

"బాబాయ్...." వారించాడు శ్రీధరం.

"అబ్బబ్బ... పొగడనీడు. చంపేస్తాడు" నోరుమూశాడు కొండల్రావు.

శ్రీధరం గొంతు సవరించుకున్నాడు. "ఫ్రెండ్స్... నేనూ మా బాబాయ్ చెప్పినట్టు పుట్టుగొప్పవాడిని కాదు. పొట్టచేతబట్టుకుని ఈ ఊరు వచ్చిన మామూలు మనిషిని. పేదవాడిని. భగవంతుడి దయ, నా భార్య అదృష్టం, నా కష్టం.." చెబుతుండగా కృష్ణమూర్తి కూడా వచ్చి స్టేజి ముందు ఇతరుల మధ్య కూర్చున్నాడు.





కొంచెం దూరంలో మంగళ మహిళలతో ముచ్చట్లు చెబుతున్నది. ఆవిడ చెప్పే మాటలు శ్రద్ధగా ఆలకిస్తున్నారు వాళ్ళు.

శ్రీధరం చెప్పసాగాడు. "మీ లాంటి వాళ్ళ స్నేహం, సాయం వీటి వల్ల కోటీశ్వరుడినయ్యాను... పెళ్ళికాగానే ఉద్యోగం వెతుక్కుంటూ నా భార్యతో వచ్చాను. ఉద్యోగం దొరకలేదు. ఇల్లు దొరకలేదు. దొరికినా డబ్బులేదు. ఆ స్థితిలో అడుగో -మా బాబాయ్ దేవుడిలా కనిపించాడు. స్టేషన్‌యార్డులో ఒక మూలగా పడివున్న పాతరైలు పెట్టెను చూపించాడు". రైలు పెట్టెను చూపిస్తూ వెళ్ళి ఆ పెట్టెలోని సీటు మీద కూర్చున్నాడు శ్రీధరం. కిటికీ లోంచి బైటికి చూస్తూ "నాలుగు రోజులు ఇందులో ఉండు. ఎవరూ ఏమీ అనరులే" అన్నాడు. నాలుగురోజులనుకున్నది నాలుగునెలలున్నాం. నాలుగురోజులు మస్తు-పదిరోజులు పస్తు. ఓ రోజు నా భార్య నాకో సలహా చెప్పింది. 'ఈ కూలి నాలి పనులు ఇలాగే ఉంటాయి. సుబ్బరంగా వ్యాపారం చెయ్యండి మనమే పది మందికి పని ఇవ్వచ్చు' అంది."

అక్కడ మంగళ తన చుట్టూ కూర్చున్న వాళ్ళతో చెబుతున్నది. భామ ఆమెకు దగ్గరగా కూర్చున్నది. "నేనా సలహా ఇవ్వగానే ఆయన పకాలున నవ్వారు. 'సామెత చెప్పినట్లుంది. తిండికే దిక్కులేదు. వ్యాపారం ఎలా చెయ్యనూ?' అన్నారు" అన్నది.



ఇవతల శ్రీధరం కొనసాగించాడు. "ఆనాడు నాకు తెలియని వ్యాపారసూత్రాన్ని, ఈ నాటికీ నేను అనుసరించే సత్యాన్ని, మా ఆవిడ మూడు ముక్కల్లో నూటిగా నాకు చెప్పింది. 'వ్యాపారానికి పెద్ద పెట్టుబడి కాదు ముఖ్యం. అడవిలో ఉప్పు దొరకదు. అక్కడ ఉప్పు అమ్మితే లాభం. సముద్రపొడ్డున చింతపండు దొరకదు. అక్కడ చింతపండు అమ్మితే లాభం. ఈ రెండూ

దొరకని పట్టణాలలో రెండూ కలిపి ఊరగాయ అమ్మితే లాభం' అని చెప్పింది" అన్నాడు.

అందరూ నవ్వుతూ చప్పట్లు కొట్టారు. భార్య పట్ల కృతజ్ఞతా భావంతో శ్రీధరం హృదయం బరువెక్కింది. నయనాలు అశ్రుపూరితాలై గొంతు బొంగురు పోయింది. కళ్ళజోడు తీసి కన్నీళ్ళు తుడుచుకున్నాడు. "పసుపుకొమ్ము మెళ్ళో కట్టుకుని పుస్తెలు తీసిచ్చింది. ఆవిడ పుస్తే నాకు కోట్లకు పునాది అయింది. నేనెవర్నో , ఎక్కడ బయలుదేరానో, మర్చిపోకుండా, మాయ కమ్మకుండా, ఆనాటి ఆ రైలు పెట్టెను వేలంలో కొనుక్కున్నాను. ముస్తాబు చేసుకున్నాను. ఇదే నా అసలు ఇల్లు, ఇదే నా గుడి, బడి, బతుకు పెట్టుబడి" అన్నాడు.



అందరూ హర్షధ్వానాలు చేశారు.

"ఈ పెట్టె ఒక్కటీ పెట్టుబడి అంటే నేను ఒప్పుకోను సార్... ఈ అదృష్టమంతా మీ భార్యగారిది. ఎడ్డెమంటే తెడ్డె మనకుండా, ఆకు చాటు పిందెలా, అణిగి అందగించిన...' చెబుతున్నాడు కృష్ణమూర్తి.

శ్రీధరం నవ్వి "కె.కె.. తమరు కవిత్వంలో పడిపోతున్నారు" అన్నాడు. అందరూ నవ్వారు.

అవతల భామ మంగళను అడుగుతున్నది. "అంటే మీ ఇద్దరి మధ్యా ఎప్పుడూ, దేనికీ తగాదాలు రాలేదాండీ" అని...

"భలేదానివే తగాదాల్లేని బ్రతుకు పోపులేని చారులా చప్పగా ఉంటుంది. ఒకరికొకరు రబ్బరు స్టాంపులా ఉండకూడదంటా రాయన. మాకూ ఎన్నో గిల్లి కజ్జాలూ, యుద్ధాలు, పెడమొహాలూ.. " అన్నది మంగళ.



అక్కడ శ్రీధరం కూడా తన కబుర్లతో అందరికీ ఉత్సాహాన్ని కలిగిస్తున్నాడు. "ఒకసారేమైందంటే ..నేనూ... ఓ...సారీ.. మీరేదో పండగ కదా అని సరదాగా వస్తే సుత్తి కొట్టేస్తున్నట్టున్నాను...'రెస్పాన్సు కోసం చూశాడు.

"అబ్బే ..అదేం లేదండీ" కోరస్‌గా అన్నారందరూ.

"చెప్పండిసార్.. ప్లీజ్... ముహూర్తానికింకా చాలా టైముంది" అన్నాడు కృష్ణమూర్తి.

"ఆల్‌రైట్.. వందలనుంచి లక్షలకు చేరిన రోజుల్లో ఓసారీ..." చెబుతున్నాడు శ్రీధరం.

అక్కడ మంగళ భామతో అంటున్నది - "పాత చీరె ఏదైనా ఉంటే ఇవ్వండమ్మగారూ అని పనిమనిషి అడిగితే ఓ చీరె ఇచ్చాను..."

ఇక్కడ శ్రీధరం కంటిన్యూ చేస్తున్నాడు ".. అది నాకు తెలియదు. నాకు చాలా ఇష్టమైన చీరెల్లో అదొకటి. ఓ రోజు సాయంకాలం ఇంటికొచ్చి నా గదిలోకి వెళ్ళే సరికి ..హ..హ..హ... పనిపిల్ల పక్కలు సర్దుతోంది. సంజె వెలుగులో ఆ చీర చూసి మా ఆవిడే అనుకున్నాను. ఏమిటే ఇవాళ ఈ చీర కట్టావు అని భుజాల మీద చేతులు వేశాను. పనిపిల్ల అదిరివడి వెనక్కు తిరిగి చూసింది.."



అందరూ పక పక నవ్వారు శ్రీధరం మాటలకు.

"...నేను కంగారు పడి వెనక్కు తిరిగాను. అప్పుడే గదిలోకి వస్తున్న మా ఆవిడ ఇది చూసి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది." చెప్పాడు శ్రీధరం.

"మీరు ఇదీ సంగతి అని చెప్పినా నమ్మలేదా?" కుతూహలంగా అడిగాడు కృష్ణమూర్తి.



"ఆవిడ అడగందే నేనెలా చెప్పనయ్యా? ఆవిడ అడగలేదు. నేను సంజాయిషీ చెప్పలేదు" అన్నాడు శ్రీధరం.

అక్కడ మంగళ కూడా ఇదే సన్నివేశాన్ని చెబుతున్నది. "నేను ఏమని అడగ్గలను? ఇంత మంచివారికి ఇంతపాడు బుద్ధి ఏమిటని బాధపడ్డాను. ఆయన చెప్పొచ్చుగా.... చెప్పలేదు" చెప్పింది మంగళ.

ఈ సమస్యను తమ యజమాని ఎలా పరిష్కరించుకున్నాడోనని అందరూ ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు. వారి ఉత్సాహాన్ని గమనించి "..పదిహేనురోజులపాటు ఈ సైలెంట్ యుద్ధం సాగింది. ఆవిడ అన్నం వడ్డించి అటు తిరగడం, నేను ఇటుతిరిగి రెండు మెతుకులు మింగి పారిపోవడం... బతుకు నరకప్రాయం అయిపోయింది. నన్ను నిలదీసి అడగొచ్చు కదా. అడగలేదు. అంటే... నేను పాపిష్టి పనిచేశానని నమ్మినట్టే గదా! నాకూ కష్టం వేసింది. కోపం వచ్చింది" చెబుతున్నాడు శ్రీధరం.

అక్కడ భామలో ఉత్కంఠ పెరిగిపోతున్నది. ఏ విధంగా ఈ అపార్థాన్ని మాపుకొన్నారోనని "మీరెప్పుడడిగారు?" అడిగింది మంగళను.



"ఇప్పటికీ అడగలేదు. అడిగే అవసరం లేకుండా ఆయనే జవాబు ఏర్పాటు చేశారు. ఓనాడు సాయంత్రం ఆఫీసు నుంచి రాగానే ఇంట్లోకి రాకుండా లాన్లో కూర్చున్నారు. అర్జెంటుగా టీ పట్రమ్మని నౌకరుతో కబురు చేశారు. నేనా పూజలో ఉన్నాను. వెంటనే వెళ్ళకపోతే అలిగి టీ వద్దంటారు. పూజ మానేసి టీ తీసుకుని వెళ్ళాను. ఆయన కుర్చీలో వెనక్కి చేరబడి కళ్ళు మూసుకుని కూర్చున్నారు. 'పూజలో ఉన్నాను లేస్తే దేవుడికి కోపం. లేచి రాకపోతే మీకు కోపం. మీ కన్నా ఆ దేవుడే నయం.' అంటూ ఆయన కూర్చున్న కుర్చీ చేతుల మీద కూర్చున్నాను. కుర్చీలో మనిషి 'అమ్మగారూ' అంటూ దిగ్గున లేచి దణ్ణం పెట్టి పారిపోయాడు" అన్నది మంగళ.

"అంటే ?" ఆశ్చర్యంగా అడిగింది సత్యభామ.

"అంటే ..ఆయన సూటూ బూటూ తొడిగించి పనివాడిని కూర్చోబెట్టారన్నమాట. నేను కంగారుపడి పక్కకు చూశాను. చెట్టు చాటున అలాంటి సూటు,బూటులోనే వున్న మా వారు నాకేసి చూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు" నవ్వుతూ ముగించింది మంగళ.

"ఆయన మిమ్మల్నేం అడగలేదా?" అడిగింది భామ.

"నేను అడగడానికి అసహ్యించుకున్న ప్రశ్నకు ఆయన జవాబు అలా ఇచ్చారన్నమాట. కంటికి కనిపించినవన్నీ కనిపించినట్లే ఉండవు. నిజాలూ కాకపోవచ్చు. తెల్లని వన్నీ పాలు కావు. ఏమైనా కాపురానికి పునాది నమ్మకం. గౌరవం. అనుమానం వస్తే అడగాలే తప్ప మనసులో కుళ్ళుకుంటే అది ఎదుటవాళ్ళను అవమాన పరచడమే.. పద.." లేచింది మంగళ.



భామ గుండెల్ని సూటిగా తాకాయూ మాటలు. మనసులో అనుమానపు పొరలు మంచులా కరగడం ఆరంభించాయి.

(ఇంకావుంది)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | : కుళందైయుం దైవముం | లేతమనసులు |
| రచన | : కణ్ణదాసన్ | ఆరుద్ర |
| సంగీతం | : విశ్వనాథన్ | విశ్వనాథన్ |
| గానం | : ఎం.ఎస్.రాజేశ్వరి | సుశీల |

'కుళందైయుం దైవముం' తమిళ చిత్రమూ, ఆ చిత్రం ఆధారంగా నిర్మించిన 'లేతమనసులు' తెలుగు చిత్రమూ - ఇద్దరు చిన్నపిల్లలు విడిపోయిన తమ తల్లిదండ్రులను కలిపిన కథను చెప్పాయని ఇదివరలోనే ప్రస్తావించుకున్నాము. ఆ పిల్లలిద్దరూ కవలపిల్లలు. తాము కవలలమని తెలుసుకున్న ఆ అమ్మాయిలు - తామూ, తమ తల్లిదండ్రులూ కలిసి జీవించగలిగితే బాగుంటుందనుకొంటారు.

తల్లి దగ్గర పెరుగుతున్న అమ్మాయి- తాతగారికి తమ పరిస్థితి గురించి చెబుతూ బాధపడే సన్నివేశం కోసం తమిళ చిత్రంలో 'కోళి ఒరు కూట్టిలే' అనే పాట రాయించారు. తమిళగీతాన్ని కణ్ణదాసన్ రాశారు. చిన్నపిల్లలకు పాడడం ద్వారా పెద్ద పేరు తెచ్చుకున్న ఎం.ఎస్.రాజేశ్వరి ఆ పాట పాడారు. తెలుగుచిత్రంలోని అదే సన్నివేశం కోసం 'కోడి ఒక కోనలో' పిల్లలతో మొదలయ్యే పాటను ఆరుద్ర రాశారు. పి.సుశీల పాడారు.

తమిళ చిత్రానికీ తెలుగు చిత్రానికీ - ఎం.ఎస్.విశ్వనాథన్ సంగీతం సమకూర్చారు. సినిమాలలో పిల్లల గురించి ప్రస్తావించినపుడు కొన్ని చిత్రాలలో పిల్లలు ఈడుకు తగ్గట్టు ప్రవర్తించరనీ మాటాడరనీ చాలా మంది అంటూంటారని అనుకున్నాము. 'కోళి ఒరు కూట్టిలే' అనే తమిళ గీతంలోనూ ఆ పాటుండే చోట 'లేతమనసులు'లో ఉన్న తెలుగు పాటలోను - పిల్లల ఈడుకు మించిన అభిప్రాయాలు కనిపిస్తాయి.

తమిళచిత్రంలోని ఈ పాట సన్నివేశంలో బేబి పద్మినితో పాటు కథానాయిక జమున, ఆమె తండ్రి వేషం వేసిన మేజర్ సుందర్‌రాజన్ కనిపిస్తారు. ముందుగా కణ్ణదాసన్ రాసిన తమిళగీతం:

కోళి ఒరు కూట్టిలే
శేవల్ ఒరు కూట్టిలే
కోళిక్కుంజు రెండుమిప్పో
అన్బిల్లాద కాట్టిలే

ఈ తమిళగీతం ప్రతిపదార్థాలు :

కోళి = కోడి, ఒరు కూట్టిలే =ఒక గూటిలో, శేవల్= పుంజు, ఒరు కూట్టిలే = ఒక గూటిలో, కోళిక్కుంజు రెండుం = కోడి పిల్లలు రెండూ, ఇప్పో = ఇప్పుడు, అన్బు=ప్రేమ, ఇల్లాద=లేని కాట్టిలే = అడవిలో.

పశువైత్తేడి కన్నుక్కుట్టి
పాల్ కుడిక్క ఓడుదు
పఱవైకూడ ఇఱై యెడుత్తు
పిళ్ళైక్కెల్లాం ఊట్టుదు
తాత్తా తెరియుమా పాత్తా పురియుమా
తనిత్తనియా పిరింజిరుక్క
ఎంగళాలే ముడియుమా

పశువై = ఆవును, తేడి = వెదుక్కుంటూ, కన్నుకుట్టి = దూడ, పాల్ = పాలు, కుడిక్క = తాగడానికి ,ఓడుదు= పరుగెడుతుంది, పఱవై = పక్షి, కూడ = కూడా, ఇఱై = ఎరను, ఎడుత్తు = తీసుకొని, పిళ్ళైక్కు = పిల్లలకు, ఎల్లాం= అన్నిటికీ, ఊట్టుదు = తినిపిస్తుంది. తాత్తా = తాతయ్యా, తెరియుమా= తెలుసా, పాత్తా =చూస్తే , పురియుమా= అర్థం అవుతుందా, తనిత్తనియా= విడివిడిగా, పిరింజు = విడిపోయి, ఇరుక్కు= ఉండడానికి, ఎంగళాలే= మావల్ల, ముడియుమా= అవుతుందా,

అడుత్త వీట్టు ప్పాప్పా ఇప్పో
అమ్మా అప్పా మడియిలే
అదిర్‌ష్టమిల్లా పెణ్ణుక్కుత్తాన్
శేర్తుప్పార్క ముడియల్లే
అమ్మా మఱక్కల్లే అప్పా నినైక్కల్లే
అంగుం ఇంగుం శేర్తువైక్క
ఎంగళుక్కుం వయసిల్లే
ఉంగళుక్కుం మనసిల్లే

అడుత్త = పక్క, వీట్టు=ఇంటి, పాప్పా= పాపాయి, ఇప్పో=ఇప్పుడు, అమ్మా అప్పా= అమ్మా నాన్నల, మడియిలే= ఒడిలో, అదిర్‌ష్టం= అదృష్టం, ఇల్లా=లేని, పెణ్ణుక్కుత్తాన్=అమ్మాయికి మాత్రం, శేర్తు= కలిపి, పార్క= చూడడానికి, ముడియల్లే=వీలుకాలేదు, అమ్మా=అమ్మ, మఱక్కల్లే= మరిచిపోలేదు, అప్పా=నాన్న, నినైక్కల్లే=అనుకోవడంలేదు, అంగుం=అక్కడా, ఇంగుం=ఇక్కడా, శేర్తువైక్క=కలపడానికి, ఎంగళుక్కుం=మాకు, వయసు=వయసు, ఇల్లే = లేదు, ఉంగళుక్కుం= మీకు, మనసిల్లే=మనసులేదు.

**ఈ పాటలో చెప్పిన భావాలు ఇవి :**

కోడి ఒక గూటిలో ఉంది. పుంజు మరొక గూటిలో ఉంది. కోడిపిల్లలు రెండూ ప్రేమలేని అడవిలో ఉన్నాయి. ఆవును వెదుక్కుంటూ వెళ్ళి లేగదూడ పాలుతాగుతున్నది. పక్షి కూడా తిండి తెచ్చి పిల్లలకు పెడుతున్నది. తాతా నీకు తెలుసా? చూస్తే అర్థమవుతుందా? మేము విడివిడిగా ఉండగలమా?

పక్కింటి పాపాయి అమ్మనాన్నల ఒడిలో ఉంది. అదృష్టంలేని

కోళి ఒరు కూట్టిలే
శేవల్ ఒరు కూట్టిలే
కోళిక్కుంజు రెండుమిప్పో
అన్బిల్లాద కాట్టిలే
పశువైత్తేడి కన్నుక్కుట్టి
పాల్ కుడిక్క ఓడుదు
పఱవైకూడ ఇఱై యెడుత్తు
పిళ్ళైక్కెల్లాం ఊట్టుదు
తాత్తా తెరియుమా పాత్తా పురియుమా
తనిత్తనియా పిరింజిరుక్క
ఎంగళాలే ముడియుమా
అడుత్త వీట్టు ప్పాప్పా ఇప్పో
అమ్మా అప్పా మడియిలే
అదిర్‌ష్టమిల్లా పెణ్ణుక్కుత్తాన్
శేర్తుప్పార్క ముడియల్లే
అమ్మా మఱక్కల్లే అప్పా నినైక్కల్లే
అంగుం ఇంగుం శేర్తువైక్క
ఎంగళుక్కుం వయసిల్లే
ఉంగళుక్కుం మనసిల్లే





'లేతమనసులు' చిత్రం కోసం ఆరుద్ర రాసిన తెలుగు పాట ఇది :

కోడి ఒక కోనలో
పుంజు ఒక కోనలో
పిల్లలేమో తల్లడిల్లె ప్రేమ లేని కానలో

పాలకొరకు లేగదూడ పరుగులెత్తి సాగును
పక్షికూడ కూడుతెచ్చి పంచిపెట్టి మురియును
తాతా తెలుసునా, జాలీ కలుగునా
విడి విడిగా జీవించే వేదనలే తీరునా

పొరుగువాళ్ల పాపలాగ పెట్టిపుట్టలేదులే
అమ్మతో నాన్నతో హాయి నోచుకోములే
అమ్మా మరవదు నాన్న తలవడు
కన్నవాళ్ల కలుపుటకు
మాకు వయసు లేదులే
మీకు మనసు రాదులే



అమ్మాయికి తల్లిదండ్రులనూ, తోబుట్టువునూ కలిసే వీలు లేకుండా ఉంది. అమ్మ మరువలేదు. నాన్న తలవడం లేదు. అక్కడి వారినీ ఇక్కడి వారినీ కలిపేందుకు చిన్న పిల్లలమైన మాకు వయసు చాలదు. మీకు (పెద్దలకు) మనసులేదు.

తెలుగు చిత్రంలోని పాట సన్నివేశంలో బేబిపద్మినితో బాటు జమున, ఆమె తండ్రి వేషం వేసిన రేలంగి కనిపిస్తారు.

ఆరుద్ర రాసిన తెలుగుపాట-కణ్ణదాసన్ రాసిన తమిళ గీతంలోని భావాలను చాలావరకు అనుసరించినట్టు కనిపిస్తుంది. తమిళంలో పక్కింటి పాపాయి తల్లిదండ్రుల ఒడిలో ఉందని ఉండగా - ఆ అభిప్రాయం తెలుగులో 'పొరుగువాళ్ల పాపలాగ పెట్టి పుట్టలేదులే' అని ఉంది. ఆ తర్వాతి పంక్తి తమిళంలో 'అదృష్టంలేని అమ్మాయికి అయినవాళ్లను కలిపే వీలులేదు" అని ఉంది. తెలుగులో ఈ అభిప్రాయం 'అమ్మతో నాన్నతో హాయి నోచుకోలేదు' అని కనిపిస్తుంది.

'పెట్టిపుట్టడం', 'నోచుకోవడం', పిల్లల స్థాయికి మించిన మాటలు.

తమిళగీతంలో పల్లవిలో 'గూడు' ప్రస్తావన మాత్రమే ఉంది. తెలుగులో గూడు 'కోన' అయింది. పిల్లలు ప్రేమలేని అడవిలో ఉన్నారని తమిళంలో ఉన్న అభిప్రాయాన్ని తెలుగు పాటలోని 'పిల్లలేమో తల్లడిల్లె ప్రేమలేని కానలో' అనే పంక్తి ప్రతిధ్వనిస్తున్నది. అయితే 'కాన' తో ప్రాస కలపడం కోసం పల్లవిలోకి 'కోన' వచ్చినట్టు కనిపిస్తుంది.

తెలుగుపాటలో 'తాతా' అనే మాట ఉచ్చారణ కొంత ప్రత్యేకంగా ధ్వనిస్తుంది.

తమిళగీతంలోని 'ఆవును వెదుక్కుంటూ లేగదూడ వెడుతుంది' అన్న భావం తెలుగులో 'పాల కొరకు లేగదూడ పరుగులెత్తి సాగును' అని వ్యక్తమయింది.

తమిళగీతంలో లేగదూడ ప్రస్తావన, పక్షి పిల్లలకు తిండి పెట్టే ప్రస్తావన ఎందుకు ఉన్నాయో తెలియదు. పక్షులూ , పశువులూ కలిసి ఉన్నా తమ కుటుంబం కలిసి ఉండకపోవడం గురించి ఆ చిన్నారి బాలిక బాధపడుతూ ఉందని అనుకోవాలేమో! చుట్టూ ఉన్న మనుషులూ, పశుపక్షులు సుఖంగా ఉన్నా తాము సుఖంగా లేదన్న బాధ ఆ అమ్మాయి చేత అలా పాడించి ఉండాలి!

అక్కడినీ ఇక్కడినీ కలపడానికి తమకు వయసు లేదని తమిళగీతంలో ఉన్న అభిప్రాయం. పిల్లలకూ, పెద్దలకూ కూడా వర్తిస్తుంది. తెలుగు పాటలోని 'కన్నవాళ్లని కలుపుటకు మాకు వయసు లేదులే' అనే పంక్తి - కన్నవాళ్లు కలిస్తే పిల్లలూ కలుస్తారన్న అభిప్రాయాన్ని చెబుతున్నది. ఈ తమిళ , తెలుగు గీతాలు - చిన్న పిల్లలు పాడినా - పెద్దరికం ధ్వనించే పాటలుగానే పరిగణించాలి!

**- పి.ఎస్.గోపాలకృష్ణ**



న్యూస్ ఫ్లాష్



## రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో 12 గంటలపాటు ఘంటసాల గీతయజ్ఞం

డిసెంబరు 4 హైదరాబాద్ రవీంద్రభారతిలో ఉదయం 10 గంటలనుండి రాత్రి 10 గంటలవరకూ ప్రముఖగాయకుడు గంగాధర్ నిర్వహణలో ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ ఘంటసాల పేరుతో 'గీతయజ్ఞం' నిర్వహించనుంది.

మన రాష్ట్ర ప్రభుత్వం ఘంటసాల పేరుతో 12 గంటలపాటు ఓ కార్యక్రమం చేయటం ఇదే ప్రథమం. ఈ కార్యక్రమాన్ని డిసెంబర్ 4 ఉదయం గవర్నర్ శ్రీ సుషీల్‌కుమార్ షిండే ప్రారంభిస్తారు. ఈ కార్యక్రమానికి పద్మవిభూషణ్ డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, పద్మశ్రీ డా॥ అక్కినేని నాగేశ్వరరావు, డా॥ సి.నారాయణరెడ్డి విచ్చేస్తారు. ఈ కార్యక్రమంలో గంగాధర్‌తో గళం కలిపే ప్రసిద్ధ సినీ నేపథ్యగాయకులలో పద్మశ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల, ఎస్.జానకి, పి.లీల, కె. జమునారాణి ఉండటం విశేషం. ఈ గీతయజ్ఞంలో ఘంటసాల ఆలపించిన భక్తి, దేశభక్తి, లలిత, జానపద, ప్రబోధాత్మక, విషాద, వియోగ గీతాలతో పాటు భగవద్గీత శ్లోకాలు , పద్యాలు పాడుతున్నామని గంగాధర్ తెలిపారు.

ముగింపు కార్యక్రమంలో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ వై.యస్.రాజశేఖర్ రెడ్డి, మెగాస్టార్ చిరంజీవి, మంత్రులు షబ్బీర్ అలీ, గీతారెడ్డి, నేదురుమల్లి రాజ్యలక్ష్మి తదితరులు - గాయనీ గాయకులు, వాద్య కళాకారుల బృందాన్ని సత్కరించనున్నారు. ప్రముఖ సినీ నటులు గుమ్మడి, గిరిబాబు, రాజేంద్రప్రసాద్, వాణిశ్రీ, రాజశేఖర్ మొదలగువారు ప్రత్యేక అతిథులుగా విచ్చేయనున్న ఈ కార్యక్రమంలో ఇంకా అనేక మంది సినీ, రాజకీయ ప్రముఖులు విచ్చేయనున్నట్టు కార్యక్రమ నిర్వాహకుడు గంగాధర్ తెలిపారు.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**రమణశాస్త్రి,సంగారెడ్డి.**

ప్ర ॥ కండక్టర్ ఆశ్చర్యపోయేదెప్పుడు?

జ॥ నువ్వు ఎంగిలి చేసిన టిక్కెట్లు నాకు వద్దు అని ప్రయాణం చేసేవారు అన్నప్పుడు.

ప్ర ॥ ఫోటోగ్రాఫర్ విస్తుపోయేదెప్పుడు?

జ ॥ బురఖాలువేసుకున్న స్త్రీలు వచ్చి అందంగా ఫోటో తీయమన్నప్పుడు.

**వి.మంజూరాణి, హైదరాబాద్.**

ప్ర ॥ సౌగంధికా కమలం ఎక్కడుందో తెలుసుకోవాలంటే, హనుమంతుణ్ణే అడగాలని భీముడికి ఎలా తట్టింది?

జ ॥ బ్రహ్మచారి 'శత'మర్కటః అన్నారు. 'సౌ' అంటే వంద. హనుంతుడు బ్రహ్మచారి, ఇలా వర్క్‌వుట్ అయ్యాయి కనుక ఆయన్ని అడిగితే వర్కవుట్ అవుతుందనుకొని వుంటాడు భీముడు.

## పేరు - రిపేరు



ఓ అబ్బాయి ఒక అమ్మాయికి ఉత్తరం ఇలా రాశాడు
(ఫిబ్రవరి14 నెక్లెస్ రోడ్డు, ప్రేమికులరోజు)
ప్రియమైన నీకు - అమృత - మనసంతా నువ్వే-
నువ్వు నాకు నచ్చావ్- నవ్వులేక నేనులేను-
సప్తపది - కలిసినడుద్దాం-పెళ్ళిచేసుకుందాం రా.
(ప్రేమతో, బద్రి)
ఆ అబ్బాయికి తిరుగు టపాలో వచ్చిన జవాబు ఇలా ఉంది
నాన్నగారు - చండశాసనుడు - అన్నయ్య - హిట్లర్-
తమ్ముడు - కిరాతకుడు- మాతోపెట్టుకోకు - టాప్‌లేచిపోద్ది.

**-రావి రాజ్యలక్ష్మి, సీతారామపురం.**

భైరవద్వీపం - భూతాలదీవి

**-బి.చంద్రశేఖరయ్య,రామసముద్రం.**

## షార్ట్‌కట్స్



| | | |
|---|---|---|
| పెనమకుమారి నందిని | - | పెనం |
| కందుకూరి చందన | - | కంచం |
| చెంగల్వ చారుమతి | - | చెంచా |
| రోణంకి లుంబినీదేవి | - | రోలు |
| చెందనపల్లి బుచ్చెమ్మ | - | చెంబు |
| మూలా తరళాదేవి | - | మూత |
| పాలంకి త్రయంబకేశ్వరి | - | పాత్ర |
| సీమకుర్తి సావిత్రి | - | సీసా |

**-న్యాయపతి బాలకృష్ణారావు, గుల్‌బర్గా.**



## చిలిపి లిపి



| | |
|---|---|
| Him saw | - హింస |
| way D | - వేడి |
| Co - D | - కోడి |

**-వరదా సాయికుమార్, పర్లాకిమిడి.**

| | |
|---|---|
| Gumg | - గంజి |

**-జి. శ్రీధర్, నెల్లూరు**

## ఈ రూటే వేరు



Small car farmer - సన్నకారు రైతు
Slow Eye - మెల్లకన్ను
Dreams Crop - కలలపంట

-బి.శ్రీనివాసచారి, హైదరాబాద్

## చిలిపి కవిత



మా ఊరి ఇన్స్పెక్టరు పేరు దాసు
విపరీతంగా పుచ్చుకుంటాడు డోసు
తాగినమైకంలో కామోసు
తన మీద తనే పెట్టుకున్నాడు కేసు

-పులిపాక తాజుద్దీన్. జయపూర్.

## పేరడీ పెరేడ్



మనిషికి మెడ భారమా
మెడకు తల భారమా
తలకొక హెల్మెట్ భారమా
కాదంటే క్లాసుపీకి ఫైను వేయుమా ॥మనిషికి॥
గతుకుల రోడ్డుపైన తల అదురుట ఉండదు
ర్యాషుగ డ్యాషిచ్చిన లైఫుకు ముప్పుండదు
పిచ్చి పిచ్చి హారన్లతొ చెవికి చేటు ఉండదు
ముందు చూపె తప్ప నీకు పక్క చూపు ఉండదూ
తలకొక హెల్మెట్ భారమా
కాదంటే క్లాసుపీకి ఫైను వేయుమా ॥మనిషికి॥
బండిని కొనగానే సరిపోదుర సోదరా
రూల్సుకు అనువుగా ఖర్చు పెరుగు నాయనా
ఎన్నికలొచ్చినపుడె నిన్ను చూసుకొందుము
అంతవరకు అన్నిటినీ భరియిస్తూ ఉండుము
తలకొక హెల్మెట్ భారమా
కాదంటే క్లాసుపీకి ఫైన్ వేయుమా ॥మనిషికి॥
('మంచిమనసుకు మంచి రోజులు' సినిమాలోని 'ధరణికి గిరి భారమా' అనే పాటకు పేరడీగా...)

-ఎన్.వి.శివరామకృష్ణ, హైద్రాబాద్.

## డబుల్ రోల్



వెళ్లేముందు తాళం కప్ప నా కప్పగించాలి
ఆ నారి ఉత్త పిసినారి

- వి.మంజురాణి, హైద్రాబాద్.

ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన **ఎన్.వి.శివరామకృష్ణ** గారికి సోహన్ మ్యూజిక్ వారు 'సాప్రూట్ రీమిక్స్' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.






# జధ్యా మారుత

(12)





(ఇలా సినిమా తీయడం)

ఇట్స్ నాట్ ఎ జోక్

# ష్...గప్ చుప్ !



ఇది ఒక తమాషా కథ. ఈ కథలో లవ్ వుంటుంది, టెన్షన్ వుంటుంది, సస్పెన్స్ వుంటుంది. ఓ అందమైన ట్రీట్‌మెంట్‌తో జంధ్యాల ఈ చిత్రాన్ని తీర్చిదిద్దారు. ఇందులో కథ కంటే ట్రీట్‌మెంట్‌కే ఎక్కువ ప్రాధాన్య మిచ్చారాయన. కేవలం హాస్యం, హాస్య పాత్రలుగా కాకుండా ఉద్యోగం చేసుకునే ఒక మధ్య తరగతి అమ్మాయిని తీసుకుని ఆ అమ్మాయి చుట్టూ రసవత్తరమైన కథను సహజ సంఘటనలతో అల్లారాయన. ఈ చిత్రంలో అన్నీ సాఫ్ట్ కేరెక్టర్స్. అస్సలు విలన్స్ లేరు. ప్రతి పాత్రకీ ఓ ఐడెంటిటీ వుంది.

'మిస్టర్ పెళ్లాం' నిర్మాతల్లో ఒకరైన శంకు ఆధ్వర్యంలో వచ్చిన 'క్రోక్విల్ హాస్యప్రియ' పత్రికలో 'ష్... గప్‌చుప్'! పేరుతో ఆంధ్రుల అహ్లాద రచయితగా పేర్గాంచిన మల్లాది వెంకట కృష్ణమూర్తి ఒక సీరియల్ రాశారు. అన్ని వర్గాల పాఠకుల్ని అలరించిన ఆ సీరియల్‌ని అదే పేరుతో తెరకెక్కించారు జంధ్యాల. నవలని సినిమాగా మలచటానికి మల్లాది కూడా ఎంతో సహకరించారు. జంధ్యాల, మల్లాది ఇద్దరూ కలిసి పామ్‌గ్రోవ్ హోటల్‌లో కూర్చుని రెండు గంటల్లో వన్‌లైన్ ఆర్డర్ తయారు చేసుకున్నారు. అందుకే టైటిల్స్‌లో స్క్రీన్‌ప్లేకి సంబంధించి జంధ్యాల, మల్లాది పేర్లు కనిపిస్తాయి.

మల్లాది గతంలో రాసిన కొన్ని షార్ట్ స్టోరీస్‌ని ఈ సినిమాలో సీన్లుగా ఉపయోగించుకోవడం జరిగింది. సినిమాలో భానుప్రియ తమ్ముడు అమెరికాలో స్నేహితుడికి కుందేలును గిఫ్ట్‌గా పంపే ఎపిసోడ్ మల్లాది షార్ట్ స్టోరీనే. 'ఆంధ్రజ్యోతి' వీక్లీలో మల్లాది రాసిన 'చిన్న బహుమతి' కథ ఆధారంగా ఆ సీన్ క్రియేట్ చేశారు జంధ్యాల.

ఇక టైటిల్ అంటారా ! దొంగతనం చేసే

## పాటలు

**రారా ! దొంగ సామీ! పాకెట్టు మారా! లాకెట్టు చోరా!**
రచన : వేటూరి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం
**అభినయం : వరుణ్‌రాజ్, శుభలేఖ సుధాకర్**

**అలరులు కురియగ ఆడినదే అలకల కులుకుల అలమేల్ మంగా**
అన్నమాచార్యకీర్తన
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం
**అభినయం : వరుణ్‌రాజ్,భానుప్రియ**

**కుహూ! కుహూ మన్నది కోకిలెందుకో**
రచన : వేటూరి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, చిత్ర
**అభినయం : వరుణ్‌రాజ్,భానుప్రియ**

**తిట్ల దండకం**
రచన : జొన్నవిత్తుల
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, శైలజ

**తెలుగందాలే నను తొంగి తొంగి చూసెనమ్మా తొలకరిగా**
రచన : వేటూరి
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, చిత్ర
**అభినయం : వరుణ్‌రాజ్,భానుప్రియ**

**ఓ బాబయ్యో! లోకాన రైలు బండి చికు-చికు అంటుంది**
గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం
**అభినయం : బాబూమోహన్**

వాళ్లు గప్‌చుప్‌గా వుండాలంటారు కదా. ఆ కోణంలో మల్లాది తన సీరియల్‌కి పెట్టిన టైటిల్‌కే జంధ్యాల ఓటు వేశారు.

ప్రగతి చిత్ర పతాకంపై రూపొందిన ఈ చిత్రంలో వరుణ్‌రాజ్, భానుప్రియ హీరో, హీరోయిన్లు. ఈ కథ మొత్తం భానుప్రియ చుట్టూనే తిరుగుతుంది. భానుప్రియ ఓ బ్యాంకులో పనిచేస్తుంటుంది. ఆఫీసులోనే కాకుండా, ఇంట్లో కూడా చాలా స్ట్రిక్ట్‌గా, సిస్టమాటిక్‌గా వుంటుంది. అందుకే ఇంట్లో వాళ్ళు 'హిట్లరక్కా' అని ముద్దుగా పిలుచుకుంటుంటారు.

భానుప్రియకిది వందో చిత్రం కావడం గమనార్హం. జంధ్యాల దర్శకత్వంలో భానుప్రియ నటించిన రెండవ చిత్రం ఇది. జంధ్యాల 14వ చిత్రం 'మొగుడు - పెళ్లాలు'లో తొలిసారిగా నటించిన భానుప్రియకు మళ్లీ ఇరవై రెండు చిత్రాల గ్యాప్ తర్వాత గానీ ఆయన కాంబినేషన్‌లో చేసే అవకాశం రాలేదు. ఈ సినిమా చేసే నాటికి ఆమెకు తెలుగులో కొంచెం గ్యాప్ వచ్చింది. "భానుప్రియ తెలుగుకి దూరమైన ఫీలింగ్ ఈ చిత్రంతో పోతుంది. హీరో ఎవరన్నది అడగకుండా ఈ చిత్రంలో చేయడానికి భానుప్రియ అంగీకరించింది. ఆమె ప్రతిభకు అద్దం పట్టే చిత్రమిది. ఇటువంటి సబ్జెక్టు నేనింతవరకూ చేయలేదు. ఈ సినిమా చేస్తుంటే 'శ్రీవారికి ప్రేమలేఖ' చిత్రం చేసిన రోజులు గుర్తొస్తున్నాయి" అని జంధ్యాల ఈ షూటింగ్ సమయంలో చెప్పారు. 'రవళి'గా భానుప్రియ అభినయానికి ముగ్ధుడైపోయిన జంధ్యాల 'ఈ అమ్మాయి నటన సావిత్రిని మరిపిస్తుంది' అని సన్నిహితుడైన రచయిత మల్లాది వెంకటకృష్ణమూర్తి దగ్గర ప్రస్తావించడం జరిగింది. ముఖ్యంగా వేలుతో భానుప్రియ చేసిన సెంటిమెంట్ సీన్స్ చూసి ఆయన పులకించి పోయారట.

ఈ సినిమా చేస్తున్నందుకు భానుప్రియ కూడా చాలా ఆనందపడిపోయారు. "జంధ్యాల గారి దర్శకత్వంలో సినిమా చేస్తున్నందుకు ఎంతో సంతోషంగా వుంది. జంధ్యాల తరహా సినిమా అయినా, నా క్యారెక్టర్‌లో సీరియస్‌నెస్ వుంది. నా క్యారెక్టర్ మాత్రమే కాదు, ఇతర క్యారెక్టర్స్ అన్నీ కూడా నాకు నచ్చాయి. ఇతర క్యారెక్టర్స్ చేసే హాస్యానికి నవ్వు ఆపుకోలేక చాలా కష్టపడి పోతున్నాం! ఇందులో నాకిష్టమైన క్లాసికల్ డాన్స్ కూడా ఒకటుంది. షూటింగ్ అంతా చాలా సరదాగా జరిగిపోతోంది. ఎంతో హోమ్లీగా వుంది. నాలుగేళ్ళ తర్వాత మా సొంతవూరైన రాజమండ్రికి వచ్చి షూటింగ్ చేస్తున్నాను" అని భానుప్రియ రాజమండ్రి అవుట్‌డోర్ షూటింగ్ సమయంలో చెప్పారు.

ఇందులో వేలు చేసిన ముత్యాలరావు పాత్ర చాలా గమ్మత్తుగా వుంటుంది. భానుప్రియ తండ్రి అయిన వేలు పిచ్చాసుపత్రిలో ఉద్యోగిగా చేసి రిటైరవుతాడు. కానీ అక్కడ పిచ్చి ఈయన కొచ్చినట్టుగా ప్రవరిస్తుంటాడు. ఏదైనా అడగ్గానే ఇవ్వకపోతే ఇల్లో, చెట్టో ఎక్కి కూర్చుంటాడు. అక్కడ నుంచి దిగనంటాడు. ఓసారేమో కూతురు దగ్గరకొచ్చి మొగల్తూరు అబ్బాయి చిరంజీవిని మద్రాసు వెళ్ళి చూసొస్తానంటాడు. ఇంకొకసారి అమితాబ్ బచ్చన్‌ని బొంబాయి వెళ్ళి కలిసొస్తాను, లక్షరూపాయలివ్వమంటాడు. మరొకసారేమో ఎదురింటి పనిమనిషిని ప్రేమించానని, పెళ్ళి చేయమని భార్యని పిచ్చికోరిక కోరి చెట్టెక్కి కూర్చుంటాడు. బందరు లడ్డు ఆశ చూపించి కిందికి దింపేస్తుంది కూతురు భానుప్రియ.

**రిలీజ్**
12-5-1994

**నిర్మాణ ప్రాంతాలు**
హైద్రాబాద్, సంఘీనగర్, వైజాగ్, రాజమండ్రి, కొవ్వూరు, పట్టిసీమ, గోదావరి తీరప్రాంతాలు.

స్వీట్లు తినాలన్న తన జిహ్వాచాపల్యం కోసం ఓ కుర్రాడికి పాతిక రూపాయలు కూలీ ఇచ్చి కూతురికి పెళ్ళి చూపులు ఏర్పాటు చేస్తాడు వేలు. ఈ సందర్భంలో వేలు, భానుప్రియల మధ్య సెంటిమెంట్ సీన్స్ చాలా హార్ట్‌టచింగ్‌గా చిత్రీకరించారు జంధ్యాల.

సుత్తివేలు తన పాత్ర గురించి విశ్లేషిస్తూ -"ఇందులో నాది చాలా మంచి పాత్ర. జంధ్యాలగారి సినిమాల్లో నేను అన్నీ హాస్య


వరుణ్‌రాజ్, జంధ్యాల, భానుప్రియ





# ష్...గప్ చుప్! లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్



- మీది శుభ కార్యం. మాది శుభ్రకార్యం.
- పెళ్లి కొడుకు ఈయన కొడుకా సార్
  కాదు ఈయనే పెళ్లికొడుకు
  చాలా అందంగా ఉన్నారు.... బైదిబై రెండో పెళ్లా సార్...
  కాదు మొదటి పెళ్లే
  జుత్తు మాత్రం విగ్గులా ఉంది సార్.
- నేను కోప్పడ్డానని అలిగి అలకాపురి చేరారు
- నీ రింగురింగుల ఉంగరాల జుట్టు ఏమైపోయింది శేషూ?
  అప్పులవాళ్లు క్షవరం చేశారు భువనా. అవునూ... లేత తమలపాకులాంటి పల్చటి నీ శరీరం ఇలా బరస్ట్ అవబోయే ట్యూబ్‌లా తయారైందేమిటి భువనా
  ఆ మధ్య నాకు డింగో జబ్బు వచ్చి ఇలా ఊరిపోయాను శేషూ.



- అంత అరుపెందుకుయ్యా ఈనే పందిలాగా
  అమ్మో అమ్మో... మీ పోలికలకు నిప్పెట్ట. ఎంత బాగా పోల్చుతారో తమరు.
- ఇది అవని... ఆడరౌడీ అంటాం మేం, ఇతను గుండు జ్ఞానేశ్వరం.. సందేహాల పుట్ట, ఈయన క్లర్క్ అన్నవరం... వసపిట్ట, ఈ బ్రాంచ్‌కి వాకింగ్ రేడియో, టాకింగ్ టీవీ ఈయనే.
- అన్నం తిన్నవాడు చెయ్యి కడుక్కుంటాడు గానీ, పక్కవాడు కడుక్కుంటాడంటోయ్! మొలకెత్తిన మినపగింజ ముఖం నువ్వునూ!
- ఏమేమ్ చెత్తబ్బాయ్ వచ్చాడు...
  ఆ పేరు వద్దు సార్. అది వినిపిస్తే చెవిలో సీసం పోసి కరిగించి వేసినంత బాధగా ఉంది
- పట్టు వదలని విక్రమార్కునిలాగా నేను పెట్టె వదలని విక్రమార్కుడిని.
- జిగట విరోచనాలతో బాధపడుతున్న జిరాఫీ మొహం వేసుకుని ఇంత పొద్దున్నే తగలడ్డావేంటోయ్.
  ఊ... మీ పోలికల్ని పాతేయ్యా. ఎంత చక్కటి ఉపమానాలంకారాలు వాడతారండీ మీరు.
  ఉప్మానా... దాన్ని నేనూ ప్రేమిస్తా.



- మాచెస్ ఆర్ మేడిన్ హెవెన్ అంటారు. ఎవరికి ఎవరు రాసి పెట్టున్నారో ఎవరికి తెలుసు?
  సారీ మాస్టారు. మాచిస్ ఆర్ మేడిన్ శివకాశి. మనం వాడే అగ్గిపెట్టెలన్నీ శివకాశిలో తయారు చేస్తారు.
- మావా సక్సెస్... ఇవిగో నోట్లు... నాకివే కోటాను కోట్లు... నా నూరేళ్ల పంటకి బంగారు నాట్లు. ఇరవై రూపాయల ఖర్చుకి గుప్పెడు వంద నోట్ల సంపాదన.
  ఇరవై ఇచ్చి పదహారు రూపాయలు దొంగతనం చేస్తావా? నా దొంగల కాలేజీకే సిగ్గుచేటు.
  దరిద్రుడు టెంకాయ ముట్టుకుంటే అది వంకాయ అయిపోతుందంటే ఇదే మాస్టారూ...
- పిల్ల విమ్ వేసి కడిగిన స్టీలు బిందెలా తళతళలాడుతోంది.
- బందరులో పుట్టడమనేది మన అదృష్టమోయ్. అదేమన్నా సామాన్యమైన ఊరా. ఆంధ్రా బ్యాంక్‌కి రిజిస్టర్ ఆఫీసు బందరు. ఎల్ .ఐ.సి హెడ్డాఫీసు బందరు. రాబర్ట్ సన్ పేట, పెంచోరిపేట, బచ్చుపేట, గొడుగు పేట,సర్కిల్‌పేట. అదే బెజవాడ తీసుకో లబ్బీపేట, గాంధీనగర్, సత్యనారాయణపురం.. ఇట్టా ఉంటాయ్. 'బచ్చుపేట' అనడంలో వున్న అందం, సత్యనారాయణపురం అని అనడంలో ఉందేటయ్యా,

బందరు తొక్కుడు లడ్డు అంటే ఎంత ఫేమస్సో నీకు తెలుసా..

- అయ్యా ! ఈ సుదీర్ఘ సుత్తికి బదులు ఆ సైకిల్ గుద్దినందుకు నన్ను అరెస్ట్ చేసి ఉరిశిక్ష వేసినా రుచిగా వుండేదయ్యా
- మీరు వ్యభిచారా అని ఆడదాన్ని, నువ్వు దొంగా అని మగవాడిని అడగకూడని ప్రశ్నలు.
- ఊరంతా గోల్డ్‌మెడలిస్ట్‌లైన నా విద్యార్థులే వున్నారు మీ గోల్డ్ జాగ్రత్త.
- ఆ రోజుల్లో సన్నగా గుమ్మడి పాదులా ఉండేదానివి.. ఆఫ్‌కోర్స్ ఇప్పుడు గుమ్మడికాయలా ఉన్నావనుకో
- సోదర సోదరీమణులారా ఈ రోజు చాలా సుదినం. ఎందుకంటే మరి..



ఎక్స్‌క్యూజ్‌మి... ప్రేక్షకులకు చిన్న విన్నపం ఎ.టి.వి.4451 కార్ డ్రైవర్ ఎక్కడున్నా వెంటనే స్టేజ్‌మీదకు రావాలి.
మీరు కానివ్వండి.
ఆ... సోదర సోదరీమణులారా ఈ రోజు చాలా సుదినం. ఎందుకంటే మరి..
ఒక్క నిమిషం... ఇరవై నాలుగేళ్లు గల బాలాకుమారి అనే అమ్మాయి తప్పిపోయింది. ఎవరికైనా కనబడితే ఎత్తుకొచ్చి ఇక్కడ అప్పజెప్పగలరు. మీరు కానీవండి సార్...
సోదర సోదరీమణులారా ఈ రోజు చాలా సుదినం. ఎందుకంటే మరి..
ఒన్ మినిట్.. ఈ ఉపన్యాసం ఇంత చెత్తగా ఉన్నా సరే... తరువాతి ప్రోగ్రామ్స్ చాలా అందంగా ఉంటాయి.
అంతదాకా మీరు ఓపిగ్గా కూర్చోవలసినదిగా ప్రార్థిస్తున్నాం. మీరు కానీవండి సార్...
ఆ..సోదర సోదరీమణులారా ఈ రోజు చాలా సుదినం. ఎందుకంటే మరి..
ఒక్క నిమిషం.. ఈ ప్రోగ్రాం అయిన తరువాత అన్ని రూట్లకీ బస్సులున్నాయ్... ఈ గమనిక మీకు తెలియగలదు.
మీరు కానీవండి మాస్టారూ.
ఏంటి కానిచ్చేది నీ బొంద.



- ఆగండి... ఎవరన్నా ప్లేట్లలో చేయి పెడితే పిట్టల్ని కాల్చినట్లు కాల్చేస్తా. ఇవి నిజం తుపాకులే. కాకపోతే వాడి చాలాకాలం అవటం వల్ల తుప్పట్టిపోయాయంతే.

ఎవరు మీరు?
మేం పాపికొండల్లో ఉన్న కొండపాపులం. ఈయనే మా బాస్... బాదం సుబ్బారావు. ఈ రూట్లో వెళ్లే పడవల్ని దోచుకుంటుంటాం.
కాకపోతే ఈ మధ్య ఇటుపక్క వెళ్తున్న పడవలు తగ్గటం వల్ల ఏనుగుల్లా ఉండేవాళ్లం పీనుగుల్లా అయిపోయాం.

- మీ దరిద్రపు మొహాల్ని కందిరీగలు పీక. మా ఆటపాటలతో మిమ్మల్ని ఆనందింపజేయాలా.
- మావా సక్సెస్. ఇదిగో ముగ్గు... ఆపు నీ దగ్గు... బేబీ, వద్దు నీకు సిగ్గు... నీ మెడ ఇటు ఒగ్గు... మెళ్లో కడతానీ డిగ్గు.

డిగ్గేమిటి?
కొన్ని పదాలకు అర్థాలుండవ్.. జస్ట్ ప్రాసకోసం కూశానంతే.



- బుట్టకుంది చిల్లు... అది కూల్చింది నీ ఇల్లు.
- దరిద్రుడు కారు ముట్టుకుంటే అది రిక్షా అయిపోయిందని ఇదే మాస్టారూ.
- కొట్టే కొబ్బరికాయ్ కొట్టుకురావల్సిందే.
- ఛీ నోర్ముయ్.. ముళ్లు పీకేసిన ముళ్లపంది మొహం వేసుకుని సొగసుకాడనని చెప్పుకోవటానికి సిగ్గులేదు నీకు.
- నీకో రహస్యం తెలుసా.. ఎవరికీ తెలీదది. బందరు అమ్మాయిలు కేవలం బందరులో మాత్రమే పుడతారోయ్
- బాంబే(బొంబాయి) బాంబే (బాంబుయే)తుస్సుమందంటే ఇంక నీకు పెళ్లేంట్రా నీ బ్రతుకు చెడ.
- నువ్వు చెయ్యమన్నప్పుడు చేయటానికి ఆగమన్నప్పుడు ఆగటానికి నేను తిక్కంటిని కాదు ముక్కంటిని.
- దరిద్రుడు బంగారం ముట్టుకుంటే గొడ్డుకారం అయిందని ఇదే మాస్టారూ.





## కథాంశం

రాజమండ్రి
స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్‌లో
క్యాషియర్‌గా పని చేస్తుంది రవళి.
మతిస్థిమితం లేని తండ్రి మూలంగా ఎన్నో
సమస్యలు ఎదుర్కొంటూ ఉంటుంది.
రవళిని ఓ టీవీ ప్రోగ్రామ్‌లో చూసి
ప్రేమిస్తాడు శ్రీకాంత్. ఆమె కోసం
బ్యాంక్‌లో అకౌంట్ ఓపెన్ చేసి రోజూ
వెళ్తుంటాడు. చివరికో రోజున తన ప్రేమను
ఆమెకు చెప్పి ఆమె మనసు
గెలుచుకుంటాడు. రవళి దగ్గరున్న బ్యాంక్
సొమ్ము లక్ష రూపాయల్ని ఎవడో దొంగ
కొట్టేస్తాడు. ఆ డబ్బుని బ్యాంక్‌లో లెక్క
చెప్పడం కోసం నానా ఇబ్బందులు
పడుతుంది. శ్రీకాంత్ ఎవరైనా దొంగ
ద్వారా ఆ బ్యాంక్‌లో దొంగతనం చేయించి
రవళిని కాపాడాలనుకుంటాడు. చివరికి
పోలీసులకి లొంగిపోదాం అనుకుంటున్న
సమయంలో ఓ పెద్దావిడ వచ్చి ఆ లక్ష
ఇస్తుంది. తానెప్పుడో రైలులో హెల్ప్ చేసిన
ఆ పెద్దావిడ మనవడే రవళి దగ్గర లక్ష
దొంగలిస్తాడు. ఆ విషయం తెలుసుకుని ఆ
పెద్దావిడ తన మనవడు దొంగిలించిన
డబ్బును తిరిగి ఇచ్చేస్తుంది. ఇలా సమస్యల్ని
ఛేదించుకుని రవళి, శ్రీకాంత్ పెళ్లి
చేసుకోవడంతో
కథ సుఖాంతమవుతుంది.

ప్రధాన పాత్రలే పోషించాను. అందుకే ఇందులో కావాలని ఆయన నాతో కామెడీ విత్ సీరియస్ కేరెక్టర్ చేయించారు. నా పాత్రలో సీరియస్‌నెస్, చిన్న పెర్వర్షన్‌తో పాటు సెంటిమెంట్, అంతర్లీనంగా కామెడీ కూడా ఉంటుంది" అని తెలిపారు.

కోట శ్రీనివాసరావుది మరో తమాషా పాత్ర. అందరూ ఈయన్ని 'బందరు ఎస్.ఐ' అంటుంటారు. అతనికి బందరు అంటే మహా ఇష్టం. ఎవడైనా మర్డరు చేసి నేరస్తునిగా చిక్కినా, అతగాడు 'మా ఊరు బందరం'టే చాలు ఒదిలేస్తాడు. 'ఇది నా కెరీర్‌లో మరొక వెరైటీ కేరెక్టరు' అని అంటారు కోట.

ఈ చిత్రంలో భానుప్రియ పనిచేసే బ్యాంక్ ఉద్యోగులే ముఖ్య నటీనటవర్గం- ఒక్క హీరో తప్ప. భానుప్రియని టీవీ ప్రోగ్రామ్‌లో చూసి లవ్‌లో పడి, ఆ తర్వాత ఆమె సమస్యల్లో పాలుపంచుకుని, వాటి పరిష్కారానికి ఆమెకు సహాయపడే పాత్రను వరుణ్‌రాజ్ చక్కగా పోషించారు. మలయాళీ అయిన వరుణ్‌రాజ్ కాకుండా కొద్దిగా పేరున్న తెలుగు నటుణ్ణి అయినా హీరోగా పెట్టుకుని వుంటే ఇంకా బాగుండేదని సినిమా రిలీజ్ అయిన తర్వాత జంధ్యాల దగ్గరే చాలామంది కామెంట్ చేయడం జరిగింది.

మామూలుగా జంధ్యాల చిత్రాల్లో వుండే మేనరిజమ్స్ ఇందులో కూడా వున్నాయి. బ్యాంకు ఉద్యోగులందరివీ రకరకాల క్యారెక్టర్స్.

అన్నవరంగా నటించిన ఏవీఎస్‌కి ఏదైనా విషయం తెలిస్తే, ఆ విషయాన్ని ఆగమేఘాల మీద వేరొకరికి చెప్పేవరకూ నిద్రపట్టదు సరికదా కడుపులో ఆ విషయాన్ని దాచుకోవడం వల్ల కడుపు ఉబ్బిపోతుంటుంది. ఒకానొక సందర్భంలో భానుప్రియ లక్షరూపాయలు పోగొట్టిన విషయం తెలుస్తుంది. దాన్ని బైటకు చెబితే ప్రమాదం - కానీ కడుపేమో ఉబ్బిపోతూ వుంటుంది. 'మిస్టర్ పెళ్ళాం' లో లాగానే ఇందులో కూడా తుత్తి తరహా సంభాషణనే కొనసాగిస్తారు ఏ.వి.ఎస్. తమాషా ఏమిటంటే ఏవిఎస్ నాన్నగా నటించినాయనకి ఏవిఎస్సే తుత్తి తరహాలో డబ్బింగ్ చెప్పారు. అవకాశం దొరికితే జంధ్యాల కామెడీని కొత్త తరహాలో క్రియేట్ చేస్తారనడానికి ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే.

బ్యాంక్ మేనేజర్ శ్రీలక్ష్మి, హెడ్‌క్యాషియర్ ధర్మవరపు సుబ్రహ్మణ్యం ఫ్లాష్‌బ్యాక్‌లో లవర్స్. అనుకోకుండా ఇద్దరూ



విడిపోయి, వేర్వేరు పెళ్ళిళ్ళు చేసుకుంటారు. కొన్నేళ్ళ తర్వాత ఇద్దరూ ఒకేచోట పనిచేయాల్సి వస్తుంది. శ్రీలక్ష్మికి బ్లడ్‌ప్రెషర్ ఎక్కువ. ఆ విషయం తెలుసు కాబట్టి ఆమెకు కోపం రాగానే ఓ పాట పాడి, డ్రీమ్స్‌లో ఇద్దరూ పాడుకున్నట్టుగా ఊహించుకుని ఆమె కోపాన్ని కరిగించేస్తుంటాడు ధర్మవరపు. వీరిద్దరి ప్రేమకు జంధ్యాల భలే కామెడీ కోటింగ్ ఇచ్చారు. 'చెంగావి రంగు చీర'పాట పాడుతూ తాము నాగేశ్వరరావు, వాణీశ్రీల్లా గానూ, 'ఓ చిన్నదాన నన్ను వదిలిపోతావటే' పాటలో కృష్ణ - కాంచనల్లాగా, 'లాహిరి లాహిరి లాహిరి' పాటలో ఎన్.టి.ఆర్. - సంధ్యల్లాగా ఊహించేసుకుంటారు. ఈ చివరి పాటలో ధర్మవరపు సుబ్రహ్మణ్యం కృష్ణుడి గెటప్‌లోనూ, శ్రీలక్ష్మి రుక్మిణిగానూ కనిపిస్తారు.

"శ్రీలక్ష్మి గారి కాంబినేషన్‌లో నాకు ఈ సినిమాలో మంచి కామెడీ పండించే అవకాశం లభించింది. ఆమెకు బి.పి. వచ్చినప్పుడల్లా నేను డ్యూయెట్ పాడి కూల్ చేస్తుంటాను. ఈ డ్యూయెట్ల వల్ల ఎన్టిఆర్‌గారిలా కృష్ణుడి వేషం వేయగలిగాను" అని తన పాత్ర తాలూకు విశేషాలను వివరించారు ధర్మవరపు.

టైటిల్స్ పడుతున్నప్పుడు వచ్చే,'ఓ బాబయ్యో! లోకాన రైలుబండి చికు చికు అంటుందీ' పాటలో బాబూమోహన్ గుడ్డి బిచ్చగాడుగా కనిపిస్తారు. అయితే నిజంగా అతను గుడ్డివాడు కాదు. ఈ సాంగ్‌ని బాబూమోహన్ మాడ్యు లేషన్‌తో ఎస్.పి. బాల సుబ్రహ్మణ్యం సరదాగా ఆలపించారు. సినిమా మొదట్లో ముష్టివాడిగా కనిపించిన బాబూమోహన్, సినిమా చివర్లో దొంగ గంగులుగా కనిపిస్తాడు. ఈ గంగులు హీరో చిరంజీవికి వీరాభిమాని. 'జై చిరు' అనేది ఇతని ఊతపదం. బ్యాంక్ దొంగతనం సీన్‌లో రొటీన్‌కి భిన్నంగా వుండాలనే ఉద్దేశ్యంతో 'హేండ్సప్' అని కాకుండా, 'లెగ్స్ అప్' అని చమత్కరించడం బాగుంటుంది.

ఇక వరుణ్‌రాజ్ స్నేహితునిగా నటించిన శుభలేఖ సుధాకర్ విషయానికొద్దాం. యురేకా ఫోర్బ్స్ వాక్యూమ్ క్లీనర్స్ కంపెనీలో సేల్స్‌మెన్ ఇతను. ఎవరివో పెళ్లి చూపులు జరుగుతుంటే వాళ్ళని ఇబ్బంది పెట్టి మరీ ఈ వాక్యూమ్

## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| శ్రీకాంత్ | : వరుణ్‌రాజ్ |
| రవళి | : భానుప్రియ |
| దొంగల తల్లి | : నిర్మలమ్మ |
| ముష్టివాడు | : బాబూమోహన్ |
| శంకర్‌రావు | : శుభలేఖ సుధాకర్ |
| ఇన్‌స్పెక్టరు భద్రం | : కోట శ్రీనివాస రావు |
| ముత్యాల రావు | : వేలు |
| బ్యాంక్ ఎంప్లాయి | : చిట్టిబాబు |
| గుండుజ్ఞానేశ్వరం | : గుండు హనుమంతరావు |
| అన్నవరం | : ఏ.వి.ఎస్ |
| శేషాద్రి | : ధర్మవరపు సుబ్రహ్మణ్యం |
| భువనేశ్వరి | : శ్రీలక్ష్మి |
| కళ్యాణి | : అనూష |
| భజగోవిందం | : జిత్ మోహన్‌మిత్రా |
| సుమతి (రవళి తల్లి) | : అనిత |
| రామయ్య | : రామయ్య |
| ఝాన్సీ | : ఝాన్సీ |
| అరబ్లేడు అంజయ్య | : అలీ |
| హనుమయ్య | : రాళ్ళపల్లి |
| ముక్కంటి | : బ్రహ్మానందం |
| కానిస్టేబుల్ | : విశ్వేశ్వరరావు |

క్లీనర్ గురించి 'డిమాన్‌స్ట్రేషన్' ఇస్తాడు. వాక్యూమ్ క్లీనర్ ఆన్ చేయగానే ఆ ఫోర్స్‌కి పెళ్ళికొడుకు విగ్గు కాస్తా ఎగిరిపోతుంది. దాంతో పెళ్ళి చూపులు ఆగిపోతాయి. పెళ్ళికొడుకు తండ్రి శుభలేఖ సుధాకర్‌ని చితక బాదుతాడు. మరో సంఘటనలో వేలు ఇంటికి వెళ్తాడు సుధాకర్. వాళ్ళకి వాక్యూమ్ క్లీనర్ గొప్పతనం చెప్పాలనే అత్యుత్సాహంతో తానే చుట్టుపక్కల ఉన్న చెత్తనంతా తెచ్చి ఇల్లంతా కుమ్మరిస్తాడు. తీరా వాక్యూమ్ క్లీనర్ ఆన్ చేస్తే కరెంట్ ఉండదు. సాయంత్రం దాకా రాదని తెలుస్తుంది. దాంతో చచ్చినట్టు తానే చీపురు పట్టుకుని చెత్తను ఊడుస్తాడు. ఇలా చాలాసార్లు ఎదురుదెబ్బలు తిన్నాగాని పట్టువదలని విక్రమార్కుడిలా ప్రయత్నిస్తూనే ఉంటాడు. వాక్యూమ్ క్లీనర్ సంగతేమోగానీ, వేలు చిన్న కూతురు కళ్యాణి మనసును మాత్రం గెలుచుకో గలుగుతాడు.



అసలు ఈ పాత్రకి పెద్ద తతంగమే జరిగింది. తొలుత ఈ పాత్రని సుధాకర్ పోషించారు. తర్వాత ఎందుకనో శుభలేఖ సుధాకర్‌తో రీ షూట్ చేశారు జంధ్యాల.

అరవైనాలుగు కళల్లో చోరకళ ప్రధానమైనదని భావించే రాళ్ళపల్లి ఓ దొంగల కాలేజిని స్థాపిస్తాడు. ఈ కాలేజీ వార్షికోత్సవం రోజున ఉత్తమ దొంగలకి తను కొట్టుకొచ్చిన బంగారాన్ని బహుమతిగా ఇస్తాడు. ఇలా అవార్డులు అందుకున్న దొంగల పేర్లని రాళ్ళపల్లి, కోటశ్రీనివాసరావు, సుత్తివేలు, బాబూమోహన్, శ్రీలక్ష్మి అని పెట్టి మరో చిలిపి ప్రయత్నం చేశారు జంధ్యాల.

ఈ దొంగల కాలేజీలో డిగ్రీ పొందిన బ్రహ్మానందం తన గురువు రాళ్ళపల్లి కూతురి మనసునే దోచుకుంటాడు. ఓ దొంగతనాన్ని విజయవంతంగా పూర్తి చేస్తే తన కూతురునిచ్చి పెళ్ళిచేస్తానని నిబంధన పెడతాడు రాళ్ళపల్లి. తన గురువు కూతురుని పెళ్లి చేసుకోవటానికి ప్రయత్నించే నేపథ్యంలో బ్రహ్మానందం చేసిన దొంగతనాలు విచిత్రంగా ఉంటాయి. దానిలో ఓ సంఘటన గురించి చెప్పుకుందాం.

'ముగ్గు బుట్ట - పేడ తట్ట ఏదైనా సరే సక్సెస్‌ఫుల్‌గా దొంగతనం చేసి నీ ప్రతిభ నిరూపించుకో' అని రాళ్లపల్లి అనడంతో ఎదురుగా కనబడిన ముగ్గుబుట్టను ఎత్తుకొచ్చేసి తనకు పెళ్లి చేయమంటాడు బ్రహ్మానందం. ఆ బుట్ట ఓనరు వచ్చి 'ఎవడైనా బంగారం, డబ్బులాంటివి ఎత్తుకెళతారు. ముగ్గు, కొత్తిమీర కట్టలాంటివి ఎత్తుకెళ్లే దిక్కుమాలిన దొంగను నిన్నే చూసేన్రా ముదనష్టపోడా..' అని తిట్టిన తిట్టు తిట్టకుండా తిడుతుంది. 'నేను చాలా తెలివిగా తీసుకొచ్చానే, ఎలా పసిగట్టిందబ్బా' అని ఆలోచిస్తూ ఉండగా - చిల్లి ఉండటం చేత లైనుగా పడి దారి చూపించి పట్టించిన ముగ్గును బ్రహ్మానందంకు చూపిస్తాడు రాళ్లపల్లి.

ఇలా తాను చేసే ప్రతి దొంగతనంలోనూ అపజయం పొందుతూ దురదృష్టపు దొంగ బిరుదాంకితుడైన బ్రహ్మానందం పాత్రకు ఫినిషింగ్ టచ్ తనదైన శైలిలో ఇచ్చారు జంధ్యాల. స్కూలు పిల్లల దగ్గర టిఫిన్ బాక్స్ ఎత్తుకుపోతూ ఆ పిల్లల తండ్రి దగ్గరకే వెళ్లి 'మాస్టారూ కాస్త లిఫ్టిస్తారా, పోనీండి' అని బైక్ ఎక్కి కూర్చోగా, ఆ పిల్లలు 'నాన్నా, ఆ అబ్బాయి మా టిఫిన్ బాక్స్ ఎత్తుకుపోతున్నాడు' అని చెప్పటంతోనే బ్రహ్మానందం ఇచ్చిన ఎక్స్‌ప్రెషన్స్‌కు మనకు నవ్వు ఆపుకోవటం సాధ్యం కాదు. చివరివరకూ ఇలా ప్రయత్నాలు చేసి ఫెయిలవుతూ ప్రేక్షకుల్ని కితకితలు పెట్టకుండానే బ్రహ్మాండంగా నవ్వించగలిగారు బ్రహ్మానందం.

ఇక్కడ మీకో సంగతి చెప్పాలి. మల్లాది

తిట్ల దండకం

అ: ఒరే త్రాపీ.... మహాపాపి కురూపి
నిన్ను చూడంగనే వచ్చు హై లెవల్ బి.పి.
ముండమోపి జిరాఫీ
నిన్ను తెగ్గోస్తే లోకానికే పెచ్చ హేపీ...
అంక చండాలుడా బంక బధిరాంధుడా
పరమ పాపిష్ఠ నికృష్ట దుష్టాత్ముడా
అ: నీ నీచ రూపంబు చూడంగ పాపంబు
నీ కంఠ నాళంబు కక్కూస గొట్టంబు
నీ కళ్లలో కుళ్లు నీ బుర్రలో బురద
నీ పల్కులే చెత్త.. నీ జన్మ డ్రైనేజీ..
నువ్వోదగుల్బాజీ, ఏబ్రాసి, చప్రాసి, సన్నాసివి.....
అ: అశుద్ధ స్వరూప అబద్ధ ప్రలాప
పింగు బొంగైన పింజారిగా....
గొగ్గేసిన బచ్చా కొవ్వెక్కిన లుచ్చా
పగిలేను నీ పుచ్చె తీరేను నా కచ్చ
నీ చేతికే వచ్చు చిల్లి బొచ్చె నిక్కచ్చిగా...
అ: భ్రష్టాతి భ్రష్ట పరాకాష్టకెళ్లావు
దుష్టత్వమందున్ ముదనష్టుడా, త్రాష్టుడా....
కుష్టు ముష్టోడి అంగుష్టమా
వృద్ధ క్షయ రోగి ఉచ్ఛిష్టమా...
అ: ఒరే పళ్లకిల్తే అరే చిల్లి గోచీ
నీ పిచ్చి పోగొట్టగా టచ్చి ఇస్తాను పెంటచ్చిగా
పెన్ టచ్‌గా...
అ: ఒరే పాచి మొహమా, నడుస్తున్న శవమా
వేడి ఇడ్లీలు పారేయుచున్
చద్ది సాంబారు తెగ త్రాగు సోంబేరిగా....
అ: పెద్ద ఇడియట్‌వి సద్ది పెసరట్టువి
పిచ్చి టేస్టున్న శాడిస్టువి
గజ్జి పాదాల మరుగుజ్జువి
ఉచ్చ నీచాలు లేనట్టి రాస్కెలువి....
వేలువి...యా..యా..యా..
అ: ఒరే అక్కుపక్షి నిరక్షర కుక్షి కుంకాక్షి
ఏకాక్షి సంఘాల అధ్యక్షుడా...
అ: నువ్వు చుంచెలుక గొడ్డెవి
రాబందు రెట్టవి.. బొద్దింక కేశానివి
అ: సీమ్మంది మూతివి గబ్బిలం తోకవి
ఏకాకి కాకీకవి..
నువ్వు చుంచు డాంకీవి యోచించు మంకీవి
కుడితిలో చిట్టెలుకవి
అ: మునిసిపాలిటీ పందికి మూత్రపిండానివి
ఎద్దు మొండానివి
సృష్టి మొత్తంలో శుంఠవీ...
ఒరె పేడ తట్టా
ఆ: అరె చెత్త బుట్టా
అ: ఒరె గడ్డిపోచా
ఆ: అరె నారపీచా
అ: ఒరె తుప్పు మేకా
ఆ: అరె పంది తోకా
అ: ఒరె వానపాము
ఆ: ఇలా తొక్కుతాము
అ: ఒరె గొడు గేదె
ఆ: ఇదే బడితపూజ
అ: సెంటిమెంటన్నదే లేని పెంటాసురా...ఆ...ఆ...
నిన్ను తిట్టంగ నేనెంతవాడన్, దురాత్మా....
ఏడేడు లోకాల భాషలకే శోషొచ్చి మూర్ఛిల్లురా
మహాబండ బూతుల్ తలల్‌వంచు నీ ముందు
పాపాత్ముడా..
ఇ: రావరావో బోడి వెధవా రావ రావో అంట్ల వెధవా
రావరావో చచ్చు వెధవా వెధవన్నర వెధవ
ముప్పావు వెధవ పరిపూర్ణ వెధవ
చావరా చావరా చావు చావు....థూ...

వెంకట కృష్ణమూర్తి 'శనివారం నాది' అనే నవలలోని 'మహంతి' అనే దురదృష్టపు దొంగ కథ ఆధారంగా జంధ్యాల ఇలా బ్రహ్మానందం ఎపిసోడ్‌ని తీర్చిదిద్ది నవ్వులపంట పండించ గలిగారు.

ఎందరో నటుల్ని పరిచయం చేసి తనది మంచి హస్తవాసి అని నిరూపించుకున్న జంధ్యాల, 'సితార' సినీ వారపత్రికలో జర్నలిస్ట్‌గా పనిచేసిన వెలది రఘుకుమార్‌ని 'ష్.. గప్‌చుప్!'తో నటుడిని చేశారు. ఇందులో అతనికి ప్రత్యేకంగా 'క్యా సీన్ హై' అనే మేనరిజమ్ కూడా పెట్టడం జరిగింది.

ఇందులో భానుప్రియ తమ్ముళ్ళు రామ లక్ష్మణులుగా నటించిన కవల సోదరులు ఆ తరువాత మణిరత్నం 'బాంబాయి' సినిమాలో నటించి దేశవ్యాప్తంగా పేరు తెచ్చుకున్నారు. నటి భావన అన్నయ్య కొడుకులైన ఈ పిల్లలని జంధ్యాల ఏరికోరి యాక్ట్ చేయించుకోవడం జరిగింది.

యాంకర్‌గా, యాక్టర్‌గా, సింగర్‌గా మంచిపేరు సంపాదించుకున్న రఘు కుంచె ఈ సినిమాలో తాను కనబడకుండా రెండు పాత్రల్లో నటించాడు. హీరో వరుణ్‌రాజ్‌కి గాత్రదానం చేశాడు. అప్పట్లో వరుణ్‌రాజ్‌కి అతనే పర్మినెంట్ డబ్బింగ్ ఆర్టిస్ట్. ఈ సినిమాలో హీరో వాయిస్‌తో పాటు అన్నమాచార్య కీర్తన గురించి రేడియో అనౌన్స్‌మెంట్‌లో కూడా రఘుకుంచె వాయిస్ వినిపిస్తుంది.

ఈ సినిమాలో మరో డబ్బింగ్ తమాషా వుంది. రాజమండ్రి సర్కిల్ ఇన్‌స్పెక్టర్ రామయ్యగా సినిమాలో కనిపించినాయనకి జంధ్యాలే స్వయంగా డబ్బింగ్ చెప్పారు.

ఇక పాటల విషయానికొద్దాం. ప్రముఖ సంగీత దర్శకద్వయం రాజ్-కోటి మధుర బాణీలను సమకూర్చారు. భారీ కమర్షియల్ చిత్రాలకు తమదైన స్టయిల్‌లో సంగీతాన్నందించిన రాజ్-కోటి ఇటువంటి రసవత్తర చిత్రానికి చక్కని మెలోడీ మ్యూజిక్ నందించారు. జంధ్యాలతో రాజ్-కోటి పనిచేసినవి కేవలం రెండంటే రెండు సినిమాలు. ఒకటేమో 'జయమ్ము నిశ్చయమ్మురా', మరొకటి 'ష్.. గప్‌చుప్'.



తిట్టిన తిట్టు తిట్టకుండా సుమారు ఐదు నిమిషాలు పాటు హీరో తప్ప దాదాపుగా మిగిలిన నటీ నటవర్గమంతా ఓ నలుగురి దొంగల్ని తిడుతూ పాడే తిట్ల దండకం ఈ సినిమాకే హైలెట్‌గా చెప్పాలి. భానుప్రియ బ్యాంక్ ఉద్యోగిని అని చెప్పుకున్నాం కదా. సరదాగా తోటి ఉద్యోగులతో పాపికొండలు ప్రాంతానికి పిక్నిక్‌కి వెళ్తుంది. వారు తెచ్చుకున్న ఆహార పదార్థాలను తిండిపోతు దొంగలు థమ్ - బాబు తదితరులు దోచుకుంటారు. వాళ్ళని తిడుతూ అందరూ తిట్ల దండకం అందుకుంటారు.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| బేనర్ | : ప్రగతి చిత్ర |
| సమర్పణ | : ధరమ్‌చంద్ |
| కథ | : మల్లాది వెంకటకృష్ణమూర్తి |
| స్క్రీన్ ప్లే | : జంధ్యాల ,మల్లాది |
| పాటలు | : వేటూరి,జొన్నవిత్తుల |
| సంగీతం | : రాజ్ -కోటి |
| సంగీత సహకారం | : శ్రీనివాసమూర్తి |
| ఎడిటింగ్ | : గౌతంరాజు |
| గానం | : బాలు, శైలజ, చిత్ర |
| కో - డైరెక్టర్ | : శాస్త్రి |
| నృత్యం | : కళ, శివసుబ్రహ్మణ్యం |
| కెమెరా | : ఎమ్.వి.రఘు |
| నిర్మాతలు | : శివ- ప్రతాప్ |
| రచన- దర్శకత్వం | : జంధ్యాల |

"ఒరే త్రాపీ .... మహాపాపి కురూపి
నిన్ను చూడంగనే వచ్చు హై లెవల్ బి.పి.
ముండమోపి జిరాఫీ
నిన్ను తెగ్గోస్తే లోకానికే పిచ్చ హేపీ...
అంక ఛండాలుడా బంక బధిరాంధుడా
పరమ పాపిష్ట నికృష్ట
దుష్టాత్ముడా.."



ఇలా సాగే ఈ తిట్ల దండకాన్ని జొన్నవిత్తుల రాశారు. పాపికొండలలో షూట్ చేశారు.

ఈ పాట షూటింగ్‌కి ముందు రాత్రంతా జంధ్యాల, మల్లాది తదితరులంతా పార్టీలో ఉన్నారు. తెల్లవారురఝాము నాలుగు గంటలకి తన రూమ్‌కి వెళ్లి ఓ రెండు గంటలు నిద్రపోయి మళ్లీ ఆరుగంటలకి షూటింగ్‌కి రెడీ అయిపోయారు జంధ్యాల.

లాంచీలో యూనిట్ అంతా బయలుదేరింది. ఎక్కడైనా మంచి లొకేషన్ కనిపిస్తే ఆపి మరీ ఆ పాట తీస్తూనే వెళ్తున్నారు. ఇక్కడేమో మల్లాదికి నిద్ర ఆగడం లేదు. కనురెప్పల్ని ఎంత విడదీయాలని చూసినా కొత్త ప్రేమజంటలా కలుసుకోవటం ఆగడం లేదు. "నాతో పాటే రాత్రంతా మేల్కొన్న జంధ్యాల నిద్రమత్తనేదే లేకుండా ఫుల్ ఎనర్జిటిక్‌గా షూటింగ్‌లో పాల్గొనటం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ పాటని ముందే ప్లాన్ చేసుకున్నట్టుగా చక్కటి అమరికతో తీశారు. కొరియోగ్రఫీ జంధ్యాలే చేశారు. నాకు తెలిసి ఆయన సినిమాలకు ఎక్కువ శాతం ఆయనే కొరియోగ్రఫీ చేసుకుంటుంటారు" అని చెప్పారు మల్లాది వెంకట కృష్ణమూర్తి.

'అలరులు కురియగ ఆడెనదే' అనే అన్నమాచార్యకీర్తనను స్వర్గీయ రమేష్‌నాయుడు స్వరపరిచారు. ఈ అన్నమాచార్య కీర్తనను సినిమాలో ఉపయోగించుకోవడానికి అన్నమాచార్య ట్రస్ట్ మేనేజింగ్ ట్రస్టీ బి.ఏ.వి. శాండిల్య దగ్గర అనుమతి తీసుకున్నారు. ఈ కీర్తనను భానుప్రియ, వరుణ్‌రాజ్‌లపై సంఘీ టెంపుల్ లో చిత్రీకరించారు.

'తెలుగందాలే' పాటలో బ్యాంక్ ఆఫ్ లవ్' అని కౌంటర్ పెట్టడం, వరుణ్‌రాజ్ '1000 కిసెస్' డ్రా చేయాలనుకోవడం, దానికి భానుప్రియ అందంగా సిగ్గుపడటం... జంధ్యాల మార్కు చమత్కారం, ప్రేమ నుడికారాలకు దర్పణం పడుతుంది.

పాటల రికార్డింగ్ మద్రాసు విజయా డీలక్స్ రికార్డింగ్ థియేటర్‌లో 1993 డిసెంబర్ 24న జరిగింది. 'తెలుగందాలే నన్ను' అని వేటూరి రాసిన గీతాన్ని బాలు, చిత్ర పాడగా తొలి పాటగా రికార్డు చేశారు. 1994 జనవరి 2న రాజమండ్రిలో షూటింగ్ ప్రారంభమై, రెండు షెడ్యూళ్ళలో పూర్తయింది. ముహూర్తపు షాట్‌కి నాటి ఎఫ్‌డిసి ఛైర్మన్ ఎమ్మెస్‌రెడ్డి క్లాప్ కొట్టగా, నాటి తూర్పు

గోదావరి జిల్లా సూపరింటెండ్ ఆఫ్ పోలీస్ ఎ.కె.ఖాన్ కెమెరా స్విచ్ ఆన్ చేశారు.

రాజమండ్రిలో ఓ కళ్యాణ మండపంలో బ్యాంక్ సెట్‌ను వేసి, పదిరోజులు పాటు చిత్రీకరించారు.

సాధారణంగా రియల్ లొకేషన్స్‌కే జంధ్యాల ఎక్కువ ఇంపార్టెన్స్ ఇస్తుంటారు. 'సెట్ వేసేకన్నా నిజమైన బ్యాంక్‌లోనే షూటింగ్ చేయొచ్చు కదా' అని మల్లాది సందేహం వ్యక్తపరిస్తే - 'నిజమేగానీ మన షూటింగ్ కోసం వాళ్ల వర్క్ ఆపుకోలేరు కదా. శనివారం, ఆదివారం షూటింగ్ పర్మిషన్ ఇస్తామంటున్నారు. ఆ రెండ్రోజులే షూటింగ్ పెట్టుకుంటే మనకి బోలెడు టైం వేస్ట్ అయిపోతుంది' అని చెప్పారు జంధ్యాల.

ఈ చిత్ర నిర్మాతల్లో ఒకరైన శివ, 'ఆనందభైరవి' సినిమా విడుదలకు కారకుడైన బివిపి శాండిల్యకు స్వయానా సోదరుడు. ఈ సినిమా షూటింగ్‌లో చాలా అవాంతరాలు వచ్చినా ఆయన ఎప్పుడూ తన చిరునవ్వుని కోల్పోలేదు. రాజమండ్రిలో సింగిల్ షెడ్యూల్‌లో ఈ సినిమాను పూర్తి చేయాలని ప్లాన్ చేస్తే సడన్‌గా జంధ్యాలకు మలేరియా జ్వరం రావడంతో షూటింగ్ వాయిదా పడింది. అలాగే కథ విషయమై కోర్టు స్టే ఆర్డర్ ఇచ్చినా ధైర్యంగా, న్యాయంగా ఎదుర్కొన్నారు శివ. 'ష్... గప్‌చుప్!' చిత్రం 'అహ నా పెళ్లంట', 'రెండు రెళ్ల ఆరు' చిత్రాల్లాగానే పెద్ద హిట్ అవుతుందని పరిపూర్ణంగా విశ్వసించారాయన.


అనూష,అనిత,సుత్తివేలు,భానుప్రియ,రామ్,లక్ష్మణ్

రెండో షెడ్యూల్‌లో కొన్ని రోజుల మినహా మొత్తం షూటింగ్ అంతా జంధ్యాలతో పాటే వున్నారు మల్లాది వెంకట కృష్ణమూర్తి. ఈ సినిమా గురించి ఆయన అనుభవాలు వివరిస్తూ - "జంధ్యాల తెరకెక్కించిన నా ఐదో సీరియల్ ఇది. ఇంతకుముందు 'శ్రీవారి శోభనం', 'రెండు రెళ్ల ఆరు','నీకూ నాకూ పెళ్లంట', 'చంటబ్బాయ్' సినిమాలు నా సీరియల్స్ ఆధారంగానే రూపొందాయి. జంధ్యాల నాకు మంచి మిత్రుడు. ఈ సినిమా షూటింగ్ అంతా పిక్నిక్‌లా జరిగింది. అసలు జంధ్యాల షూటింగ్ అంటేనే ఓ పిక్నిక్ అనుకోండి. 'ఓ బాబయ్యో ! లోకాన రైలుబండి చికుబుకు అంటూంది' పాట తీయడం కోసం రోజంతా ట్రెయిన్‌ని కాంట్రాక్ట్‌కి తీసుకున్నారు. జంధ్యాల గారు ఆపమన్న చోటల్లా రైలు ఆగేది. అక్కడ సీన్స్ తీసేవారు. ఈ తతంగమంతా చూసి ట్రెయిన్‌ని ఆటోలా ఉపయోగించుకున్నవారు మీరొక్కరే' అని జోక్ చేశాను నేను. ఓ రోజు మధ్యాహ్నం లంచ్ బ్రేక్ ఇవ్వగానే 'భోజనానికి బైటికి వెళ్దాం' అని చెప్పి రాజమండ్రికి దూరంలో వున్న ఎక్కడో పల్లెటూరికి తీసుకుపోయారాయన. తీరా అది వాళ్ల మావగారి ఊరు. ఆ రోజు జంధ్యాల మావగారి తద్దినమట. మేం అక్కడే భోజనం చేశాం.

ఈ షూటింగ్‌లో ఉండగానే ఓ రోజు రాత్రి నాకు, వేలుకి ఓ కథ చెప్పి 'ఈ కథతో 24 గంటల్లో సినిమా తీయాలని వుంది' అన్నారు. క్లయిమాక్స్ కొంచెం వీక్‌గా అనిపిస్తుందని, నన్ను సరిచేయమన్నారు. సినిమా అంతటినీ ఫ్లాష్‌బ్యాక్ చేయమని కొన్ని మార్పులు చెబితే జంధ్యాలకు బాగా నచ్చింది. మొత్తం డైలాగ్స్‌తో సహా స్క్రిప్ట్ రెడీ చేసేశారు. ఎమ్మెస్ రెడ్డి గారికి ఆ సినిమా చేయాలనుకుని, భానుప్రియ దగ్గర డేట్స్ కూడా తీసుకున్నారు జంధ్యాల. కానీ కుదర్లేదు" అంటూ చెప్పుకొచ్చారు.

ఈ సినిమాకి జంధ్యాల ఇచ్చిన ఫినిషింగ్ టచ్ కూడా ఆయన మార్క్‌తోనే వుంటుంది. వేలు మనవడు చెట్టెక్కి వుంటాడు. వాడికి ఐదేళ్ళు కూడా వుండవు. వాళ్ళమ్మ భానుప్రియ అన్నం కలిపి తెచ్చి కొడుకు కోసం చూస్తే చెట్టు మీదుంటాడు. ఆమె ఆశ్చర్యంగా 'ఏమిట్రా చెట్టెక్కావు' అనడుగుతుంది. "నేను ఎదురింటి అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చేస్తేగానీ దిగను" అంటాడు తాతగారైన వేలు పిచ్చితనాన్ని గుర్తుచేస్తూ!

'ష్.. గప్‌చుప్ !' కొంచెం క్లిష్టమైన సీరియస్ బేస్డ్ కామెడీ సబ్జెక్ట్. ఏ మాత్రం శ్రుతి తప్పినా 'జోక్' అయిపోతుంది. ఈ సినిమాతో జంధ్యాల దర్శకుడిగా తన సామర్థ్యాన్ని మరోసారి నిరూపించుకోగలిగారు.

**-పులగం చిన్నారాయణ**

## 'సరిగపదమని-30

**జవాబులు**

అడ్డం: 1.నవ్వుతూ 2.మంగమ్మ 6.ఆది 7.రేపే 9 .నిజములే 11.నను 13.నల్ల 14.చిలకా 15.రారా 19.నిదుర 20.వేయి 21. లేదు

నిలువు:1.నడిరేయి 3.గట్టు 4.మందిరా 5.అందని 8.నాలేఖ 10.జన్మల 11.నల్లని 12. దివి 14.ఛిన్నారి 16.రాగాలే 17.రాని 18. హాయి

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

మొవ్వజ జగదీశ్వరరావు- విశాఖపట్నం, ఆమంచి వేంకట లక్ష్మీకామేశ్వరి- రాజోలు (తూ॥గో॥జిల్లా), బి.మురళీధర్‌రావు- దుండిగల్ (రంగారెడ్డి), ఈరంకి రమేష్- రవన్ (చత్తీస్‌గడ్), పంతుల భాస్కరరావు- నెల్లిమర్ల (విజయనగరం), వారణాశి నీలిమ- వైజాగ్, పాండురంగశర్మ- హైదరాబాద్, వి.కుమారి- గురజాల (గుంటూరు), మేడా మస్తాన్‌రెడ్డి- వైజాగ్, నేమాన సుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళం, డా॥ ఉప్పల వెంకటరమణయ్య- కడప, పి.సత్యనారాయణ- నెల్లూరు, కె.వసంతకుమార్- దేవరకొండ, ఆరవెల్లి గోపాలకృష్ణ- రాజాం (శ్రీకాకుళం), నీలం నాగరాజేశ్వరరావు- నెల్లూరు, ఎమ్.వి.పద్మావతి- కాకినాడ, కె.వి.ఎస్.రావ్- హైదరాబాద్, సి.హెచ్.పద్మజ- హైదరాబాద్, కె.చంద్రహర్ష- సత్తెనపల్లి (గుంటూరు), వి.శ్రీదేవి- సికింద్రాబాద్, డొక్కా కుముద- వక్కలంక, సి.హెచ్.రామ్మోహనరావు- విశాఖపట్నం, టి.చంచలరావు- హైదరాబాద్, వి.మహతి- వైజాగ్, సి.సాయిప్రసాద్- నాయుడుపేట, ఎస్.ఆరుణకృష్ణ- హైదరాబాద్, డా॥ టి.లక్ష్మీనారాయణ- జగిత్యాల, జె.సి.ఎస్.ప్రసాద్- విశాఖపట్నం, నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, వై.రాజానాయుడు- పెద్దచెన్నయ్యగారిపల్లె (చిత్తూరు), సి.సూర్యప్రకాశరావు- విశాఖపట్నం, జి.జాన్‌కెనడీ- హైదరాబాద్, డి.పార్థసారధి- నరసరావుపేట (గుంటూరు), వి.మహలక్ష్మి- శ్రీకాకుళం, కలువ రాఘవేంద్ర తేజ- మణుగురు, పి.గీతాదేవి- వనపర్తి (మహబూబ్‌నగర్), ఎన్.సి.చంద్రకళ- హైదరాబాద్, షేక్ బీబీజాన్- గుంటూరు, కంచి కృష్ణకుమారి- హైదరాబాద్, పింగళి అశ్వత్థనారాయణ- ఒంగోలు, ఎమ్.వి.ఎస్.లక్ష్మి- కాకినాడ, రాచర్ల రోహిణి- హైదరాబాద్, వింజమూరి గాయత్రి- మంగళగిరి (గుంటూరు), వి.అనురాధ- సికింద్రాబాద్, కె.విజయ్‌క్రిష్ణ- అనంతపురం, కె.వి.దుర్గమోహనరావు- నల్గొండ, యు.యు.యు- ఎమ్మిగనూరు, వి.వి.యస్.సునీల్‌కుమార్- హైదరాబాద్, సి.దేవసేన- పలమనేరు, పద్మావతి కృష్ణమాచార్యులు- సికింద్రాబాద్, సామంచి సుధాకర్- విశాఖపట్నం, కె.సీతారామగిరి- కాకినాడ, పి.విజయలక్ష్మి- కాకినాడ, ఎస్.ఎన్.ఎస్.ప్రకాష్- న్యూఢిల్లీ, డి.అన్నపూర్ణ- సింగరాయకొండ, నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట, కె.రఘునాథాచార్లు- కడప, సూరే విశాల్- అనకాపల్లి (విశాఖజిల్లా), దేవ ఆర్.జి- హైదరాబాద్, బెహరాశేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), ఆనంద్ జోషి- హైదరాబాద్, సి.హెచ్.గౌరిపతిరావు- జోగిపేట (మెదక్), కె.వి.సరస్వతి- హైదరాబాద్, మయూరి రఘు- హైదరాబాద్, వి.సుధామయి- విశాఖపట్నం, వి.ఝాన్సీలక్ష్మి- హైదరాబాద్, నేమని సుందర రామయ్య- విశాఖపట్నం, కొండుపర్తి వేంకట జగన్నాథదాసు- సికింద్రాబాద్, వి.శ్రీమణి- హైదరాబాద్, ఎ.ఆదినారాయణ- పోతవరం (గుంటూరు), కొరిటాల నాగమల్లీశ్వరి- విశాఖపట్నం, కె.వి.ఉషచాముండేశ్వరి- హైదరాబాద్, కె.అమీర్‌బాష- కొసిగి (కర్నూలు), యం.నరసింహ్మా- మహబూబ్‌నగర్, ఎ.టి.శ్రీనివాసన్- అనంతపూర్, పేరూరి వెంకట సంతోష్‌కుమారి- కాకినాడ, టి.వేదావతి- చిత్తూరు, వి.ఆర్.గోపాల్- రఘునాథపల్లి (వరంగల్), సూరికుచ్చి బదరీనాథ్- తెనాలి, కె.బాలసుబ్రహ్మణ్యం- శ్రీకాకుళం, చివుకుల సుబ్రహ్మణ్య శాస్త్రి- ఒంగోలు, జి.రామతిలకం- విజయవాడ, ఆర్.వి.రమణమూర్తి- విశాఖపట్నం, పాణ్యం విజయలక్ష్మి- తిరుపతి, ఆలా కృష్ణమూర్తి- వలేటివారి పాలెం (ప్రకాశం), కె.ప్రశాంతి కుమారి- కాకినాడ, ఎస్.మోహన్‌రాజ్- చెన్నై, బి.సరళ- కర్నూలు, పి.నాగహనుమకుమార్- సికింద్రాబాద్, రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, టి.వెంకటేశ్వరరావు- మొలకలమురు, లుంబూరు లక్ష్మీదేవి- హైదరాబాద్, కె.సత్యసాయికుమారి- హైదరాబాద్, ఇ.రాధాదేవి- కడప, సి.చాయాదేవి- విజయవాడ, గోసాల వ్యాఘ్రేశ్వరరావు- రాజమండ్రి (తూ॥గో॥జిల్లా), సపారే ఇందిర- కళ్యాణ్ వేస్ట్, జన్ను బాబూరావు- గుడివాడ (కృష్ణా), ఎమ్.కోటేశ్వరరావు- కాశీపూర్ (ఉత్తరాంచల్), విజయలక్ష్మి వింజమూరి- కాకినాడ, జె.సర్వాణి- తిరుపతి, సి.హెచ్.రఘునాథరావు- గుంటూరు, రామసహాయం వసుమతి- బికుమళ్ళ (నల్గొండ), వై.రాధ- నవిముంబాయి, యం.నరశింగరావు- కందుకూరు (ప్రకాశం), కె.వి.ఎన్.ఎస్.భగవాన్- రాజమండ్రి, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, హెచ్.మీర- బెంగుళూరు, ఎన్.అరుణకుమారి- ఎలమంచిలి (విశాఖజిల్లా), ఎల్.గిరిజ- బెంగుళూరు, వి.కృష్ణవేణి- నిడదవోలు (ప॥గో॥జిల్లా), ఎ.సరోజినిదేవి- రాజమండ్రి, చివుకుల చిరంజీవి- ఒంగోలు, ఎ.మంగప్రణవి- హైదరాబాద్, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), డి.గురునాథరావు- అమలాపురం, వేలివెంటి కృష్ణవేణి- నిడదవోలు (ప॥గో॥జిల్లా), ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, నెమ్మలూరు చంద్రశేఖర్- విజయవాడ, ఎస్.శివనారాయణ- కొత్తపేట (ప్రకాశం), అయలపోరు యాజుల శాంత- విశాఖపట్నం, ఎమ్.వి.ఎస్.ఎన్.శాస్త్రి- విజయావాడ, ఎ.కామేశ్వరరావు- విద్యానగర్, బి.కవిత- తిరుపతి, సామంచి సువర్ణ- విజయవాడ, కె.సత్యవాణి- విజయనగరం, అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైదరాబాద్, సి.హెచ్.కళ్యాణ్ చక్రవర్తి- బెర్హంపూర్ (ఒరిస్సా), కె.స్వయంప్రభ- హైదరాబాద్, గంగారపు కళ్యాణి- సత్తెనపల్లి (గుంటూరు), శంకరమంచి జగన్నాథరావు- హైదరాబాద్, జి.గాయత్రి జ్ఞానేశ్వర్‌రావు- హైదరాబాద్, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (కృష్ణా), ఎస్.వాణీస్వయంప్రభాదేవి- విశాఖపట్నం, కిషోర్‌కుమార్- భూపాలపల్లి (వరంగల్), సి.అనూసారథి- కర్నూలు, నాగదుర్గ.జి- హైదరాబాద్, మల్లాది శ్రీలేఖ- రాజమండ్రి, పి.ఎమ్.వి.పతి- హైదరాబాద్, ఎమ్.కావ్య- తిరుపతి, ఎమ్.రంగారావు- హైదరాబాద్, యజ్ఞల జగన్నాథం- పాతపట్నం (శ్రీకాకుళం), జూపూడి రూపవతీదేవి- గుంటూరు, నిభానుపూడి సుబ్రరాజు- హైదరాబాద్, కనకదండి భానుమతి- టాటానగర్ (జార్ఖండ్), సి.రంగనాయకులు- మర్కాపురం (ప్రకాశం), డి.పి.ధరణి- చందకపూర్ (కర్ణాటక), పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), శ్రీగిరిరాజు విజయలక్ష్మి- హైదరాబాద్, మాదాల సతీష్‌కుమార్- కాకినాడ, మారేమండ సత్యవాణి- హైదరాబాద్, పుణ్యాల శాంతి- సత్తెనపల్లి (గుంటూరు), ఎం.పురుషోత్తమచార్య- నల్గొండ, పి.అరుంధతి- విశాఖపట్నం, ఎ.విక్రమసేనరావు- గోదావరిఖని (కరీంనగర్), జె.భాగ్యలక్ష్మి- కర్నూలు, పి.వి.దుర్గ- రాజమండ్రి, కొంపెల్ల వెంకటరత్నలక్ష్మి- విశాఖపట్నం, రినిత స్ఫూర్తి- హైదరాబాద్, పి.పాపారావు- విశాఖపట్నం, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల (ఆదిలాబాద్), టి.జగపతిరావు- సికింద్రాబాద్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

ఎస్.సమీర- హైదరాబాద్, కె.వి.గంగధరరావు- సికింద్రాబాద్, ఎన్.పద్మకుమారి- హైదరాబాద్, నండూరు లీలాప్రసూన- హైదరాబాద్, జి.సత్యవతి- వల్సాద్ (గుజరాత్), కె.ఎ.మధుసూధన్- అనంతపూర్, ఎమ్.ఎస్.భట్టరాచార్యులు- జగ్గయ్యపేట (కృష్ణా), బి.శ్రీనివాసరావు- హైదరాబాద్, బి.సూర్యనారాయణరాజు- కురపల్లి (విశాఖజిల్లా), జక్కా సుజాత- భీమవరం, మద్దాలి సువర్చలా శ్రీనివాస్- హైదరాబాద్, పార్నంది వెంకటసూర్యసుబ్రహ్మణ్యమూర్తి- విశాఖపట్నం, ఉడాలి భాస్కరయ్య- చెన్నై, ఎ.స్వరాజ్యలక్ష్మి- హైదరాబాద్, ఎన్.సీతామహలక్ష్మి- హైదరాబాద్, గోగుల శ్రీనివాసరావు- తెనాలి (గుంటూరు), సి.హెచ్.ధనలక్ష్మి- భువనేశ్వర్ (ఒరిస్సా), కె.కె.శాస్త్రి- సికింద్రాబాద్, బాచారాజు ప్రభాకరరావు- హైదరాబాద్, రమేష్ ఎ.బి.వి.ఎన్- వెల్లూరు (తమిళనాడు), వి.యు.పవనబాబు- హైదరాబాద్, కె.విజయలక్ష్మి- నెల్లూరు, జి.వి.రఘుశేషు- హసన్ (కర్ణాటక), బి.మంజుళ- నెల్లూరు, నిర్మలక్రిష్ణ- తిరుపతి, వి.రామరావు- విశాఖపట్నం, అనప్పిండి సత్యనారాయణ- సికింద్రబాద్, బి.శ్రీనివాసులు- చెన్నై, జి.వి.రమణ- హైదరాబాద్, ఎస్.సుజాత- సికింద్రబాద్, మన్నవ మాధవి- సత్తెనపల్లి, ఎస్.జయకుమార్- హైదరాబాద్, డి.నారాయణ- మహబూబ్‌నగర్, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), వాస్తు రామచంద్ర- నెల్లూరు, ప్రసాద్ జె.ఎస్.ఆర్.కె- హైదరాబాద్, ఆర్.వి.వి.కృష్ణ- హైదరాబాద్, టి.జయప్రద- పలమనేరు (చిత్తూరు), కాస వైకుంఠమ్- విజయగనరం.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

వీరగోని ఆంజనేయులు- వేములవాడ (కరీంనగర్), వి.శివారెడ్డి- విశాఖపట్నం, బోడా భాగ్యలక్ష్మి- రాజమండ్రి, కె.శ్రీనివాసులు- పోలకల్ (కర్నూలు), విస్సా వెంకట సత్యవరప్రసాదరావు- పినపళ్ళ (తూ॥గో॥జిల్లా), టి.గోపినాథ్- హైదరాబాద్, డి.జె.కుమారి- బరంపురం (ఒరిస్సా), తనికెళ్ళ రామకృష్ణ- విజయవాడ, ఎమ్.మాధురి రంగారావు- నల్గొండ, ఎస్.వెంకటేశ్వరరావు- ఒంగోలు, సి.వెంకటేశ్వరరావు- ఖమ్మం, కె.ప్రత్యూష- చిత్తూరు, హెచ్.సావిత్రిగౌరి- హైదరాబాద్, తాతిరాజు జగం- బెర్హంపూర్ (ఒరిస్సా).

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

చింతా ప్రసాద్ పరిటాల- విజయవాడ, నీహారిక- బరంపురం (ఒరిస్సా), మారోజు సురేష్‌కుమార్- జగ్గయ్యపేట (కృష్ణా), ఆర్.నాగేశ్వరరావు- గంపలగూడెం (కృష్ణా), ఎమ్.మాధవరావు- బెంగుళూరు, జి.పరమేశ్వరి- ఏలూరు, ఎ.శ్రీనివాస్- మహబూబ్‌నగర్, డి.జె.ప్రకాశరావు- ఇబ్రహీంపట్నం (కృష్ణా).




లతామంగేష్కర్‌కు రఫీతో పాడడం అంటే చాలా ఇష్టం. "నేను అందరు గాయకుల కంటే రఫీతో ఎక్కువ పాటలు పాడ్డం నా అదృష్టంగా భావిస్తాను. అతని వంటి గాయకులు ఎప్పుడో తప్ప జన్మించరు." అని 'శ్రద్ధాంజలి' క్యాసెట్‌లో మాట్లాడుతూ అంది. మరో రేడియో ఇంటర్వ్యూలో "రఫీ శ్రుతి నాకు చాలా అనుకూలంగా ఉండేది. (గాయకుల్లో తలత్ దే ఎక్కువ శ్రుతి. ఆ తర్వాత రఫీది. తలత్ తో యుగళగీతాల్లో లతా కంఠం కొంచెం కీచుగా, అతి మధురంగా వినిపించడం శ్రోతలు గమనించే ఉంటారు. ఉదా. **ఓ దిల్ దార్ బోలో ఎక్ బార్, రిమ్‌ఝిమ్ కే యే ప్యారే ప్యారే గీత్ లియే)** అందులోనూ రఫీ ఎలాంటి పాటనైనా అవలీలగా పాడేయగలడు. అందుకే అతనితో పాడ్డం గొప్ప అనుభవంగా ఉండేది" అంది లతా.

తమ యుగళ గీతాల్లో చాలావరకూ తనకు ఇష్టమైనవేనని రఫీ లెజెండ్స్‌లో చెబుతూ, లతా మంగేష్కర్, తాము పాడిన **'వో జబ్ యాద్ ఆయే - బహుత్ యాద్ ఆయే'** పాటను తన ఫేవరెట్లలో ఒకటిగా పేర్కొంది. ఈ పాట లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీతదర్శకత్వం వహించిన తొలి సినిమా **'పారస్‌మణి'** లోనిది. శంకర్‌జైకిషన్ల వారసులుగా పేరు పొందిన లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీతంలో రఫీ, లతా ల యుగళాలు స్మరించుకునే ముందు ఆ శంకర్ జైకిషన్ల సంగీతం వీరి గళాల నుంచి ఎలాంటి మధుర గీతాలను వెలువరించిందో చూద్దాం.

లతాకు, రఫీకి ఆల్ టైమ్ గ్రేట్స్ అని చెప్పదగిన ఎన్నో సోలోలు ఇచ్చిన శంకర్ జైకిషన్‌లు యుగళాల్లో కూడా వీరిద్దరి సామర్థ్యాన్ని పూర్తిగా వినియోగించుకున్నారు. శంకర్ జైకిషన్ పైన అనంతర కాలంలో ఒక విమర్శ కూడా వచ్చింది. వీరిద్దరి చేతా 'అరిపించి' వాళ్ళ గొంతు స్వారస్యాన్ని చెడగొట్టారని. (రాజూ భరతన్ వంటి సినీ సంగీత విమర్శకులు 'ప్రిన్స్' సినిమా విడుదలైన రోజుల్లో ఈ విమర్శ బాహాటంగానే చేసారు.) ఎలాంటి స్థాయి (పిచ్)లో నైనా పాడగలరనే నమ్మకంతో వీరిద్దరి చేతా హై పిచ్ పాటలు పాడించారనే ఆ విమర్శ అర్థం. ఇక్కడ ఒక పిచ్‌కి శ్రుతికీ ఉన్న తేడా గుర్తుంచుకోవాలి. ఇందాకే చెప్పినట్టు తలత్ శ్రుతి ఎక్కువే గానీ, అతని పాటల్లో స్థాయీ వైవిధ్యం, ఎక్కువ స్థాయి సాధారణంగా ఉండవు. ముఖేశ్‌కు శ్రుతీ తక్కువే, పిచ్ కూడా తక్కువే. వాళ్ళిద్దరి స్వరాలకూ ఎక్కువ స్థాయి ఉంటే వినడానికి బాగుండదు. అందుకే వారు, వారిని పాడించిన సంగీత దర్శకులూ కూడా ఆ జాగ్రత్త తీసుకునేవాళ్ళు. రఫీ సంగతి కొస్తే శ్రుతి కాస్త ఎక్కువే. ఇక స్థాయి విషయానికి వస్తే ఒక్క **'ఓ.. దునియాకే రఖ్‌వాలే'** పాటను గుర్తు చేసుకుంటే చాలు. ఆ పాటలో అతి తక్కువ స్థాయి (ఆస్ నిరాస్ కే) నుంచి అతి ఎక్కువ స్థాయి (అబ్ తో నీర్ బహాలే) వరకు ఆ స్వరం ఎంత సులువుగా వెళ్ళిపోయిందో శ్రోతలకు తెలిసిందే. అసలే శ్రుతి ఉన్నా, పై స్థాయికి వెళ్ళినపుడు గళమాధుర్యం చెడకుండా ఉండే గాయకులు అరుదు. మన్నాడే వంటి గొప్ప గాయకుడు కూడా రఫీ అభిమాని కావడానికి రఫీ స్వరంలోని ఈ గుణమే ప్రధాన కారణం. రఫీ, లతాలలో సమానంగా ఉన్న గుణం ఇది. అతితక్కువ స్థాయిలోనూ, అతిఎక్కువ స్థాయిలోనూ వారి కంఠమాధుర్యం చెక్కు చెదరదు.

శంకర్ జైకిషన్ సంగీత దర్శకత్వంలో రఫీ, లతాల సూపర్ హిట్ గీతాలను ఒక్కసారి గుర్తు చేసుకుంటే 1960 దశకం గుర్తొస్తుంది. 1951 లో **'నగీనా'** చిత్రంలోని వీళ్ళిద్దరి యుగళ గీతం

చిత్రం: దిల్‌నే పుకారా    రచన: ఇందీవర్    సంగీతం: కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ    గానం: మహమ్మద్‌రఫీ లతా    అభినయం: సంజయ్(ఖాన్), రాజశ్రీ

**ఆ: హమ్‌కో హోనే లగా హై ప్యార్ తుమ్‌సే ॥2॥**
**ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా**
**అ: దిల్ కో ఆనే లగా కరార్ తుమ్‌సే ॥2॥**
**ప్రియతమ్మా ప్రియతమ్మా ప్రియతమ్మా ప్రియతమ్మా**
**ఆ: హుయే జాతే హై హమ్ తో దివానే**
**వో ఛోఢే ఆంఖోం నే తేరీ అఫ్సానే ॥హుయే॥**
**అ: కియా జాదూ యే తేరీ అదా నే**
**వఫా నే భంవ్‌రే భీ బన్‌గయే పర్‌వానే**
**ఆ: మేరే దిల్ నే పుకారా... ఆ... ఆ... ఆ... మేరే దిల్ నే పుకారా**
**అ: క్యా... క్యా... క్యా...**
**ఆ: హమ్‌కో హోనే లగా హై ప్యార్ తుమ్‌సే**
**ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా**
**అ: అప్‌నే కదమోం కా బోసా హీ దే దే**
**హమ్ కబ్‌సే బైఠే హై తేరీ రాహోం మేం ॥అప్‌నే॥**
**ఆ: కహూం కైసే మచల్‌నే లగా హై**
**యే దిల్ భీ ఆనే కో తేరి బాహోం మే**
**అ: మేరే దిల్ నే పుకారా... ఆ... ఆ... ఆ... మేరే దిల్ నే పుకారా**
**ఆ: క్యా... క్యా... క్యా...**
**అ: దిల్ కో ఆనే లగా కరార్ తుమ్‌సే**
**ప్రియతమ్మా ప్రియతమ్మా ప్రియతమ్మా ప్రియతమ్మా**
**ఆ: తన్‌హాయీ జబ్ దిల్ పే ఘిర్ ఆయీ**
**తబ్ జానా హమ్ భీ హై తేరే సౌదాయీ ॥తన్‌హాయీ॥**
**అ: హమ్ తుమ్‌సే, తుమ్ హమ్‌సే హో రాజీ**
**తో బోలో అబ్ బాజేగి కబ్ శహనాయీ**
**ఆ: మేరే దిల్ నే పుకారా... ఆ... ఆ... ఆ... మేరే దిల్ నే పుకారా**
**అ: క్యా... క్యా... క్యా...**
**ఆ: హమ్‌కో హోనే లగా హై ప్యార్ తుమ్‌సే**
**ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా ఉయ్ అమ్మా**
**అ: దిల్ కో ఆనే లగా కరార్ తుమ్‌సే ॥2॥**
**ప్రియతమ్మా ప్రియతమ్మా ప్రియతమ్మా ప్రియతమ్మా**



చిత్రం : జబ్ ప్యార్ కిసీసే హోతా హై   రచన : హస్రత్ జైపురి
సంగీతం : శంకర్-జైకిషన్   గానం : మహమ్మద్ రఫీ, లతా
అభినయం : దేవ్ ఆనంద్, ఆశాపరేఖ్

అ: సౌ సాల్ పెహలే ముఝ్ తుమ్‌సే ప్యార్ థా
ముఝ్ తుమ్‌సే ప్యార్ థా
ఆజ్ భీ హై ఔర్.. కల్ భీ రహేగా ॥సౌ సాల్॥
తుమ్ రూఠా నా కరో
మేరీ జా మేరీ జాన్ నికల్ జాతీ హై
తుమ్ హస్తీ రెహతీ హో
తో ఇక్ బిజలీ సీ చమక్ జాతీ హై ॥తుమ్॥
ముఝ్ జీతే జీ వో దిల్‌బర్
తేరా ఇంత్‌జార్ థా తేరా ఇంత్‌జార్ థా
ఆజ్ భీ హై ఔర్.. కల్ భీ రహేగా ॥సౌ సాల్॥
ఆ: సదియోఁ సే తుఝ్ సే మిల్‌నే
జియా బేకరార్ థా... జియా బేకరార్ థా
ఆజ్ భీ హై ఔర్.. కల్ భీ రహేగా
ఆ: ఇస్ దిల్ కే తారోం మే
మధుర్ ఝంకార్ తుమ్హీ సే హై
ఔర్ యే హసీన్ జల్వా
యే మస్త్ బహార్ తుమీసే హై
దిల్ తో యే మేరా సనమ్
తేరా తలబ్‌గార్ థా తేరా తలబ్‌గార్ థా
ఆజ్ భీ హై ఔర్.. కల్ భీ రహేగా ॥సౌ సాల్॥
అ: ఇన్ ప్యార్ కి రాహోం మే
కహోతో అబ్ ఖుద్‌కో మిటాదూఁ మైఁ
ఔర్ చాందీ సే కద్‌మోం మే,
ధడక్‌తే దిల్ కో బిఛాదూఁ మై ॥ఇన్ ప్యార్॥
తుఝ్ మేరే జీవన్ పర్
సదా ఇఖ్తియార్ సదా ఇఖ్తియార్ థా
ఆజ్ భీ హై ఔర్... కల్ భీ రహే గా ॥సౌ సాల్॥



ఉన్నా, 1956లో **'హలాకూ'** చిత్రంలోని 'ఆజా కే ఇంత్ జార్ మే, జానే కో హై బహార్ భీ, తేరే బగైర్ జిందగీ దర్ద్ బన్ కే రెహ గయీ (రావా ప్రియా, నీ నిరీక్షణలో వసంతం కూడా వెళ్ళిపోయింది. నీవు లేని జీవితం ఒక బాధగా మిగిలిపోతోంది) అన్న పాట, అదే సినిమాలోని 'దిల్ కా న కర్ నా ఐత్‌బార్ కోయీ, భూలేసే భీ నకర్ నా ప్యార్ కోయీ' (మనసును నమ్మకండి, పొరపాటున కూడా ప్రేమించకండి) అన్న పాట (రెండు విషాదగీతాలే) ఈ నాటికీ సూపర్ హిట్లే. ఆజా కే ఇంత్‌జార్ మే అయితే , రఫీ లతా యుగళాల్లో ఆల్ టైమ్ గ్రేట్ పాటల్లో చేరుతుంది. 1959లో **'శరారత్'** (ఇందులో రఫీ కిశోర్ కుమార్‌కు పాడ్డం విశేషం); 1960లో **'కాలేజ్ గర్ల్'**లో **'హమ్ ఔర్ తుమ్ ఔర్ యే సమా, లవ్లీ లవ్లీ లవ్లీ , ఛేడ్ కోయి దాస్తాన్ లవ్లీ, లవ్లీ లవ్లీ'**, నువ్వు, నేను, ఈ అందమైన వాతావరణం, ఏదైనా అందమైన కథ చెప్పు) అనే పాట బాగా ప్రజాదరణ పొందింది.

1960 దశకం ప్రారంభానికి, ఈ నలుగురి సంగీత సామ్రాజ్యానికి తగిన వాతావరణాన్ని కల్పించిన చిత్రం **'కాలేజ్ గర్ల్'**, అంతవరకూ, విషాదం, నెమ్మదితనం ప్రధాన గుణాలుగా ఉన్న రఫీ, లతా యుగళాలు శంకర్ జైకిషన్ సారథ్యంలో గొప్ప వైవిధ్యాన్ని సంతరించుకున్నాయి. 'సింగపూర్' (1960)లోని **'హో రాసా సాయాంగ్ రే, రాసా సాయంగ్‌సాయంగ్ రే'** పాట గుర్తు తెచ్చుకుంటే , అంత చిలిపిగా, సరదాగా, గొప్ప 'అదా'తో లతా పాడిన మొదటిపాటేమో ఇది అనిపిస్తుంది. ఇద్దరి కంఠస్వరాలు, విదేశీ భాషా పదాలు ఉండడం వల్ల కాబోలు కొత్త సోయగంతో వినిపించే పాట ఇది.

ఆ సంవత్సరమే, శంకర్ జైకిషన్ సంగీతంలో వీరిద్దరి శకం ప్రారంభమైంది. 'జబ్ ప్యార్ కిసీసే హోతాహై' లో **'యే ఆంఖే ఉఫ్ యూమ్మా, యే సూరత్ ఉఫ్ యూమా, ప్యార్ క్యూ నహోగా'** (ఉఫ్ యూమా అనడంలో అద్భుత రసాన్ని ఇద్దరూ ఎంత అందంగా పలికించారో ), అల్లరి పాట అయితే, గుండె లోతుల్లోంచి వచ్చిన పాట **'సౌ సాల్ పెహలే- ముఝ్ తుమ్ సే ప్యార్ థా, ఆజ్ భీ హై ఔర్ కల్ భీ రహేగా'** (వందేళ్ళ క్రితం నాకు నువ్వంటే ప్రేమ - ఇప్పుడు ఉంది- ఇక పైనా ఉంటుంది) రఫీ సోలోలకు పెట్టింది పేరైన 'జంగ్లీ'లో చాలా చక్కని యుగళ గీతం **'దిన్ సారా గుజారా తోరే అంగ్‌నా - అబ్ జానే దే ముఝ్ మోరే సజనా, మెరె యార్ షబ్బఖైర్'** (రోజంతా నీ సమక్షంలో గడిచిపోయింది; ఇక నన్ను వెళ్లనీ ప్రియా) సైరాబాను అమాయకత్వాన్ని, బేలతనాన్ని లతా పలికిస్తే , షమ్మీ అల్లరిని రఫీ చిలకరించిన గీతం ఇది.

మరి కొన్ని సూపర్ హిట్లు - ఈనాటికీ రేడియోలో మార్మోగి పోయే పాటల్ని తలచుకుంటే..

అస్లీ నక్లీ(1962) లోని **'తుఝ్ జీవన్ కి డోర్ సే బాంధ్ లియాహై '**, దిల్ తేరా దీవానా(1962)లో **'దిల్ తేరా దీవానా హై సనమ్'** **'ముఝ్‌కిత్‌నా ప్యార్ హై తుమ్‌సే 'జానే వఫా, జానే జహా, జానే తమన్నా కహా'**, ప్రొఫెసర్(1962)లోని **'మై చలీ మై చలీ పీఛే పీఛే పిచే జహా, యే న పూఛో కిధర్, యే న పూఛో కహా'**, **'ఆవాజ్ దేకే హమే తుమ్ బులావో, మొహబ్బత్ మే ఇత్‌నా న హమ్‌కో సతావో'**, ఏక్ దిల్ సౌ అఫ్‌సానే(1963) లో **'తుమ్ హి తుమ్ హో మేరే జీవన్ మే -ఫూల్ హీ ఫూల్ హో జైసే చమన్ మే'**, హమ్ రాహీ(1963)లోని **'వో దిన్ యాద్ కరో -వో చుప్ చుప్ కే మిల్నా, వో హస్‌నా హసానా వో దిన్ యాద్ కరో'**, అయీ మిలన్ కీ బేలా(1964)లోని **'ఓ సనమ్ తేరే హోగయే హమ్'**..

ఇలా చెప్తుంటే జాబితా తరగదు. గాయకుల కంఠస్వరాన్నే వాయిద్యంలా వాడడం ఓపి. నయ్యర్ సంగీతంలో లాగ శంకర్ జైకిషన్ స్వరరచనలో కూడా కనిపిస్తుంది. **'తుమ్ హి తుమ్ హో మేరే జీవన్ మే'** అలాంటి పాటే, సినిమా పాటల్లో గోల ఎక్కువయ్యే లోగా, వీరి సంగీత దర్శకత్వంలో వచ్చిన మరో మేలిముత్యం లాంటి రఫీ, లతా యుగళం **'తుమ్ బిన్ సజన్ బర్‌సే నయన్, జబ్ జబ్ బాదల్ బర్‌సే'** (గబన్,1966)

1970లు సమీపించే కొద్దీ హిందీ సంగీతంలో కొంత మార్పు వచ్చింది. గోల పెరిగింది. వాయిద్యాల జోరు పెరిగింది. సాహిత్యంలో గాఢత్వం కంటే 'ప్రజారంజకత్వం' పెరిగింది. వాయిద్యాల హోరు నుంచి ఈ సంగీతద్వయం కూడా తప్పించుకోనప్పటికీ ,రఫీ, లతా యుగళాలు ఇంకా కొన్ని మంచి వాటినే అందించారు.

ఖవ్వాలి తరహాలో ఉండే **'క్యా క్యా న సహే హమ్‌నే సితమ్, ఆప్ కీ ఖాతిర్** (మేరే హుజూర్,1968) సంగీత పరంగా మాధుర్యాన్ని నిలుపుకున్న **'రంగత్ తేరీ సూరత్‌సీ కిసీమే నహీ నహీ, ఖుష్‌బూ తేరే బదన్‌సీ కిసీమే నహీ నహీ** (తుమ్ సే అచ్ఛా కౌన్ హై,1969) ధర్తీ (1970)లోని రెండు యుగళాలు **' యే మౌసమ్ భీగా భీగా హై'**, **'యే ఆల్ బేలి ప్యార్ కీ రాహే'**

చిత్రం: పారస్‌మణి  రచన: అసద్ భోపాలి  సంగీతం: లక్ష్మీకాంత్-ప్యారేలాల్  గానం: మహమ్మద్ రఫీ, లతా  అభినయం: మహిపాల్, గీతాంజలి





అ : వో జబ్ యాద్ ఆయే  బహుత్ యాద్ ఆయే
వో జబ్ యాద్ ఆయే  బహుత్ యాద్ ఆయే
గమే జిందగీ కే అంధేరే మే  హమ్‌నే
చిరాగే మొహబ్బత్  జలాయే బుఝాయే  ॥వో జబ్॥
ఆహటే జాగ్ ఉఠీ రాస్‌తే హస్ దియే
థామ్‌కర్ దిల్ ఉఠే  హమ్ కిసీ కే లియే
కయీూ బార్ ఐసా భీ ధోకా హువా హై
చలే ఆ రహే హై వో నజరే ఝుకాయే  ॥వో జబ్॥
ఆ : వో జబ్ యాద్ ఆయే  బహుత్ యాద్ ఆయే
గమే జిందగీ కే అంధేరే మే హమ్ నే
చిరాగే మొహబ్బత్  జలాయే బుఝాయే  ॥వో జబ్॥
దిల్ సులగనే లగా  అష్క్ బెహనే లగే
జానే క్యా క్యా హమే లోగ్ కహ్‌నే లగే
మగర్ రోతే రోతే హసీ ఆగయీూ హై
ఖయాలోం మే ఆకే వో జబ్ ముస్కరాయే  ॥వో జబ్॥
అ : వో జుదా క్యా హుయే జిందగీ ఖోగయీూ
ఆ : షమ్మ జల్తీ రహీ రోష్‌నీ ఖోగయీూ
అ : బహుత్  కోషిషే కీ మగర్ దిల్ న బెహలా
కయీూ సాజ్ ఛేడే కయీూ గీత్ గాయే
ఆ : వో జబ్ యాద్ ఆయే   బహుత్ యాద్ ఆయే
అ : వో జబ్ యాద్ ఆయే   బహుత్ యాద్ ఆయే

ఆన్ బాన్(1972) లోని 'తుమ్ మేరీ హో మేరే సివా కిసీకి నహీ ఖాతీహు కసమ్'... ఇలా కొన్ని ఉన్నాయి. పాటల స్థాయిలో, ప్రమాణంలో అంతరాలుండవచ్చు గానీ, మిగిలిన సంగీత దర్శకుల యుగళ గీతాలతో పోల్చి చూసుకుంటే, శంకర్ జైకిషన్ సంగీత దర్శకత్వంలో రఫీ, లతా యుగళాలన్నీ చాలా పెద్ద హిట్లు కావడం అబ్బురమైన విషయం. ఒక్క ఫ్లాప్ పాట కూడా కనిపించదు. తెలుగువారిలో ఎక్కువ మందికి ఇష్టమైన సంగీతదర్శకద్వయం ఇది. వీరి రఫీ, లతా యుగళాలు ఉత్తర భారతదేశంలోనే కాదు, ఆంధ్రదేశంలోనూ ప్రచారం, ప్రజాదరణ పొందాయి.

తమ యుగళ గీతాల్లో రఫీ,లతాలకే పరిమితం కాకపోయినా, ఇచ్చిన కొన్నీ మంచివే ఇచ్చిన మరో సంగీత దర్శకద్వయం కల్యాణ్‌జీ ఆనంద్‌జీ. వీరు విలక్షణమైన సంగీత దర్శకులు. నిలకడగా ఒకే గాయనీగాయకులకు పాటలు ఇవ్వాలన్న నియమం పెట్టుకోనివారు. వీరికి ఒకే సినిమాలో హేమంత్, మన్నాడే, రఫీ, ముఖేశ్, లతా, ఆశా... ఇలా అందరూ పాడుతుంటారు.

1958లో - అప్పటికి కల్యాణ్‌జీ వీర్జీ షాయే (ఆనంద్ ఇంకా చేరలేదు) - తొలి రఫీ హిట్ (వారి సంగీతంలో )వచ్చింది. 'సమ్రాట్ చంద్రగుప్త్' సినిమాలోని **'చాహే పాస్ హో, చాహే దూర్ హో - మేరే సప్ నోంకీ తుమ్ తస్‌వీర్ హో'** (దగ్గరున్నా, దూరంగా ఉన్నా, నా కలల రూపానివి నువ్వే) ఈనాటికీ అభిమానుల నోట్లో నానే పాట. **'బేదర్ద్ జమానా క్యా జానే'** లో వీరి మూడు యుగళ గీతాలు ఆణిముత్యాలే (ఇంకా కల్యాణ్‌జీ వీర్జీషాయే) . అవి **'దూర్ కహీ తూ చల్ ', క్యూమిలే తుమ్ హమ్ -బేవఫా ఓ సనమ్ , మై యహా, తూ కహా మేరా దిల్ తుఝే పుకారే'**

ఆనంద్‌జీ చేరాక, వీరి సంగీత దర్శకత్వంలోని రఫీ,లతా ఆల్‌టైమ్ బెస్ట్ వచ్చింది. అది **'పాస్‌పోర్ట్'(1961)** చిత్రం లోనిది. **'సాజే దిల్ ఛేడ్ దే -క్యా హసీ రాత్ హై'** అని రఫీ అంటే **'కుఛ్ నహీ చాహియే -తూ అగర్ సాథ్ హై'** అంటుంది లత. ఈ పాటలో సాహిత్యం, లయ, అతి తక్కువ వాద్యాల నేపథ్యం, ఇద్దరి స్వరాల్లోనూ మార్దవం అద్భుతంగా అమరి ఎన్ని సార్లు విన్నా వినాలనే అనిపిస్తుంది. వీరి సంగీత దర్శకత్వంలో అన్ని పాటలు (శంకర్ ద్వయంలా ) హిట్లు కావు. అయితే వినే కొద్దీ మనసుకు నచ్చే మరి కొన్ని యుగళగీతాలు **'బ్లఫ్ మాస్టర్'(1963)** లోని **'అరే హుస్న్ చలా కుఛ్ ఐసీ చాల్,'** **'కహీ ప్యార్ నహోజాయే'(1963)** లోని **'తునక్ తున్ తున్ బోలే జియా, చునక్ చున్ చున్ డోలే జియా, తుమ్సే కహీ ప్యార్ ప్యార్ ప్యార్ హో నజాయే'**, **'ఆమ్నే సామ్నే'(1967)** లోని **'కభీ రాత్ దిన్ హమ్ దూర్ థే'**, **'దిల్ నే పుకారా'(1967)**లోని **'హమ్ కో హోనే లగా హై ప్యార్ తుమ్ సే ఉయ్ అమ్మా'** (రఫీ, లతా ప్రత్యేకంగా బాగా పాడిన పాట ఇది), **'హసీనా మాన్ జాయేగీ'(1968)** లోని **'బేఖుదీ మే సనమ్, ఉఠ్ గయే జో కదమ్'** **'రాజా సాహెబ్'(1980)** లోని **'హమ్ నే ఆజ్ సే తుమ్సే, యే నామ్ దే దియా- జానే మన్ జానే జా'**

1970 దశకంలో వీరి కాంబినేషన్‌లో సూపర్ హిట్ పాటలని చెప్పదగినవి **'సచ్చా ఝూటా'(1970)** లోని **'యూహీ తుమ్ ముఝ్‌సే బాత్ కర్‌తీ హో -యా కోయి ప్యార్ కా ఇరాదా హై'**, **'ఉపాసనా'(1971)** లోని **'ఆవో తుమ్సే మై ప్యార్ సిఖాదూ - సిఖ్ లాదోన'** **'మర్యాదా'(1971)** లోని **'తూ భీ ఆజా కీ ఆగయీ రుత్ మస్తానీ ఓ ఢోల్ సజ్‌నా, ఢోల్ జానీ మేరీ గలీ ఆ తేరీ మెహర్‌బానీ'** **'జంజీర్'(1973)** లోని **'దీవానే హై దీవానోంకో న ఘర్ చాహియే'**, **'హాథ్ కీ సఫాయీ'(1974)**లోని ఆల్ టైమ్ హిట్ **'వాదా కర్‌లే సాజ్‌నా తేరే బిన్ మైనా రహూ, మేరా బిన్ తూ నా రహే హోకే జుదా, యే వాదా రహా'**, **'అదాలత్'**(1978)లోని **'ఓ తుమ్ సే దూర్ రెహకే - హమ్ నే జానా ప్యార్ క్యా హై '**, **'బైరాగ్'(1976)**లోని **'సునోరే సునో ఎక్ బాత్ సునావూ'**.

చాలామంది పాత పాటల అభిమానులు ఆ రోజుల్లో కల్యాణ్‌జీ ఆనంద్‌జీ పాటలు విని ఇవి తక్కిన సంగీతదర్శకుల స్థాయిలో లేవని అనుకునేవాళ్ళు. అసలు 1970 దశకం నుంచే పాటల నాణ్యత తగ్గిందని, మరీముఖ్యంగా 1950ల నుంచి బాణీలు కడుతున్నవాళ్ళు, పాడుతున్నవాళ్ళు ఈ దశకానికి వచ్చేసరికి తమ సామర్థ్యంలో చివరి దశ చేరుకున్నారనీ పెదవి విరిచిన వారున్నారు. కానీ అవే పాటలు ఇప్పుడు వింటే వాటిలోని వైవిధ్యం, ఒక్కొక్క సంగీత దర్శకుడికీ, గాయకుడికీ ఉన్న స్వంతముద్ర అద్భుతాశ్చర్యాలను కలిగిస్తాయి. ఒరిజినాలిటీ అంత ఉండేది కనకనే, ఈ రఫీ, లతా యుగళాలు పల్లవిలోని ఒక్క పదం చెప్పగానే చప్పున మొత్తం పాటంతా గుర్తొచ్చేస్తాయి. అలా గుండెల్లో ,జ్ఞాపకాల్లో నాటుకునే శక్తి ఆనాటి పాటలకుండేది.

ఇలాంటి మరొకొన్ని రఫీ, లతా యుగళాల గురించి వచ్చే సంచికలో-

**- మృణాళిని**




'సింహాద్రి' వంటి సూపర్ హిట్ చిత్రాన్ని అందించిన విజయమారుతీ క్రియేటివ్స్ పతాకంపై ప్రముఖనిర్మాత వి.దొరస్వామిరాజు సమర్పణలో వారబ్బాయి విజయకుమార్‌వర్మ రసదర్శకుడు వంశీ దర్శకత్వంలో ఈచిత్రాన్ని నిర్మించారు. తను దర్శకత్వం వహించే చిత్రానికి అయితే ఇళయరాజా, కాకపోతే తనే ట్యూన్ చేసుకునే వంశీతో సంగీత దర్శకుడిగా చక్రికి ఇది మూడో సినిమా. మొదటి రెండు సినిమాల్లో వంశీకి నచ్చే ఇళయరాజా మార్క్‌తో పాటలు వున్నా ఈ సినిమా ట్యూన్స్‌లో మాత్రం ఎక్కువగా చక్రి మార్కే కనబడుతుంది. ఇళయరాజా ఛాయలు అక్కడక్కడ మాత్రమే తొంగిచూస్తాయి. సాధారణంగా కొంతమందితో కొంతమందికి మైండ్ ట్యూన్ అయిపోతుంది. ఆ ప్రభావం నుండి బైటికి రావటానికి మనసొక పట్టాన అంగీకరించదు. ఆ కోణంలో గనక చూస్తే ఈ సినిమాలో పాటల్ని వంశీపరంగా ఆహ్వానించదగ్గ మార్పుగా స్వీకరించాలి. ఈ సినిమా ఆడియోలో ఏడు పాటలున్నాయి. అందులో ఆరు వెన్నెలకంటివి. ఒకటి మాత్రం సినారెది. ఆయా పాటల వివరాలలోకి కాస్త లోతుగా వెళితే.....

'వలపుల వరం స్వరం నిరంతరం మోగనీ తీయగా' అనే పల్లవితో మొదలయ్యే పాటను చక్రి,కౌసల్య పాడేరు. అక్షరాలతో ఆడుకుని పదాలతో పాడుకునే వెన్నెలకంటి తత్వానికి ఈ పాట సాహిత్యం ఓ నిదర్శనం. ఋజువు చూపించాలంటే సగం పాట ఉదహరించటానికే సరిపోతుంది. గాయని పరంగా చూస్తే - మాతృమూర్తి అయిన తర్వాత కౌసల్యాకు మళ్ళీ 'బంచ్ ఆఫ్ సాంగ్స్' దొరికింది ఈ చిత్రంలోనే అని చెప్పాలి. ఓ విధంగా ఆమెకు ఈ చిత్రం సెకెండ్ ఇన్నింగ్స్ లాంటిది. అందుకు ఈ పాట పల్లవిలోని తొలివాక్యాన్ని అన్వయించుకుంటే బావుంటుంది. అను పల్లవిగా వచ్చే 'పెదవుల గులాబీ ఇచ్చుకోనా' అనే లైనుకున్న ట్యూన్‌ని వింటుంటే 'క్షణక్షణం' లో కీరవాణి స్వరపరిచిన 'అందనంత ఎత్తా తారాతీరం' పాటలోని 'దిక్కులన్ని తెగించే వేగంతో రెక్కలిప్పు నిషాలెన్నో, గుప్పెడంత కులాసా గుండెల్లో గుప్పుమన్న ఖుషీలెన్నో' అనే లైన్లు గుర్తొస్తాయి. సంగీత దర్శకుడిగా, గాయకుడిగా చక్రి చేసిన ద్విపాత్రాభినయం పాటకు న్యాయం చేకూర్చింది.

చక్రి సంగీతాన్నిచ్చిన 'సత్యం' చిత్రంలోని 'ఐ యామ్ ఇన్ లవ్' పాట ద్వారా అందరి దృష్టినీ ఆకర్షించిన వేణు - కౌసల్యతో కలిసి పాడిన 'హల్లో అన్నాను మొన్న - కల్లోకొచ్చింది నిన్న - ఒళ్ళో వాలింది నేడు జాణ' పాటను హిట్ సాంగ్ ఆఫ్ ది ఆడియోగా పేర్కొనాలి. యూత్ మాత్రమే కాకుండా ఫార్టీ ప్లస్ వారి నోట కూడా నర్తించే ట్యూన్‌ని ఈ పాటకు అందించాడు చక్రి.

'సరేలే సరేలే' పాట గుండెల్లో చక్కటి అనుభూతిని నింపే పాట. రకరకాల వర్ణనలకు 'సరేలే' అనే హుక్ వర్డ్‌ని కలిపి రాయటం ఈ పాట ప్రత్యేకత. ఆలోచన వంశీదైనా, వెన్నెలకంటిదైనా అభినందించి తీరాలి. కాకపోతే దానికి 'సరేలే' అనే పదాన్నే ఎన్నుకోవటం మధ్యలో 'సరే సరే సరేలే' తిరిగి అనిపించటంలో పింగళి నాగేంద్రరావుగారి శైలి ఈ సమీక్షకుడికి స్ఫురించింది. మాధుర్యప్రధానమైన ట్యూన్‌ని అందించటంతో పాటు అంత హాయిగా పాడేడు చక్రి. అలాగే ఇదేపాట ఇంకో వెర్షన్‌తో సాహిత్యం మార్పుతో హరిహరన్, కౌసల్య పాడేరు. ఇద్దరూ విజృంభించి మరీ పాడారు. ఈ రెండు పాటలనీ ఒక దాని పక్కన పెట్టి ఒకటి వింటే ఏది బావుందో తేల్చి చెప్పటం అంత సులువైన విషయం కాదు. దేని ప్రత్యేకతలు దానికున్నాయి. సంగీత దర్శకుడిగా చక్రికిది మంచి క్రెడిట్.

హరిహరన్, కౌసల్య పాడిన 'చిలిపికనుల తీయని చెలికాడా నీ నీడను నిలుపుకొందురా వెల్లులమేడ' పాట ఒరిజినల్ 'కులగోత్రాలు' (1962) చిత్రంలోనిది. రచన సి.నారాయణరెడ్డి, సంగీతం యస్.రాజేశ్వరరావు. పాడినది ఘంటసాల, సుశీల. సినిమాలో నాగేశ్వరరావు, కృష్ణకుమారిపై చిత్రీకరించారు. ఆ పాట సాహిత్యాన్ని యధాతథంగా తీసుకుని, ట్యూన్‌లోనూ, పాడించటంలోనూ స్వల్పమైన మార్పులు చేసి ఇంటర్లూడ్స్ పూర్తిగా మార్చి, హరిహరన్, కౌసల్య చేత తిరిగి పాడించారు. అయితే ఇన్‌లే కవర్‌పై ఈ వివరాలు ఇవ్వలేదు. దీనివల్ల ఈ పాటను వెన్నెలకంటి రాశారని, మొత్తం ట్యూనంతా చక్రిదేనని భవిష్యత్ తరాల వారు భ్రమపడే అవకాశం ఉంది. అంచేత




విడుదల : సుప్రీమ్
వెల : రూ|| 30/-

ఆడియో సెకెండ్‌బంచ్ రిలీజ్ లోనూ, సినిమా టైటిల్స్‌లోనూ సరియైన క్రెడిట్స్ ఇస్తే బాగుండునని అభిమానుల తరపున 'హాసం' అభ్యర్థిస్తున్నది. ఒరిజినల్ పాటను 'రీమిక్స్' చెయ్యటంలో సంగీత దర్శకుడివరంగా, గాయనీ, గాయకుల పరంగా ఎక్కడా ఔచిత్య భంగం జరగలేదు. అంత వరకు ఎంతో సంతోషించాలి. ప్రేమయాత్రలకు బృందావనము నందనవనము ఏలనో, రేపంటిరూపం కంటి పాటలకు లోగడ వంశీ చేసిన(చేయించిన) రీమిక్స్‌లతో పోలిస్తే ఇది చాలా బెటరు.

హరిహరన్, కౌసల్య పాడిన 'ఉన్నట్టుగా లేనట్టుగా ఊరించి చంపింది ప్రేమ' పాటను కూడా 'సాఫ్ట్‌మెలోడీస్' ఖాతాలోకి జమ చేసుకోవాలి. అనుపల్లవిలో 'నీ కళ్ళలోనా చూపే నేనా' దగ్గర తిప్పిన మలుపు ట్యూన్ పరంగా రియల్ గుడ్ మెలొడీ.

చక్రి, కౌసల్య పాడిన 'నీ కులుకు జమకు జాం నీ పలుకు జమకు జాం' పాటలో పూర్తిగా మాస్ ఓరియంటేషన్ వున్నా మధ్యలో ఓ చిన్న క్లాస్ టచ్ ఉంది. చరణం చివర్న వచ్చే 'ఈ వేళా రావేలా' దగ్గర్నుంచి పల్లవి ఎత్తుకునే వరకు ఉన్న ట్యూన్‌ని వింటే ఆ టచ్ ఏమిటో అర్థం అవుతుంది.

మొత్తానికి సినిమా టైటిల్‌కి తగ్గట్టుగా - ఉన్న అన్ని పాటలూ ఎక్కడో దగ్గర హృదయాన్ని టచ్ చేస్తూనే ఉంటాయి. ■

కూర్పు: టి. నవీన్-హైదరాబాద్

# సరిగపదమని 32



## ఘంటసాల స్పెషల్

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | | ● |
| | ● | | ● | | ● | | ● | 5 |
| | ● | ● | 6 | ● | 7 | | | |
| 8 | | 9 | ● | 10 | ● | | ● | |
| ● | ● | | ● | | ● | ● | 11 | ● |
| 12 | | ● | ● | 13 | | ● | 14 | |
| | ● | ● | 15 | ● | ● | 16 | | ● |
| | ● | 17 | ● | 18 | | ● | | ● |
| ● | 19 | | | | ● | 20 | | |

**అడ్డం:**

1. '................. దీక్షబూని సాగరా' అల్లూరి సీతారామరాజు చిత్రంలోని గీతం (8)
6. '......హృదయంలో నిదురించే చెలీ' ఆరాధన చిత్రంలోని పాట (1)
7. 'నన్ను దోచుకుందువటే వన్నెల...........' (4)
8. '.......... .......... ..........లో ఓహో జగమే ఊగెనుగా'(3)
12. 'పాడవోయి భారతీయుడా ....... పాడవోయి విజయగీతికా' (2)
13. 'లేచింది ....... లేచింది మహిళాలోకం' (2)
14 '.......వదలరా నిద్దుర ......వదలరా' శ్రీకృష్ణ పాండవీయంలోని గీతం (2)
15. '........సుఖమే నే కోరుకున్నా నిను వీడి అందుకే వెళుతున్నా' మురళీకృష్ణ చిత్రంలోని గీతం (1)
16. 'ఇంతేనయా తెలుసుకో..... ఈ లోకం ఇంతేనయా' (2)
18. 'తెల్లచీర కట్టుకున్నదెవరికోసము ......పూలు పెట్టుకున్నదెవరికోసము'(2)
19. 'చూపులు .......... శుభవేళా ఎందుకు నీకి కలవరము' మాయబజారు చిత్రంలోని గీతం (4)
20. 'ప్రేమకోసమై ........పడెనే పాపం పసివాడు' పాతాళభైరవి చిత్రంలోని పాట (3)

**నిలువు:**

1. 'తేట తేట........... తెల్లవారి వెలుగులా' ప్రేమనగర్ చిత్రంలోని గీతం (4)
2. 'అత్తలేని కోడలుత్తమురాలు ఓయమ్మా కోడలులేని అత్త .......వంతురాలు' (2)
3. 'సింగారి చెకుముకి .......ఏమంటున్నది' నిర్దోషిలోని పాట (2)
4. 'ఎవరో ........... ఏదో చేస్తారని ఎదురుచూసి మోసపోకుమా' (4)
5. 'కల ........... విలువైనది బ్రతుకు' వెలుగునీడలులోని ప్రభోధగీతం (3)
9. '.......వాలాను నేను పక్షిలాగా పోతాను' అదపడుచు చిత్రంలోని గీతం (2)
10. 'హాయి హాయిగా .......సాగే' సువర్ణసుందరి చిత్రంలోని పాట (3)
11. '............కు బృందావనము నందనవనము ఏలనో' గుండమ్మ కథ చిత్రంలోని పాట (5)
12. '........ వీధిలో హాయిగా ఎగిరేవు' మల్లీశ్వరి చిత్రంలోని పాట(3)
17. 'నీవేనా నను........చినది నీవేనా నను పిలచినది' (2)
18. 'అదిగో నవలోకం వెలసే ......కోసం' వీరాభిమాన్యు చిత్రంలోని పాట (2)

పంపినవారి పేరు :.......................................................

వయసు :........... వృత్తి:.................................................

చిరునామా :..........................................................

...........................................................................

.......................................................ఫోన్ :...................

**పజిల్, కూపన్ 15-12-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)

రెండవ బహుమతి (ఒక తప్పుతో)

మూడవ బహుమతి (రెండు తప్పులతో)

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

This feature is sponsored by :






గ్రామీ, ఆస్కార్ అవార్డులపై కన్నేసిన

# క్రిస్టినా మిలియన్

క్యూబా అనగానే చాలామందికి హవానా సిగార్స్ గుర్తుకొస్తాయి. అయితే అంతకంటే ఘాటైన గాయని, నటి ఇకమీదట క్యూబా పేరు చెప్పగానే జ్ఞప్తికి వస్తుందనడంలో సందేహం లేదు. ఆమె పేరు క్రిస్టినా మిలియన్. బహుముఖ ప్రజ్ఞాశాలి అనే పదానికి సరైన నిర్వచనంగా ఆమెను చెప్పుకోవచ్చు. సినిమా, టీవీ, నాటక, సంగీత రంగాలలో క్రిస్టినాకు చక్కటి ప్రవేశం ఉంది. నటిగా బుల్లితెర, వెండితెరపై గుర్తింపు తెచ్చుకున్న క్రిస్టినా ఆ తర్వాత సంగీతప్రపంచంలోని 'ఇట్స్ అబౌట్ టైమ్' అనే ఆల్బమ్‌తో అడుగుపెట్టి సంచలనాలకు శ్రీకారం చుట్టింది. ఆమె తొలి సింగిల్ 'ఎమ్ టు పిఎమ్' 2001 లో 'బిల్ బోర్డ్స్ హాట్ 100' ఛార్ట్‌లో స్థానం సంపాదించుకుంది.

గాయనిగా, గీత రచయిత్రిగా, డాన్సర్‌గా, టీవీ యాంకర్‌గా, వెండితెర నటిగా ఇవాళ క్రిస్టినా అంతర్జాతీయ స్థాయిలోనూ పేరు తెచ్చుకుంటోంది. ఆమె ఆల్బమ్స్ ప్లాటినమ్ డిస్క్‌ను పొందాయి. ఆమె రచించిన గీతాలు అంతర్జాతీయ స్థాయిలో పేరు తెచ్చిపెట్టాయి. ఎంటీవీలో 'వన్నాబేస్' కార్యక్రమాన్ని ఆమె నిర్వహించింది. యు.కె.టాప్ ఫైవ్ ఛార్ట్స్‌లో ఆమె పాటలు చోటు చేసుకున్నాయి. రేడియో డిస్నీలో పన్నెండువారాల పాటు ఆమె పాట నెంబర్ వన్ స్థానంలో ఉంది. పాప్, ఆర్ అండ్ బి సంగీత విభాగాల్లో ఇవాళ క్రిస్టినా పేరు మారుమ్రోగిపోతోంది. సహజంగా పాప్ సింగర్స్‌కు సంగీత పరంగానే గుర్తింపు వస్తుంది. అలానే నటులకు ఆర్టిస్టులుగానే గుర్తింపు వస్తుంది. కానీ ఇటీవల గాయనీ గాయకులు నటీనటులుగానూ గుర్తింపు తెచ్చుకుంటున్నారు. క్రిస్టినా కూడా అదే కోవకు చెందింది. మంచి గాయనిగా గ్రామీ అవార్డును పొందటంతో పాటుగా, ఉత్తమ నటిగా ఆస్కార్‌ను చేజిక్కించుకోవాలన్నది తన కోరిక అని చెబుతోంది.

క్యూబాకు చెందిన క్రిస్టినా న్యూజెర్సీలో జన్మించింది. తొమ్మిదేళ్ళ వయసులోనే ఆమెలోని నటి వెలుగులోకి వచ్చింది. ఓ వేదికపై సంగీత రూపకాన్ని బాల్యంలోనే ఆమె ప్రదర్శించింది. చిన్నతనం నుండి టెలివిజన్ చూడటం అలవాటైన తాను, ఆ రంగంలోకి ప్రవేశించాలని భావించానని, అందువల్లే నటిని అయ్యానని క్రిస్టినా చెబుతోంది. పదమూడేళ్ళ వయసులో క్రిస్టినా తల్లి ఆమెను కాలిఫోర్నియాకు తీసుకెళ్ళింది. అక్కడ నటిగా క్రిస్టినా మరింత పేరు తెచ్చుకోగలిగింది. టీవీ షోలు, సీరియల్స్ 'ఛార్మ్స్', 'సిస్టర్ సిస్టర్', 'క్లులెస్', 'స్మార్టగై'లలో నటించింది. 1999లోనే 'ద ఉడ్' అనే చిత్రంలో అవకాశాన్ని పొందింది క్రిస్టినా. అలానే యానిమేషన్ ఫిల్మ్ 'ఎ బగ్స్ లైఫ్' కు గాత్రాన్ని అందించింది. 2000 వ సంవత్సరంలో క్రిస్టినా పాడిన 'బిట్వీన్ మీ అండ్ యు' పాటకు గానూ ప్రపంచ వ్యాప్తంగా మంచి గుర్తింపు వచ్చింది. ఈ గుర్తింపును ఆధారం చేసుకునే క్రిస్టినా 2001-2002 సంవత్సరాలలో దాదాపు పదిహేడు దేశాలలో ప్రదర్శనలు ఇచ్చింది. తనకు లభిస్తున్న ఆదరణ గురించి చెబుతూ, 'చిన్నతనం నుండి నేను మైఖేల్ జాక్సన్, జనెట్ జాక్సన్‌లను గమనిస్తూ, వారికి సంగీత ప్రియుల నుండి లభిస్తున్న ఆదరణను అధ్యయనం చేస్తూ పెరిగాను . వాళ్ళకు లభించిన విజయమే నాలో నమ్మకాన్ని పెంచింది. నాకంటూ కొందరు అభిమానులను సంపాదించుకోవాలని అనుకున్నాను. ముఖ్యంగా నేను చేసిన ప్రపంచ యాత్ర నాకెంతో ఉపయోగపడింది. ఏది జరిగినా అది భగవత్ సంకల్పమనే నేను భావిస్తాను. ఆ రకంగా ఆ పైవాడి ఆశీస్సులు నాకున్నాయనిపిస్తోంది" అంటోది క్రిస్టినా. గాయనిగా, నటిగా కొనసాగుతానని చెబుతూ, "ఇది రెండు పడవల ప్రయాణం కాదు, ఈ రెండు రంగాల్లో కొనసాగడం చేతిలో చేయి వేసి సాగడమన్నది నా అభిప్రాయం " అని అంది.






గాయని బియాన్స్‌కు క్రిస్టినాకు దగ్గరి పోలికలు ఉంటాయని చాలమంది చెబుతుంటారు. దీనిపై స్పందిస్తూ, "నా దృష్టిలో బియాన్స్ మంచి గాయని. ఆమెతో పోల్చబడం అదృష్టంగానే భావిస్తుంటాను. నా హెయిర్ స్టయిల్ వల్ల అలా పోల్చుతూ ఉండొచ్చు. అంతేకానీ గాయనిగా కాదు అని నేను అనుకుంటున్నా. ఒకే రకమైన రంగులో జుత్తు ఉండటం బోర్‌గా అనిపించి, నేను రంగు మార్చేశానే కానీ, బియాన్స్‌ను అనుకరించాలని కాదు" అని చెప్పింది.

- వి. అరుణసత్యవతి

రచన: వెన్నెలకంటి **1** గానం: చక్రి, కౌసల్య

ఆ: వలపుల వరం స్వరం నిరంతరం మోగనీ తీయగా
తలపుల క్షణక్షణం నిరీక్షణం సాగనీ హాయిగా
ఆ: పెదవుల గులాబీ ఇచ్చుకోనా
బదులుగ కులాసా పుచ్చుకోనా
చెలిమికి నమస్తే నేస్తమా
అ: వందనం వలపు వందనం కులుకు కుందనం చందనం
బంధనం బిగిసె బంధనం సొగసు ఇంధనం నందనం
ఆ: తొలకరి కలే ఇలా ఫలించగా ఎందుకీ తొందరా
సొగసరి సితారలో సుతారమే అందుకో ముందరా
అ: నీ ఆశే శ్వాసగా నీ ఊసే ధ్యాసగా
నీడగా నీ తోడుగా బతికేనా
ఆ: నీ చూపే ప్రాణమై నీ నవ్వే గానమై
నిన్ను నే అణువణువునా వెతికేనా
అ: గుండె గొంతులో పలికే ఎండ వెన్నెలే చిలికే
ఆ: జాజిపూలలో తొణికే తొలిమోజు సన్నగా వణికే
అ: జీవనం ప్రణయ భావనం మనకు మధువనం యవ్వనం
ఈ క్షణం చెలియ వీక్షణం అడిగె చుంబనం గుంభనం
ఆ: ॥తొలకరి॥
అ: వేసవిలో చల్లగా ఊసులనే చల్లగా
కన్నుల సిరివెన్నెల కురిసేనా
ఆ: తలపులలో తీయగా తలుపులనే తీయగా
గుండెలో చలి ఎండలే కాసేనా
అ: మేఘమాలికలపైనా ఇలకు వొచ్చేనీమైనా
ఆ: రాగమాలికలపైనా నే రాజహంసలా రానా
అ: కాగితం మనసు కాగితం అడిగె తియ్యనీ సంతకం
అ: జీవితం పలికె స్వాగతం బతుకు ప్రేమకే అంకితం॥వలపుల॥

రచన: వెన్నెలకంటి **3** గానం: హరిహరన్, కౌసల్య

అ: ఉన్నట్టుగా లేనట్టుగా ఊరించి చంపింది ప్రేమ
ఆ: ఉన్నట్టుగా లేనట్టుగా ఊరించి చంపింది ప్రేమ
అ: అన్నట్టుగా విన్నట్టుగా అందింది ఈ చందమామా
ఆ: హాయి రాగమైనా సరదాగా పాడుకోనా
అ: గాలి పాటలోనా సరసాలు ఆడుకోనా
ఆ: నీ కళ్ళలోనా చూపే నేనా
అ: నీ గుండె గుడిలో దీపం కానా ॥ఆ: ఉన్నట్టుగా॥
ఆ: అనువైన వేళా చనువైనా వేళా
ఎదలో కదిలే ఒక రాసలీల
అ: విరజాజి మాలా తొలిమోజు బాలా
కలిసే జతలో మోమాటమేలా
ఆ: ముడిచే ముద్దాటలో చొరవే చెయ్యొద్దు
అ: పొడిచే పొద్దాటలో తలుపే తియ్యొద్దు
ఆ: ఒడిలో సడిలో పిలుపే విన్నావా
అ: అదిగో ఇదిగో అంటూ ఊరిస్తుంటే ఉడికిస్తుంటే
ఊర్కోమంటావా ॥ ఆ: అన్నట్టుగా॥
ఆ: నిదురైనరాదు కుదురైన లేదు
నీకై మనసే క్షణమాగలేదు
అ: పిలుపైన లేదు మరుపైన రాదు
ఇంకా విరహం ఎద వేగలేదు
ఆ: కలిసి ఉందామని కలలే కన్నాము
అ: కలలే ఫలించగ కలిసే ఉంటాము
ఆ: వరసే కలిపే సమయం రావాలి
అ: మనసే తెలిపే మాటే గుండెల్లోనా
దాగుందమ్మా నువ్వే వినాలి ॥ ఆ: ఉన్నట్టుగా॥

రచన: సి.నారాయణరెడ్డి **2** గానం: హరిహరన్, కౌసల్య

ఆ: చిలిపి కనుల తీయని చెలికాడ
నీ నీడను నిలుపుకొందురా....నిలుపుకొందురా వెల్లలమేడ
అ: నీలికురుల వన్నెల జవరాల
నీ కౌగిట నిలుపుకొందునే పూల ఉయ్యాల
ఆ: కనుల ముందు అలలు పొంగెను
అ: ఓ ఓ ఓ......
ఆ: మనసులోన కలలు పండెను ॥కనుల॥
అ: అలలే కలలై
ఆ: కలలే అలలై
అ: అలలే కలలై
ఆ: కలలే అలలై
అ: గిలిగింతలు సలుప సాగెను ఆ: ॥చిలిపి కనుల॥
అ: కొండలు కోయని పిలిచినవి
గుండెలు హోయని పలికినవి
ఆ: ఆ....ఆ....ఆ... అ: ॥కొండలు॥
ఆ: కోరికలన్నీ బారులు తీరి ॥2॥
గువ్వలుగా ఎగురుతున్నవి అ: ॥నీలికురుల॥

రచన: వెన్నెలకంటి **4** గానం: హరిహరన్, కౌసల్య

ఆ: సరేలే సరేలే సరేలే సరేలే
అ: చిలిపి కలయిక సరేలే తీపి కలలిక సరేలే
ఆ: మేలి తలపులు సరేలే మేలు కొలుపులు సరేలే
అ: జాలి పిలుపులు సరేలే పూల ఎరుపులు సరేలే ॥అ: సరేలే॥
ఆ: పసిమిరంగు మిసిమి పొంగు కలసి పాడే శ్రుతి సరేలే
అ: చెలిమిపువ్వు చెలియనవ్వు కలహమాడే లయ సరేలే
ఆ: ఆదమరపులు సరేలే హాయి గొలుపులు సరేలే
అ: తీయు తలుపులు సరేలే మూయు మలుపులు సరేలే
ఆ: అయినదేదో సరేలే అవునో కాదో సరేలే ॥అ: సరేలే॥
అ: నీకు నచ్చే ఆకుపచ్చే నన్ను మెచ్చే కథ సరేలే
ఆ: రేకు విచ్చే సోకు విచ్చే దాపుకొచ్చే ఎద సరేలే
అ: చింత తీరుట సరేలే చెంత చేరుట సరేలే
ఆ: వయసు పాడుట సరేలే సరసమాడుట సరేలే
అ: వలపు తెలుపుట సరేలే
ఆ: వరస కలుపుట సరేలే
అ: సరేలే....సరె సరే....సరేలే
ఆ: సరేలే....సరేలే...
అ: చిలిపి కలయిక సరేలే తీపి కలలిక సరేలే
ఆ: మేలి తలపులు సరేలే మేలుకొలుపులు సరేలే
అ: జాలి పిలుపులు సరేలే
ఆ: పూల ఎరుపులు సరేలే
సరేలే సరేలే
అ: ఆ......ఆ.........
అ: సరేలే
ఆ: సరె...సరేలే
అ: సరె...సరేలే
ఆ: సరె...సరేలే
ఇ: సరేలే



రచన: వెన్నెలకంటి (5) గానం: వేణు, కౌసల్య

అ: హల్లో అన్నాను మొన్న కల్లో కొచ్చింది నిన్న
ఒళ్ళో వాలింది నేడు జాణ
ఆ: చూపే వేశాడు మొన్న కూపీ తీశాడు నిన్న
కాపీ వేశాడు గుండెలోన
అ: తళుకుల తాళం వాయిద్దాం తలగడ మంత్రం వేయిద్దాం
తలపుల రాగం మోగేవేళ
ఆ: తలపుల చాటున ఉంటావా వలపుల పాటను వింటావా
తలుపులు తీసి రమ్మంటావా
అ: సందిళ్ళన్నీ పందిళ్ళైతే తొందరపడవే సుందరవదన
ఎందుకు సిగ్గు అయ్యోరామా ॥హల్లో॥
అ: చిరుబురులాడే చిన్నమ్మో సన్నాయి నొక్కుల్లోన
కొరకొరలన్నీ చాలమ్మో జతలో
ఆ: సలసల కాగే వెన్నెల్లో
వయ్యారి చుక్కల్లోన
విలవిలలన్నీ నీవమ్మో శ్రుతిలో
అ: వలపులవీణ పలికింది నీకంటిపాపల్లోన
తలుపులవానై చిలికింది ఎదపైనా
ఆ: ఉరుకుల వేగం ఉండుండి గుండెల్ని తొలిచేవేళ
పరుగుల రాగం సరిగమలై పాడవేలా
అ: హోయి రాగమాలపించు అలకనందనీవే ॥హల్లో॥
అ: సరసకు వచ్చే సింగారం
సాయంత్రం సంధ్యాతీరం
సరసతలిచ్చే మందారం..అధరం
ఆ: నుదుటను విచ్చే సిందూరం
ఊరించే నీ నయగారం
ఎదుటకు వచ్చే శృంగారం... మధురం
అ: మిసమిసలాడే పరువాల
పరదాలే తీయ్మంటావా
గుసగుసలాడే గుండెల్లో ఉండిపోవా
ఆ: పెరపెరలాడే పెదవులపై
పేరంటం చేయిస్తావా
కువకువలాడే ఊహల్లో నిండిపోవా
అ: కాళిదాసు రాయలేని
కావ్యకన్యనీవే ॥హల్లో॥

రచన: వెన్నెలకంటి (6) గానం: చక్రి, కౌసల్య, బృందం

బృ: ఆరైనా నూరైనా ఏదైనా ఏమైనా
ఔనన్నా కాదన్నా ఆగదు ప్రేమ
అ: నీ కులుకు జమకు జాం నీ పలుకు జమకు జాం
నీ తళుకు బెళుకు చూస్తేనే వణుకు జమకు జాం
ఆ: నువ్వు జమకు జాం నీ నువ్వు జమకు జాం
అ: నువ్వు కళ్ళతోటి కవ్విస్తే వణుకు జమకు జాం
అ: ఎప్పుడెప్పుడంటోంది ఆరాటం
ఆ: విప్పి చెప్పుకోలేని మోమాటం
అ: వాలుపొద్దుల్లో తొలి వయసు ముద్దుల్లో
చెరిపేసే హద్దుల్లో చెలగాటం
ఆ: కలల వింతల్లో నా కలవరింతల్లో
ఈ చిలిపి చింతల్లో ఆరాటం అ: ॥నీ కులుకు॥
అ: పలుకు మధురవాణి నీ కులుకు కృష్ణవేణి
తళుకు బెళుకు రాణీ జమకు జమకు జాం
ఆ: అదిరిపడిన ఓణీ ఇక అడుగుతోంది బోణీ
చిలిపి వయసుబాణీ జమకు జమకు జాం
ఆ: ఎదురుపడి నిదురచెడి కుదురులేక పోయే
ఆ: మదనబడి మధనపడి మధురమైన హాయే
అ: ఈ వేళా రావేలా... ॥2॥ అ: ॥నీ కులుకు॥
అ: నవ్వుతున్న చిలక నను కవ్వమల్లె చిలక
చలికి చెలికి వణుకు జమకు జమకు జాం
మల్లెపూల వేళ ఈ పిల్లగాలి ఈల
చేసింది గోల గోల జమకు జమకు జాం
అ: సోకుసిరి రేకుమరీ విచ్చుకున్న వేళ
ఆ: చూపు గురి మాపు మరీ గుచ్చుకున్న వేళ
అ: రావేలా ఓ బాలా....॥2॥ అ: ॥నీ కులుకు॥



రచన: వెన్నెలకంటి (7) గానం: చక్రి

సరేలే సరేలే సరేలే సరేలే
పంతమైనా సరేలే పందెమైనా సరేలే
చేరువైనా సరేలే దూరమైనా సరేలే
పలకరింతలు సరేలే అలకరింతలు సరేలే
సరేలే సరేలే సరేలే
కాలమంతా ఎదురుచూపై కరిగిపోయే కథ సరేలే
ప్రాణమైనా ప్రేమరాగం పరవశించే శ్రుతి సరేలే
కొంటె ఊసులు సరేలే కంటి బాసలు సరేలే
వేడి శ్వాసలు సరేలే జోడు ఆశలు సరేలే
వెన్నెలైనా సరేలే వేకువైనా సరేలే
సరేలే సరేలే సరేలే సరేలే
గుండెతిన్నెల వెండి వెన్నెల ఎగసిపడిన అల సరేలే
నిదుర రాని కుదురులేని ఎదలుకన్న కల సరేలే
కలసి ఉన్నా సరేలే తెలుసుకున్నా సరేలే
వేచి ఉన్నది సరేలే దాచుకున్నది సరేలే
మాయమాటలు సరేలే హోయి ఆటలు సరేలే
సరేలే సరేలే సరేలే
సరె సరె సరేలే



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




వి.దొరస్వామి రాజు సమర్పించు
విజయమారుతి క్రియేటివ్స్

వంశీ

# కొంచెం టచ్‌లో వుంటే చెపుతాను!

వి.విజయ్‌కుమార్ వర్మ, చక్రి


వి.విజయ్‌కుమార్ వర్మ


వంశీ


చక్రి


సి.నారాయణరెడ్డి


వెన్నెలకంటి

## తారాగణం

శివాజీ, వేదా,
ప్రకాష్‌రాజ్, ఎం.ఎస్.నారాయణ,
బ్రహ్మానందం, క్రిష్ణభగవాన్, జీవా,
వేణుమాధవ్, సుమన్‌శెట్టి,
చిత్రం శ్రీను, ఏ.వి. యస్., ఆలీ,
కొండవలస, సూర్య,
జోగినాయుడు, కాంచీ,
దువ్వాసి మోహన్, మెల్కొటే,
రాజాశ్రీధర్, సుదర్శన్,భువనేశ్వరి,
ద్రాక్షరామం సరోజ, అపూర్వ, మధు,
అర్చనారాయ్, బ్యాంక్ సురేష్,
కృష్ణేశ్వరరావు, ప్రసాదమూర్తి

## సాంకేతిక నిపుణులు

| | | | |
|---|---|---|---|
| బేనర్ | : విజయమారుతీ క్రియేటివ్స్ | ప్రొడక్షన్ మేనేజర్స్ | : డి.రమేష్,నరసింహరావు |
| కథ,మాటలు | : శంకరమంచి పార్ధసారధి | కేషియర్ | : వి.ప్రసాద్ |
| డైరెక్టర్‌ఆఫ్ ఫోటోగ్రఫి | : యం.వి. రఘు | కో-డైరెక్టర్ | : మద్దిరాల |
| ఆర్ట్‌డైరెక్టర్ | : డి.వై.సత్యనారాయణ | పి.ఆర్.ఓ | : పులగం చిన్నారాయణ |
| ఎడిటింగ్ | : బస్వాపైడిరెడ్డి | పబ్లిసిటీ | : ప్రకాష్ స్టూడియో |
| కాస్ట్యూమ్స్ | : కె.వేణు, గణపతి | అసోసియేట్స్ | : పి.వి.రాఘవరెడ్డి, నరేంద్ర, |
| మేకప్ | : టి. మల్లికార్జునరావు | | సూరపు శాంతారాం |
| కొరియోగ్రఫీ | : శ్రీధర్ రెడ్డి | అసిస్టెంట్స్ | : శివాజీగణేశ్, వసంత్ |
| పాటలు | : వెన్నెలకంటి, సినారె | సంగీతం | : చక్రి |
| ఫైట్స్ | : రాజు | సమర్పణ | : వి.దొరస్వామిరాజు |
| స్టిల్స్ | : రఘు | నిర్మాత | : వి.విజయకుమార్ వర్మ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : డి.యోగానంద్ | దర్శకత్వం | : వంశీ |

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

శాంతారామ్ చిత్రాలంటేనే వాటికొక విలక్షణమైన వ్యక్తిత్వం ఉంటుంది. ఆయన సినిమాలో ఒక్క దృశ్యం చూసినా చాలు- ఇది శాంతారాందని చెప్పేయవచ్చు. అలాంటిముద్ర ఆయునది. ప్రకృతి సౌందర్యం, దాన్ని అనుకరిస్తూ మానవుడు చేసే కళా ప్రయత్నం, మనసును, బుద్ధినీ కూడా చలింపచేసే సంగీతం, అసాధారణమైన భావుకత- వెరసి అవిమనకు మరో లోకాన్ని సృష్టిస్తాయి. ఆ లోకంలో కాస్సేపు విహరించినా చాలు - మనలో ప్రాచీన లాక్షణికులు చెప్పిన రసానందం కలుగుతుంది. **'సౌందర్యారాధన', 'మానవీయ దృక్పథం'** అయన చిత్రాలకు ప్రధాన ప్రేరణలు. అలాంటి చిత్రాల్లో ఒకటి **'గీత్‌గాయా పత్తరోంనే'**,(శిలలు **పాడుతున్నాయి)** అన్న శీర్షికలోనే గొప్ప భావుకత ఉంది. మన హృదయనేత్రాల ముందు ఒక భావ చిత్రం ప్రత్యక్షమవుతుంది.

'దృశ్యకావ్యం' అనే పదబంధాన్ని మనం చాలా అలవోకగా అందరికీ వాడేస్తుంటాం గానీ, అది శాంతారాంకు అతికినట్లు మరొకరికి పొనగదు. ఈ దృశ్యకావ్యంతో జితేంద్ర, శాంతారామ్ కుమార్తె రాజశ్రీ సినీజీవితాన్ని ప్రారంభించారు. తర్వాత కొన్ని హిట్లు అందించినా, అందానికీ, నాట్యకౌశలానికీ పేరు తెచ్చుకున్నా, రాజశ్రీ త్వరగానే సినిమాల్లోంచి నిష్క్రమించింది. జితేంద్ర సూపర్ హిట్ హీరో అయ్యాడు.

ఈ చిత్రానికి సంగీతం రామ్‌లాల్, రీరికార్డింగ్ వసంత్ దేశాయ్! రామ్‌లాల్ కొన్ని చిత్రాలకే సంగీతం అందించినా అవన్నీ మరువలేని పాటలే. హిందీ చలన చిత్ర సంగీతంలో ఎప్పటికీ నిలిచిపోయేవే. అలాంటి పాటలే 'గీత్ గాయా పత్తరోంనే'లో ఉన్నాయి. ఆశా పాడిన **'తేరే ఖయాలోంమే హమ్-తేరే హీ బాహోంమే హమ్', 'ఆజా జానేజా-మేరే మెహరుబా'** ఆమె కెరీర్ లోనే అత్యుత్తమ గీతాల కోవకు చెందుతాయి. శాస్త్రీయ రాగాలను జనరంజకంగా మలచడంలో అసామాన్య ప్రతిభ కలిగిన సంగీత దర్శకుడు రామ్‌లాల్. అతని సంగీతానికి హస్రత్ జైపురీ సాహిత్యమంటే ఇక ఆ పాటల నాణ్యతను వేరే చెప్పాల్సిన పనిలేదు.

'గీత్ గాయా పత్తరోనే' పాట సినిమాలో రెండు సార్లు వస్తుంది. శీర్షికా గీతం కనక, ఆయా సన్నివేశాలకు చాలా ప్రాముఖ్యం ఉంది. మొదటిసారి నాయికా, నాయకుల ప్రేమను ప్రతిష్టించే సన్నివేశం. (ఆశా, మహేంద్ర కపూర్ ల గానం). రెండోసారి పతాక సన్నివేశంలో, విడిపోయిన కథానాయికా, నాయకులను కలిపే ఘట్టంలో నాయిక పాడిన సందర్భం. (సుప్రసిద్ధ హిందుస్తానీ విద్వాంసురాలు కిశోరీ అమోంకర్, బృందం పాడారు).

ఈ పాటల సాహిత్యం, సంగీతాల సౌందర్యం ఒక ఎత్తయితే, వాటి చిత్రీకరణ మరో అద్భుతం. మొదటి సన్నివేశానికి నేపథ్యం భగవంతుడు సృజించిన ప్రకృతి సౌందర్యం. రెండో సన్నివేశానికి నేపథ్యం మానవుడు దాన్ని అనుకరిస్తూ































అందించిన కళా సౌందర్యం. నాయిక నర్తకి, నాయకుడు శిల్పి. ఇక కళకు కొదవేముంది? శిల్ప, నాట్యాలకు ఉన్న అనుబంధాన్ని అర్థం చేసుకోవాలన్నా, ప్రకృతి అనుకరణమే కళ అన్న తత్వవేత్తల సిద్ధాంతానికి వ్యాఖ్యానాన్ని తెలుసుకోవాలన్నా, ఈపాట సన్నివేశాన్ని చూస్తే చాలు. అసలు ఈ పాటను వింటే చాలు.

శిలలను చెక్కుతూ, వాటికి ప్రాణప్రతిష్టను చేస్తున్న శిల్పి, ఆ శిల్ప భంగిమలను అలవోకగా ప్రదర్శిస్తున్న నర్తకి- మొదటి పాట సన్నివేశంలో మనల్ని గిలిగింతలు పెడతాయి. మనకే తెలీని ఒక భావుకలోకానికి మనల్ని తీసుకువెళ్తాయి. రెండో సన్నివేశంలో ఒక ఆవేశం, ఒక ఆర్తి ఉన్నాయి. ఇక్కడ ప్రకృతి లేదు; స్థలం ఒక శిల్ప మందిరం. అద్భుతమైన రంగాలంకరణతో, రంగస్థల నృత్యంతో వందలమంది ప్రేక్షకులను ఆకట్టుకునే సన్నివేశం ఇది. తమ అనుబంధం తెలీకుండానే ఆదరించిన తన తండ్రి అడిగాడని నృత్యం చేస్తూ, తనను తిరస్కరించిన భర్త ప్రేక్షకుల్లో ఒకడై తిలకిస్తుండగా, భావావేశంతో అభినయించే నాయిక ఈ పాటను ఆలపిస్తుంది.

మొదటి సన్నివేశం ప్రకృతి. నాయిక నాట్యం కూడా అక్కడ అత్యంత సహజంగా, స్పాంటేనియస్(సద్యస్ఫూర్తితో)గా ఉంటుంది. రెండవ సన్నివేశం కళ. ఇక్కడ నాట్యం, నేర్చిన నాట్యంలా ఉంటుంది. కళకు సంబంధించిన అన్ని పార్శ్వాలనూ, వాటి ప్రాణాన్నీ పట్టుకోగలిగిన మేధావి కనకనే శాంతారాం ఇంత సూక్ష్మంగా ఈ దృశ్యాలను భావన చేసి, తెర పై హృద్యంగా చూపగలిగాడు. ఇక పాట. మొదటిది- ఆశా భోంస్లే, మహేంద్ర కపూర్ పాడేది. ఇందులో మహేంద్ర కపూర్ వాటా చాలా తక్కువ . అక్కడక్కడా ఆలాపనలు, పల్లవి పొడ్డం మాత్రమే. ఎక్కువ పాట ఆశాయే పాడుతుంది. పాటఆలాపనతో ప్రారంభమవుతుంది.

తర్వాత

**సా సోంకీ తార్ పర్ - ధడ్‌కన్ కీ తాల్ పర్**
**దిల్ కీ పుకార్ కా - రంగ్ భరే ప్యార్ కా**
**గీత్ గాయా పత్తరోనే - 2**

మొదటి చరణం :

**పథరీలీ హోటోంసే నికలాహై నగ్‌మా - ఓ-2**
**అల్ బేలా - దర్దీలా - మస్తీ భరీ జిందగీకా**
**చమ్‌కే మొహబ్బత్ కీ - పెహలూ హజారోం**
**పైగామ్ హై బేఖుదీ కా**
**మౌసమ్ కీ సాజ్ పర్ - మస్తానీ గూంజ్‌మే**
**దిల్ కీ పుకార్ కా - రంగ్ భరే ప్యార్ కా ॥గీత్ గాయా॥**

రెండో చరణం :

**జబ్ తక్ హై కాయమ్ యే ధర్తీ యే అంబర్ - ఆ -2**
**యాదోంకీ -ఆహోంకీ - గూంజా కరేంగే తరానే**
**అప్‌నే హీ సీనోంకీ యే బేకరారీ - దేఖా కరేంగే జమానే**
**హృదయ్ యే బీన్ పర్ - జీవన్ కే తార్ పర్**
**దిల్ కీ పుకార్ కా - రంగ్ భరే ప్యార్ కా ॥గీత్ గాయా॥**

పల్లవి :

పత్తర్ అంటే రాయి, సాస్ అంటే ఊపిరి, తార్ అంటే తీగె, ధడకన్ అంటే గుండె సవ్వడి, తాల్ అంటే తాళం, పుకార్ అంటే పిలుపు.

**ఊపిరి తీగెలపై - గుండె సవ్వడుల తాళం పై**
**మనసిచ్చిన పిలుపుతో -రంగులీనే ప్రేమతో**
**పాడుతున్నాయి శిలలు**

మొదటి చరణం:

పథరీలి అంటే రాయి లాంటి, నగ్‌మా అంటే పాట. అల్ బేలా అంటే విలక్షణం, దర్దీలా విషాదకరం. పెహలూ అంటే ముఖాలు, కోణాలు, పైగామ్ అంటే సందేశం; బేఖుదీ అంటే వివశత్వం, మౌసమ్ అంటే రుతువు, సాజ్ అంటే వాద్యం, గూంజ్ అంటే ధ్వని.

**రాయి వంటి పెదవి నుంచి పాట వెలువడింది**
**విలక్షణమై, విషాదమై, సరదా నిండిన జీవనగానం**
**ప్రేమలోని వేలవేల పార్శ్వాలు కాంతులీనాయి**

ఇది వివశత్వం ఇస్తున్న సందేశం
రుతువనే వాయిద్యంపై - పరవశింపజేసే నాదంలో
మనసిచ్చే పిలుపుతో -రంగులీనే ప్రేమతో ॥పాడుతున్నాయి శిలలు॥

రెండో చరణం:

కాయమ్ అంటే ఉన్నంతవరకు, ధర్తీ అంటే భూమి, అంబర్ అంటే ఆకాశం, యాదోం అంటే జ్ఞాపకాలు, ఆహ్ అంటే నిట్టూర్పు, గూంజ్‌నా అంటే ప్రతిధ్వనించడం తరానే అంటే సంగీతం, సీనా అంటే హృదయం; బేకరారీ అంటే అశాంతి; హిరదయ్ అంటే హృదయం; బీన్ అంటే వీణ.

ఈ భూమి, ఈ ఆకాశం నిలిచినంతకాలం
జ్ఞాపకాలు, నిట్టూర్పుల నాదాలు ప్రతిధ్వనిస్తాయి
మన మనసుల్లోని ఈ అశాంతిని - జగమంతా వీక్షిస్తుంది
హృదయవీణపై - జీవితమనే తీగలపై
మనసిచ్చే పిలుపుతో -రంగులీనే ప్రేమతో ॥పాడుతున్నాయి శిలలు॥

మానవ చరిత్రకు, మనిషి మనో భావాలకు శిలలు సాక్షులుగా ఉంటాయనీ, మానవుడి ఆశానిరాశలను, కోరికలను అవి ప్రతిధ్వనిస్తాయనీ ఒక గొప్ప భావనతో రాసిన పాట ఇది. అందుకే చిత్రీకరణలో కూడా నాయికా నాయకులను చూపిస్తూనే, అక్కడి చరిత్రను, రాజుల జీవిత శకలాలను సూపర్ ఇంపోజ్ చేసి ఒకేసారి అనేక విషయాలను మన దృష్టికి తీసుకువస్తాడు దర్శకుడు. చరిత్రను, సమకాలీన జీవితాన్ని ఒక దాని కొకటి పర్యాయంగా ఈ దృశ్యంలో చూపుతాడు. ఆశా కంఠస్వరం ఆ పాటలో చెప్పినట్లుగా 'హృదయవీణపై, జీవితమనే తీగెలను' మీటినట్లే ఉంటుంది. మహేంద్ర కపూర్ పాడింది తక్కువే అయినా, చాలా శ్రావ్యంగా పాడాడు. దర్శకుడి మనోభావనలకు అద్భుతమైన అక్షరావిష్కరణ చేసాడు హస్రత్ జైపురీ.

రెండో వెర్షన్ లో పల్లవి అదే. అయితే ఆలాపనలో వైవిధ్యం ఉంది. ఈ పాటలో శాస్త్రీయ సంగీత పోకడలు ఎక్కువుంటాయి. జయపూర్ ఘరానాకు చెంది, అందులో కూడా నూతన ధోరణిని, సృజనాత్మకతను ప్రవేశపెట్టిన అసాధారణప్రతిభావంతురాలు కిశోరీ అమోంకర్. అప్పుడప్పుడూ సినిమా పాటలు పాడినా, కొన్ని సూపర్ హిట్లయినా (ఉదా. కుర్బానీలోని హమే తుమ్ సే ప్యార్ కిత్ నా ), సినీ సంగీతం పట్ల మక్కువ ఏర్పడని శుద్ధ శాస్త్రీయ సంగీత విద్వాంసురాలు ఆమె.

ఇక పాట.

మొదటిచరణం:

దిల్ కీ పుకార్ కా - రంగ్ భరే ప్యార్ కా
ఇన్‌సాన్ కీ చాహత్ భరీ కల్పనానే
దేదీ హై - భర్ దీ హై - పత్తర్ మే వో నౌజవానీ
ఏక్ ఏక్ సూరత్ హై - షక్ల్- ఎ- మొహబ్బత్
హథోనే దీ జిందగానీ - ప్యార్ కే సురోంపర్ -
అప్ నే హీ ధున్ మే ॥దిల్ కి పుకార్ కా॥

రెండవ చరణం :

హర్ ఏక్ పత్తర్ సే బర్ సేగీ ఉల్ఫత్
ఖయాలోమే, సదియోమే హర్ దమ్ రహేంగే యే మిల్ కే
దిల్ మే నహీ హై ఇన్‌సాన్ కా భేద్ భావ్
టుక్‌డే హై యే ఏక్ దిల్ కే - శాంతి కే రాగ్ పర్ -
ఏక్‌తా కీ తాన్ పర్ ॥దిల్ కీ॥

1. చాహత్ అంటే ప్రేమ, షక్ల్ అంటే ముఖం, సుర్ అంటే స్వరం, ధున్ అంటే సంగీతం

మానవుడి ప్రేమపూర్వకమైన కల్పన
రాయికి యౌవనాన్నిచ్చింది; యౌవనంతో నింపింది
రాయిలోని ప్రతి ముఖమూ ప్రేమపూర్ణంగా దర్శనమిస్తోంది
మనిషి చేతులు రాయికి జీవాన్నిచ్చాయి
ప్రేమ స్వరంలో, తనదైన రాగంలో ॥మనసిచ్చే పిలుపు॥

2. ఉల్ఫత్ అంటే ప్రేమ; ఖయాలోంమే అంటే జ్ఞాపకాల్లో, సదియోమే అంటే యుగయుగాలుగా, ఒక్కొక్క రాయి నుంచి ప్రేమ వర్షిస్తోంది.

జ్ఞాపకాలనుంచి, యుగయుగాల నుంచి ఇవి కలిసే ఉన్నాయి











మానవ హృదయంలో కూడా భేదభావాల్లేవు
అందరూ ఒక మనసులోని భిన్న భాగాలే
శాంతి రాగంపై - ఐక్యతా స్వరంపై ॥మనసిచ్చే పిలుపు॥

ఇక్కడ మొదటి చరణంలో మనిషి రాయికి ఎలా ప్రాణం పోసాడో, మనిషి చేతుల్లో రాయి ఎలా సజీవమూర్తి అయిందో చెప్పాడు కవి. రెండో చరణంలో రాళ్ళనుంచి మనిషి నేర్చుకున్నది, నేర్చుకోవలసింది సూచించాడు. శిలలలో ఉన్న యుగయుగాల అనుబంధాన్ని, ఐక్య భావాన్ని మానవుడు అలవరచుకోవలసిన అవసరాన్ని చెబుతున్నాడు.

ఈ పాట రెండు వెర్షన్‌లూ వినడానికీ, చూడడానికీ కూడా గొప్ప అనుభవాలే!

- మృణాళిని





"పిల్లలూ! మీరంతా గాంధీగారి అడుగు జాడల్లో నడవాలి."
"అవిప్పుడు చెరిగిపోయి ఉంటాయి కదా టీచర్, మరెలా!?"

"ఒరేయ్ ! హుస్సేన్ సాగర్‌లో బుద్ధ విగ్రహం ఒక చెయ్యి కడుపు మీదకి, ఒక చెయ్యి పైకి ఎందుకు చూపిస్తుందిరా?"
"ఈ నీళ్ళు కడుపులోకి వెళితే పైకి పోతారని చెప్పడానికి".





"కొబ్బరికాయ మన ఇంట్లో వున్న దేవుని పటం దగ్గర కొడితే ఎక్కువ పుణ్యం వస్తుందా? గుడిలో కొడితే వస్తుందా?"
"గుడిలో కొడితే ఒక చిప్పే వస్తుంది. ఇంట్లో కొడితే రెండు చిప్పలూ మనవే"



"ఏ యుద్ధంలో హర్షవర్థనుడు మరణించెను ?"
"ఆయన చేసిన చివరి యుద్ధంలో!"



"ఆంగ్లేయులు మనదేశానికిఎప్పుడు వచ్చి ఎప్పుడు వెళ్లిపోయిరి?"
"చరిత్ర పుస్తకం 15వ పేజిలో వచ్చి, 23వ పేజిలో వెళ్లిపోయిరి."



"కాలేజి అయిపోయాక నువ్వు ఏమవ్వాలనుకుంటున్నావు?"
"ఫాదర్ కావాలనుకుంటున్నాను సార్!"
"ఓహో! ఏ చర్చ్‌కి ?"
"చర్చ్‌కి కాదు సార్, మీ అమ్మాయికి పుట్టబోయే పిల్లలకి."



"పరీక్ష రాసేటప్పుడు పక్కవారిని పెన్నులు, పెన్సిళ్ళు, రబ్బర్లు అడక్కూడదు తెల్సిందా?"
"జవాబులు అడగొచ్చాసార్!?"



"రమేష్! రవిని ఎందుకు కొట్టావు?"
"వాడు నెలక్రితం నన్ను హిప్పోపొటమస్ అని తిట్టాడు టీచర్."
"అప్పుడు తిట్టాడని ఇప్పుడు కొడతావా!"
"ఆ పదానికి అర్థం ఇప్పుడే తెలిసింది టీచర్!"

**ఈ జోకులను పంపించిన వారు: సిహెచ్. సురేష్‌కుమార్,విజయనగరం.**

"మనకు కాబోయే అల్లుడెలా ఉన్నాడు కాంతం?"
"బాగానే ఉన్నాడు కానీ, నవ్వుతుంటే వళ్లు కన్పిస్తున్నాయి.... అదే బాగోలేదు"
"పెళ్లయితే ఆ అవకాశం ఉండదు లేవే..."



భర్తపోయిన భారతిని పలకరించ డానికి వెళ్లిన మాలతి అడిగింది.
"ఎలా పోయారాయన?"
"మొన్న కాళ్లు నొప్పిగా ఉన్నాయి పట్టమన్నారు... పట్టాను. నిన్న నడుము నొప్పి అన్నారు... పట్టాను. ఈవేళ గొంతునొప్పి అన్నారు..!"



**ఈ జోకులను పంపించిన వారు: మడగల గోవిందరావు, అనకాపల్లి.**

బట్టలవ్యాపారి కొడుకుతో : ఆ పాత కాలం డిజైన్ చీరె ఎలా అమ్మావురా? నేను ఎంత ప్రయత్నించినా అమ్మలేక పోయాను.
కొడుకు : 'ఇది మాత్రం అడక్కండి. కాంతమ్మగారు రిజర్వు చేసుకున్నారు' అని శాంతమ్మగారితో అన్నానంతే వంద రూపాయలెక్కువిచ్చి మరీ కొనేసింది.






"మీ ఆవిడ నాకు పంపిన మైసూర్‌పాక్ తిన్నానోయ్! చాలా బాగుంది. థ్యాంక్స్ చెప్పు"
"ఏవిటి సార్ మీకు మా ఆవిడ పంపిందా? మీరు తిన్నారం కూడానా?"
"ఏం? అలా అడుగుతున్నావ్?"
"అవి నాకు నచ్చక నిన్న చేసినప్పుడు, దీన్ని కుక్కలు కూడా ముట్టుకోవే అన్నాన్సార్".



భోజనంచేసి ఆఫీసుకి బయల్దేరుతున్న భర్తతో వంట ఇంట్లోంచి కంగారుగా వచ్చి అడిగింది భార్య. "ఏవండి! పెద్దబాలశిక్ష పుస్తకం ఎక్కడుంది? బల్లిశాస్త్రం చూడాలి అర్జంటుగా".
"ఎక్కడ పడిందేవిటి బల్లి? నెత్తిమీదనా, చేతిమీదనా, కాలిమీదనా, కుడా, ఎడమా? చెప్పు. నాకు తెల్సు బల్లి శాస్త్రం. ఇట్టే చెప్పేస్తా.." అన్నాడు భర్త కుతూహలంగా.
"మీరు తిన్న అన్నం గిన్నెలో పడుందండీ" అంటూ కంగారుగా చెప్పింది భార్య. అప్పుడే దొరికిన పెద్దబాలశిక్షలో బల్లిశాస్త్రం కోసం పేజీలు తిప్పుతూ...



ఇద్దరుపాత స్నేహితురాళ్ళు పెళ్ళయిన తర్వాత చాలా రోజులకి కలుసు కున్నారు. పిచ్చాపాటి మాట్లాడుకున్నాక ఒకామె రెండో ఆమెని అడిగింది -
"మీ వారి గురించి చెప్పవే. సరదా మనిషేనా?"
"మంచి వారే! కాకపోతే కొంచెం మోటు".
'మరి! మీవారో'
"రిమోటు"
'అదేంటి?'
"ఆయన ఉంటోంది అమెరికాలో ..... చాలాదూరం కదా. "



**ఈ జోకులను పంపించిన వారు: రమణశాస్త్రి, సంగారెడ్డి.**



సేల్స్‌మేనేజర్ : మా కంపెనీలో సేల్స్‌మెన్ ఉద్యోగం కావాలని అంటున్నావు గదా! నీకు అనుభవం ఉందా..?
ప్రభాకరం : ఉందిసార్! పక్కింట్లో టి.వి.ని అమ్మేశాను. మా ఆవిడ నగలు అమ్మేశాను. దొరికిన ప్రతి సెల్‌ఫోను అమ్మేశాను. ఉద్యోగం ఇస్తారా సార్!

"నా పుట్టినరోజు ఫిబ్రవరి 29న. నాలుగేళ్ళకొకసారి తప్పితే ఫ్రెండ్స్‌కి పార్టీ ఇచ్చే పనే లేదు"
"నాకసలు ఏ సంవత్సరం ఏ నమస్యాలేదు. ఎంత బ్రతిమాలినా ఎవ్వరూ రారు నా పుట్టినరోజు పార్టీకి"
"ఆశ్చర్యంగా ఉందే.... ఎప్పుడు పుట్టావ్!? "
"ఏప్రిల్ 1న".



**ఈ జోకులను పంపించిన వారు: పి.ఎ. ప్రభాకర్ దత్తు, విశాఖపట్నం.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన సి.హెచ్ సురేష్‌కుమార్ - విజయనగరం, మడగల గోవిందరావు-అనకాపల్లి, రమణశాస్త్రి-రంగారెడ్డి, పి.ఎ. ప్రభాకర్‌దత్తు-విశాఖపట్నం గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'సామ్రాట్' ఆడియో సి.డి. బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.






50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

**18**

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు





'పండంటి కాపురం' చాలా గొప్ప చిత్రం. చక్కగా తీశారు. నలుగురు సోదరుల మధ్య ఉన్నటువంటి అభిమానాలు, అనురాగాలు.. ఆ రోజుల్లో కంబైన్డ్ ఫ్యామిలీల్లో ఎంత హ్యేపీగా ఉండేవాళ్లు, ఇంటి యజమానురాలిగా వదినగారికి ఎంత గౌరవం ఇచ్చేవాళ్లు, ఇలా ఓ మంచి సెంటిమెంటల్ సబ్జెక్ట్ తీసుకున్నారు. నాకైతే ప్రభాకర్‌రెడ్డిగారు నిర్మాతని ముందు తెలుసు. తర్వాత కృష్ణగారు కూడా అందులో పార్టనర్ అని తెలిసింది. ఆ రోజుల్లో చాలా గొప్పగా ఆడిందా చిత్రం. అన్ని చోట్లా 25 వారాలు. నా గురించి నేను గొప్ప చెప్పుకోవడం కాదు.... ఆ పిక్చర్‌కి నా క్యారెక్టర్ చాలా లైఫ్‌నిచ్చింది. ఆ క్యారెక్టర్ తీసేసి ఆ పిక్చర్ చూడాలంటే చాలా కష్టం.

అప్పటికి మా అబ్బాయికి రెండో ఏడు నిండి మూడో ఏడు వచ్చింది. కలెక్టర్ జానకి, పండంటికాపురం.. ఇవన్నీ ఒక బంచ్. ఆ టైమ్‌లో ప్రభాకరరెడ్డిగారు మా ఇంటికి వచ్చి ఈ 'పండంటి కాపురం' స్టోరీ చెప్పారు. ఆయన చాలా ఫ్రాంక్‌గానే మాట్లాడతారు. కథ చెప్పిన







మనసా కవ్వించకే నన్నిలా
ఎదురీదలేక కుమిలేను నేను
సుడిగాలిలో చిక్కిన నావను
ఆనాడు వెన్నెల నేనై
కరిగాను కౌగిలిలోన
ఈనాడు చీకటిలాగ మిగిలాను చీకటిలోన
నేనోడిపోయి గెలుపొందినాను
గెలిచానని నవ్వనా ఏడ్వనా ॥మనసా॥
ఎగిరింది కడలి కెరటం ఆ నింగి స్నేహం కోసం ॥2॥
ఏనాటికైనా అవి చేరువౌనా
కెరటానికి నింగికి స్నేహమా ॥మనసా॥
మోముపై ముంగురులేమో వసివాడి మల్లియలాయె
గుండెలోన కోరికలన్నీ కన్నీటి చారికలాయె
ఏ తీగకైనా కావాలి తోడు
నా జీవితం శాపమా పాపమా ॥మనసా॥

చిత్రం
పండంటి కాపురం
రచన
గోపి
గానం
పి. సుశీల
సంగీతం
ఎస్.పి.కోదండపాణి



తరువాత 'ఏవండీ ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మెన్ యాక్ట్ చేసిన 'ది విజిట్' అనే పిక్చర్ చూశాను. అదంతా ఇందులో కలిపారా' అని అన్నా. 'అవునండీ.. ఆ సినిమాలో చాలా సీన్స్ దీనిలో కలిపేశాం' అని ఆయన అన్నారు.

ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మెన్ హాలీవుడ్‌లో చాలా ఫేమస్ నటీమణి. ఆవిడ యాక్ట్ చేసిందీ 'ది విజిట్'. ఆ సినిమా గంటన్నర, రెండుగంటలుంటే... ఈ పండంటికాపురం సినిమాలో దాన్నే ఎపిసోడ్ లాగా వాడుకున్నారు. తరువాత ఆ పాత్ర వాంపిష్ స్టయిల్‌లో రివెంజ్ తీసుకుంటుంది. అక్కడక్కడ డైలాగులు వినిపించారు.. తరువాత ప్రభాకరరెడ్డిగారే నాకు చెప్పారు.. "మేం భానుమతి గారి దగ్గరకు వెళ్లామండి. ఆ యారోగెన్స్ అదీ ఆవిడ ఫేస్‌లో కనిపిస్తుంది కదా.. అని అప్రోచ్ అయితే 'అమ్మో ఇది వాంప్ క్యారెక్టర్.. నా ఇష్టప్రకారం మీరు మారిస్తే చేస్తా'నని ఆవిడ అన్నారు, మాకు మార్చటం ఇష్టం లేదు. ఇంకెవరబ్బా అనుకుంటే మీరు మా దృష్టిలోకొచ్చారు. మీరయితే బాగుంటుందనిపించింది. మీకభ్యంతరం లేదు కదా" అన్నారు. అంటే .. "వెరైటీ క్యారెక్టర్స్ చేయటం నాకెప్పుడూ ఇష్టమే. కాకపోతే బిగినింగ్ నుంచీ చివరివరకూ వాంపిష్‌గా మీరు తీసుకొచ్చారు. అలా కాకుండా ఎక్కడన్నా సరే, చివరికి అయినా ఈ అమ్మాయి చేసిందానికో కారణం ఉంది అని నా పెర్ఫార్మెన్స్ ద్వారా, మీ క్రియేషన్ ద్వారా ప్రేక్షకుల్ని ఒక్కసారి ఏడిపించేస్తే నేను ఈ సినిమా చేస్తాను" అన్నాను. "అదేనండీ... ఫ్లాష్‌బ్యాక్ స్టోరీలో ఎందుకు ఈవిడ ఇంత పగ పూనిందనేది చూపిస్తున్నాం. కాబట్టి మీకు ఆ డౌట్ ఏమీ అక్కర్లేదు'' అంటే ఒప్పుకున్నాను.

నా సినిమా చరిత్రలో చాలా కష్టపడి, తెగ ఆలోచించి... అంటే బుర్రకు పదునుపెట్టి కష్టపడి చేసిన పాత్రలు కొన్ని ఉన్నాయి. అట్లా వచ్చిన వాటిలో పండంటి కాపురం, శ్రీకృష్ణతులాభారం, మూగమనసులు, మోహినీ రుక్మాంగద ని చెప్పుకోవాలి. కలెక్టర్ జానకిలో క్యారెక్టర్‌కు బ్రెయిన్ అంత ఉపయోగించనవసరం లేదు. ఎందుకంటే ఎక్కువ దుఃఖ రసం ఉన్న క్యారెక్టర్. కాన్‌ఫ్లిక్ట్ క్యారెక్టర్ అది. అదీ మంచి పెర్ఫార్మెన్స్ ఉన్న పాత్రే కానీ, మరీ బుర్రకు పదునుపెట్టి చేయతగినంత పాత్ర కాదని నా అభిప్రాయం. ఇలాంటి పాత్రలు కొన్ని ఉంటాయి. రాణీ మాలినీదేవికి , కలెక్టర్ జానకికి ఉన్న కంపారిటివ్ డిఫరెన్స్ ఏంటంటే జానకి పాత్ర ప్లెయిన్ క్యారెక్టర్. రాణీ మాలినీదేవికి తెచ్చి పెట్టుకున్నటువంటి అహంకారం, పగ.. ఇన్నర్‌గా గుండెలు మండిపోయేటటువంటి ఆవేదన. కలెక్టర్‌జానకి కూడా ఇలాగే ఉంటుంది. కానీ కంప్లీట్‌గా సాఫ్ట్. పెర్ఫార్మెన్స్‌కొచ్చే సరికి రెండు పాత్రల స్వభావం ఒక్కటే. కలెక్టర్ జానకి పాత్రకు గుండెలో ఆవేదన ఉంటే ఈ పాత్రకు గుండెలో పగ.

దీని కాన్‌ఫ్లిక్ట్ ఏంటంటే మోసం చేసాడన్న పగతో కూడినటువంటి ఆవేదన, కక్ష, ప్రతీకారం... ఇన్ని మిళితమైనటువంటిది... కంపేర్డ్ టు కలెక్టర్ జానకి ఇది చాలా కష్టం.

ఎందుకింత ఉపోద్ఘాతం చెబ్తున్నానంటే.. నడక దగ్గరనుంచీ, నించోవటం దగ్గర్నుంచీ, ఆ రాణి ఎలా ఉంటుంది, మెజెస్టిక్‌గా ఎలా ఉండాలి. చేయి వంకరగా ఎలా పెట్టాలి. సత్యభామకు చేయి ఎలా పెట్టాలని ఆలోచించానో అలాగే ఈ క్యారెక్టర్‌కి కూడా...

ఇంట్రడక్షన్‌లో మెట్లు దిగి వచ్చేటప్పుడు ఒరిజినల్ ఇంగ్లీషు ఫిల్మ్‌లో చిరుతపులిని పెట్టారు. రాణి అక్కడ గొలుసుతో చిరుతపులిని తీసుకువస్తుంది. మనవాళ్లు కూడా ట్రై చేశారు. చిరుతపులినో, పెద్దపులినో పట్టుకుని వద్దామని. 'ఏవండీ పులిని పట్టుకుంటారా' అంటే 'నేనే ఓ పెద్దపులిని, పట్టుకుంటాన్లెండి' అని సరదాగా అన్నాను. అప్పుడు దేవర్ అని... ఆయన దగ్గర చాలా జంతువులు ఉండేవి. సినిమాలకు సప్లయ్ చేసేవాడు. కానీ అప్పటికి వేరే పిక్చర్ దేనికో అవి వెళ్లిపోయినట్టు ఉన్నాయి దొరకలేదు. చివరకు అల్సేషియన్ కుక్కను పట్టుకుని దిగుతాను. గ్లౌవ్స్ వేసుకోడం, గాగుల్స్ , గెటప్, జరీ అంచు ఉన్న చీరలు ప్రత్యేకంగా సెలెక్ట్ చేశారు. ఎకార్డింగ్ టు సీన్ ఆర్ట్ డైరెక్టర్ ఈ చీరలు సెలెక్ట్ చేశారు. 'మీరు కూడా చూసుకోండి' అని నాకు కూడా పంపించేవారు. మ్యాచింగ్ నగలు కూడా.. ఇక మెదడుకు పదును ఎక్కడ అనేదానికి ఒక సంఘటన చెప్తాను.

ఓ సీన్‌లో దేవిక వస్తుంది. వచ్చి నా భర్తపై ఎందుకు ఇలా పగ తీర్చుకుంటున్నావు అని అడిగినప్పుడు రాణి అద్దం దగ్గరకు వెళ్లి దాంట్లోంచి చూస్తూ 'నేను నీకంటే చాలా అందంగా ఉంటాను కదూ' అని చాలా పొగరుగా మాట్లాడుతుంది. అది దేవికకు ఏమీ అర్థం కాదు. కారణం తరువాత చెప్పేస్తుంది. నన్ను మోసం చేసింది నీ భర్త అని ఫ్లాష్‌బ్యాక్ మొత్తం చెబ్తుంది. నన్ను మోసం చేసిన వాడిమీద పగ తీర్చుకోవాలా వద్దా అని అడుగుతుంది. అక్కడ సోఫా దగ్గర చేయి పెట్టుకుని ఉంటాను. ఆ ఫ్లాష్‌బ్యాక్ అయి కట్ అవుతూనే దేవిక క్లోజప్ వేస్తారు. అప్పుడు దేవిక ... 'నాకు చాలా బాధగా ఉంది. మీ కథ విన్న తరువాత. చాలా సానుభూతి కలుగుతోంది' అంటుంది. అప్పుడు రాణీమాలినీదేవి కంటినుండి కన్నీటి ధారలు ఉంటాయి. అది మామూలు హీరోయిన్ క్యారెక్టర్ అయితే నాలుగు వేళ్లు పెట్టుకుని తుడుచుకుంటుంది. మరి ఇక్కడ క్యారెక్టర్ రాణి కదా... అందుకని చూపుడు వేలుతో ఆ కన్నీటిని తుడుచుకుంటూ గోటితో కొడుతుంది - నీ సానుభూతి నాకక్కర్లేదు అన్నట్టు! మరి అంతలా చేయాలంటే ఆర్టిస్టుకు క్యారెక్టర్ మీద శ్రద్ధ, ఆలోచన... ఎంత అవసరం? మామూలుగా చేయిపెట్టో, కొంగుపెట్టో తుడుచు కోవచ్చు. కానీ ఇక్కడ రాణి. కన్నీళ్లు తుడుచుకోవడంలో కూడా ఒక స్టయిల్. గాలిలోకి ఆ కన్నీటిని గోటితో కొట్టడం... నిజంగా నా పెర్ఫార్మెన్స్ నాకే నచ్చింది. అంత మైన్యూట్ థింగ్స్ కూడా నేను డీప్‌గా ఆలోచించాను.

ఇంత బాగా డీప్‌గా ఆ క్యారెక్టర్ గురించి ఆలోచిస్తున్నప్పుడు జరిగిన ఇంకో సంఘటన ఏమిటంటే... డైరెక్టర్ లక్ష్మీదీపక్ నాకు ఫుల్ కోపరేషన్. రెండు మూడు రకాలుగా నేను యాక్ట్ చేసి చూపిస్తే తనకు బాగా నచ్చిన బిట్ తీసుకునేవాడు. ఒక సీన్ విషయంలో నాకూ, ప్రభాకర్ రెడ్డి గారికి కొంచెం హాట్ హాట్ డిస్కషన్స్ జరిగాయి. ఆ సీన్ ఏంటంటే నేను బిలియర్డ్స్ ఆడుతుంటాను. సరోజాదేవి అక్కడకు వస్తుంది. వచ్చినప్పుడు ఆ అమ్మాయి మనసుని పాయిజన్ చేయాలి - నువ్వు ఆ ఇంట్లో నుండి బయటకు వచ్చేసి వేరే కాపురం పెట్టుకో అని! అంత వరకూ రాసిన డైలాగ్సుకి, ఆ సీన్‌లో డైలాగ్స్‌కి తేడా నాకు కొట్టొచ్చినట్టు కనిపించింది. మేకప్ అయిన తరువాత ఆ సీన్ మొత్తం ప్రభాకరరెడ్డి గారు రూంలో కొచ్చి చదివి వినిపించారు. గయ్యాళి సూర్యకాంతమ్మ డైలాగులు చెబుతుందే.. ఆ ట్రెండ్ వచ్చేసింది. రాణీ మాలినీదేవి క్యారెక్టర్ పోయిందక్కడ. నేను ఆ పాత్రను బాగా స్టడీ చేసిన దాన్ని కనుక ఆయన ఏమన్నా అనుకోనీ అని వెంటనే నిర్మొహమాటంగా "ప్రభాకరరెడ్డిగారూ ఐ యామ్ సారీ... ఏమీ అనుకోవద్దు. నేను ఈ సీన్‌లో కన్విన్స్ అవ్వటంలేదు. ఇంతవరకూ ఈ పాత్రను డిగ్నిఫైడ్‌గా, డిప్లమాటిక్‌గా... రాణి హోదాలో ఎంతో హుందాగా తీసుకొచ్చారు. ఈ సీన్‌లో డైలాగులు ఎలా వచ్చాయంటే... సూర్యకాంతమ్మ గయ్యాళితనం కనబడుతోంది. నాకైతే సూట్ అవటం లేదు. ఇప్పటికిప్పుడు చెట్టుక్రింద రాయించారేమో' అని జోక్‌గా నవ్వేసాను. అనేటప్పటికి ఆయన 'ఏంటండీ మేం తెగ ఆలోచించి రాస్తే ఇలా అంటున్నారు' అన్నారు.

'ఏవండీ తెగ ఆలోచించేట్లయితే నేను ఇలా ఎందుకంటాను? నేను కూడా మీ పాత్ర గురించి తెగ ఆలోచిస్తున్నాను.

**రచన: దాశరథి    గానం: ఘంటసాల    సంగీతం: ఎస్.పి.కోదండపాణి**

బాబూ వినరా అన్నా తమ్ముల కథ ఒకటి
కలతలు లేని నలుగురు కలిసి సాగించారు పండంటికాపురం ॥బాబూ॥
కన్నకలలు అన్ని కూడా కల్లలాయెనే
అన్నదమ్ములొకటనుట ఆడియాస ఆయెనే ॥కన్న॥
గూటిలోని ఆ గువ్వలు ఎగిరిపోయెనే ॥2॥
స్వర్గమంటి యిల్లంతా నరకంగా మారెనే
బాబూ... బాబూ... ॥బాబూ॥
ఆ కలిమి ఆ బలిమి కథగా మారె కలతే మిగిలె ఈనాడు ॥2॥
ఏనాటికి ఏమౌనో ఎవరికి తెలుసూ... ॥2॥
విధి రాసిన రాతకు తిరుగే లేదు
బాబూ... బాబూ... ॥బాబూ॥



తెగ ఆలోచించబట్టే, నాకు ఈ డిఫరెన్స్ తెలిసింది కాబట్టే నేను నిర్మొహమాటంగా చెబుతున్నాను. ఈ సీన్ నా ఎదురుగా డైరెక్టర్‌గారికి వినిపించండి. ఆయన కన్విన్స్ అయితే నేను చేస్తాను. కానీ మీకు జంప్ కొట్టొచ్చినట్టు తెలుస్తుంది. పాత రాణి క్యారెక్టర్‌కు, ఈ డైలాగులకు చాలా తేడా వస్తుంది. డిఫ్నమనీ ప్లే చేయాలి, డైరెక్ట్‌గా నువ్వెందుకక్కడ ఉంటున్నావ్, వెళ్లి పోవచ్చుకదా అని చెప్పకూడదు. అదే కదా ఆ క్యారెక్టర్‌లో ఉన్న డిగ్నిటీ, ఔచిత్యం. నా అభిప్రాయం ఇది. మీరు ఒకసారి ఆలోచించండి. అయినా చేయండి అంటే... మీరు డబ్బులిస్తున్నారు, కనుక చేస్తాం. తరువాత రీ షూట్ అంటే మాత్రం నా దగ్గర కాల్షీట్లు లేవు' అని చెప్పాను.

నా ఆర్గ్యుమెంట్‌తో ఆయన కన్విన్స్ అయ్యారు. ఆ రోజుల్లో గొప్పతనం అదే! ప్రొడ్యూసర్లుకానీ, డైరెక్టర్లుకానీ, ఆర్టిస్టులు కానీ ... ఏదన్నా ధైర్యంగా చెబితే దాని గురించి వాళ్లు ఆలోచించేవారు. అందువల్లే ఆ రోజుల్లో చిత్రాలు అంత బాగున్నాయి. ఆర్టిస్ట్, నిర్మాత, దర్శకుడు, రైటర్... వీళ్లందరి మధ్య మ్యూచ్‌వల్ అండర్‌స్టాండింగ్ ఉండేది. ఓ ఫ్యామిలీ లాగా కో ఆర్డినేషన్ ఉండేది. ఒకరికొకరు మను విప్పి బాగుంటే బాగుందని, లేకపోతే లేదని చెప్పటం... ఇంత నిర్మొహమాటంగా ఉండేవారు.

'సరే మేడం మేం చూస్తాం, మీరు రెడీ కండి' అని చెప్పి ఆయన వెళ్లిపోయారు. నేను సెట్‌కు వెళ్లేటప్పటికీ మొత్తం సీన్ అంతా మార్చేశారు. లక్ష్మీదీపక్ కూడా ఆ సీన్ యాక్సెప్ట్ చేసినట్టు లేదు అందుకనే మార్చారు. అప్పటికప్పుడు రాశారు మద్దిపట్ల సూరి. వండర్‌ఫుల్ సీన్ అది. "ఇప్పుడు రాణీ మాలినీదేవి క్యారెక్టర్ వచ్చిందండీ" అన్నాను. ఇదొక సంఘటన.

సంగీతం దగ్గరకు వచ్చేసరికి నాకు పర్సనల్‌గా.... పర్సనల్‌గా ఏంటండీ ఈనాటికీ ఆంధ్రదేశమంతా మారు మ్రోగిపోయే పాట - 'మనసా కవ్వించకే...'! సుశీలగారు చాలా అద్భుతంగా పాడారు. అందులో సాహిత్యం, మ్యూజిక్కు, పిక్చరైజేషన్ వండర్‌ఫుల్. జీవమున్న పాట కాబట్టే ఇప్పటికీ సజీవంగా ఉంది. గోపి గారు రాశారా పాటని. 'ఆనాడు వెన్నెల నేనై కరిగాను కౌగిలిలోన, ఈనాడు చీకటిలాగ మిగిలాను చీకటిలోన నేనోడి పోయి గెలుపొందినాను, గెలిచానని నవ్వనా, ఏడ్వనా' అని బ్యూటిఫుల్ సాహిత్యం. అందులో నా యాక్టింగ్ కూడా ఒక దుఃఖంతో కూడుకున్న నవ్వు - వేదాంత పరంగా - గెలిచానా, ఏడ్వనా అని! నేను కనుక రికార్డింగ్‌లో ఉండుంటే వాయిస్‌లో కూడా సుశీలగారికి చెప్పి ఇంకా మంచి ఎఫెక్ట్ తీసుకువచ్చేదాన్ని.

పూర్వం రికార్డింగ్ ఉందంటే మమ్మల్ని పిలిచేవాళ్లు. ఇప్పుడు ఎలాగూ లేదు. ఆ సిస్టమ్ అప్పటికే పోయింది. మేం బిజీ అయిపోయాం. నిర్మాతలు కూడా ఆర్టిస్ట్‌లను పిలవటం మానేశారు. నన్ను పిలిస్తే... ఎక్స్‌ప్రెషన్ చెప్పి పాడించేదాన్ని. గెలిచానని నవ్వనా ఏడ్వనా.. దగ్గర నవ్వు కూడా వాయిస్‌లో మిక్స్ అయి వుంటే ఇంకా బ్యూటిఫుల్‌గా ఉండేది. మొత్తానికి చాలా చక్కటి పాట.

ఇది మూడు చరణాలు. పిక్చరైజేషన్ కూడా అయింది. 'ఎగిరింది కడలి కెరటం ఆ నింగి స్నేహం కోసం'. అనే చరణంకి సముద్రపు ఒడ్డున మంచి లైటింగ్ వేసి కెరటాలు తళతళ మెరుస్తూ ఉంటే చాలా బాగా తీశారు. తీరా ఫైనల్ ఎడిటింగ్‌కు వచ్చేసరికి ఇంకేమీ కత్తిరించకుండా ఆ చరణమే కట్ చేశారు. నాకు ఉండేదే ఒకే పాట అందులో. అదేం రొమాంటిక్ క్యారెక్టర్ కాదు. లెంగ్త్ ఎక్కువ అయిపోయిందని కట్ చేయించారు దగ్గర కూర్చుని.

ఇందులో నాకు నచ్చిన మరో సాంగ్ 'బాబూ వినరా.. అన్న దమ్ముల కథ ఒకటి..'. సాడ్ వెర్షన్ బాగా ఇష్టం. ఎస్వీరంగారావు గారి పెర్ఫార్మెన్స్ చాలా అద్భుతం ఈ సినిమాలో.

తమాషా ఏంటంటే రంగారావు గారికి బాగా డ్రింక్ చేయటం అలవాటు. ఒక్కోసారి

## నే నూ నా పా ట లు



గాయకుడు యస్పీ బాలసుబ్రహ్మణ్యం చిత్ర పరిశ్రమలో కాలు పెట్టిన కొత్తలో ఒకవైపు పాడుతూ, మరో వైపు స్వర్గీయ కోదండపాణి చేసే వరసలకు మ్యూజిక్ అసిస్టెంట్‌గా వ్యవహరించేవారు. 'పండంటి కాపురం' చిత్రానికై 'మనసా కవ్వించకే నన్నిలా' పాటని మూడు చరణాలు ఒకలా స్వరపరిచారు కోదండపాణి.

"గురువుగారూ! మూడూ ఒక్కలాగే ఉన్నాయండీ, మధ్య చరణం కాస్త మారిస్తే బాగుంటుందేమో, సాహిత్యం కూడా 'ఎగిరింది కడలి కెరటం' అని ఉంది. 'ఎగిరింది' దగ్గర కాస్త ఎత్తుకుని 'కెరటం' దగ్గర దించుతూ ట్యూన్‌లో ఒక తరంగం ఎఫెక్ట్‌ని చూపిస్తే !?" అన్నారు బాలు.

కోదండపాణి ఓ నిముషం పాటు బాలూని ఎగాదిగా చూసి "పంతులూ (బాలూని 'పంతులూ' అని పిలిచేవారాయన)! నువ్వు కూడా అప్పుడప్పుడు బుర్ర ఉపయోగిస్తావే!" అంటూ సరదాగా నిందాస్తుతి చేసి ఆ ప్రకారమే మార్చేశారు. తర్వాత ఆ బిట్‌కే ఎందరో అభిమానులు ఎక్కువ మార్కులు వేయటం, కోదండపాణిగారు బాలూ పట్ల తనకున్న నమ్మకాన్ని మరింతగా పెంచుకోవటం జరిగింది. విచిత్రం ఏమిటంటే ఈ రెండో చరణమే సినిమాలో కట్ అయింది. కానీ ఆ రోజుల్లో రిలీజైన రికార్డుల్లో ఉంది. అయితే ఆ రికార్డులలో మూడో చరణం ఉండదు. తర్వాత రిలీజైన ఆడియో క్యాసెట్లలో రెండో చరణం ఉంటే మూడో చరణం ఉండదు. మూడో చరణం ఉంటే రెండో చరణం ఉండదు. మొత్తం మూడు చరణాలూ ఉన్నవారు మంచి సేకరణ గలవారి కింద లెక్క.

మత్తులోనే సమాధిలో కూర్చున్నట్టు కూర్చునేవారట. వారం రోజులు, పది రోజులు అయినా అలానే ఉండేవారట. ఈలోగా కాల్షీట్లన్నీ పోయేవి. ఇక్కడ ఏమైందంటే... ఆయన్ని తీసుకొచ్చారు. నాతోనే సీన్. లాస్ట్‌లో ఆయన నన్ను కోప్పడతాడు. "నీ కూతురు ఎక్కడికీ పోలేదు. నేనే పెంచాను. నీ కోసం ఎంతో వెతికాను" అని అంటారు. సగం మత్తులో ఉన్నారాయన. కానీ అక్కడ సిట్యుయేషన్‌కి నేను ఎదురుతిరిగి బాధతో మాట్లాడినప్పుడు ఆయన రియాక్షన్ షాట్స్ ఇచ్చారు. అక్కడ ఆయన కళ్లు ఓ పక్క ఏడుస్తూనే కళ్లు ఇలా ఇలా అంటూ రెండు మూడు ఎక్స్‌ప్రెషన్స్ ఇచ్చారు. మత్తులో ఇచ్చినవే అయినా భలే అందంగా మ్యాచ్ అయిపోయి చాలా అద్భుతంగా వచ్చాయి. గ్రేట్ ఆర్టిస్ట్. ఎప్పుడూ నేను పర్సనల్‌గా ఆయన్ని డాడీ డాడీ అని పిలిచేదాన్ని.

పక్క ఆర్టిస్ట్ తాగివచ్చినప్పుడు నేను ఫీల్ అవటం గురించి చెప్పాలంటే హరనాథ్ విషయంలో నేను చాలా స్ట్రిక్ట్‌గా ఉండేదాన్ని. డాడీ(ఎస్వీఆర్)కి ఏంటంటే ఆయన పెద్దవాడు. పైగా అది అలవాటు అయిపోయింది. 99 శాతం ఆయన మానేసినప్పుడే వీరు షూటింగ్ చేస్తుండేవారు. ఆయన రూమ్‌లోకి వెళితే ప్రొడ్యూసర్ పని గోవిందా కదా. వెళ్లి బతిమాలి, నిషా అంతా దింపి తీసుకువచ్చేవారు. ఇబ్బంది ఏమీ ఉండేది కాదు. వాసన అదీ ఏమీ వచ్చేది కాదు. మరి ఆయన చాలా కాస్ట్‌లీది తాగేవారేమో తెలీదు.

బట్ హరనాథ్‌తో మాత్రం చాలా స్ట్రిక్ట్‌గా ఉండేదాన్ని. అతను తాగొస్తే రెండు మూడు సార్లు షూటింగ్ కూడా క్యాన్సిల్ చేసుకుని వెళ్లిపోయాను. ఎందుకంటే హీరో హీరోయిన్లంటే క్లోజ్‌గా యాక్ట్ చేయాలి. ఆయన అలా ఉంటే ఎలా చేస్తాం? ఒకసారి మేకప్ తీసేసి మధ్యలో వెళ్లిపోయాను. ఆ తరువాత రెండు మూడు సినిమాలు వస్తే... నేను చేయను అని వదిలేశాను. 'ఆడజన్మ' సినిమా అనుకుంటా.. హరనాథ్ గారు, మొదలైన వాళ్లు వచ్చి బ్రతిమాలారు. చివరకు 'మీరు ఉన్నంత వరకూ నేను తాగను మేడం' అని హరనాథ్ ప్రామిస్ చేశాడు. 'అంటే నేను వెళ్లిపోయిన తరువాత తాగుతావా' అన్నాను ... పాపం తాగితాగి ఆయన పోయారు.

ఈ సినిమాలో ఎస్వీఆర్ నటన చూస్తే నాకు 'బంగారు పాప' గుర్తుకొచ్చింది. 'తాధిమి తకధిమి తోలుబొమ్మ...' పాటలో వేదాంత పరమైన ఎక్స్‌ప్రెషన్ ఇస్తారే అలా ఇచ్చారిందులో. అక్కడే కనిపిస్తుంది వారి గ్రేట్‌నెస్. గ్రేట్ ఆర్టిస్ట్‌ల గొప్పతనం ఏంటంటే వేషం చిన్నదైనా పెద్దదైనా ఒన్ ఆర్ టూ ఎక్స్‌ప్రెషన్స్‌లో కొట్టేస్తారు మార్కులు. అలా ఆయన గురించి చాలా గొప్పగా చెప్పుకోవాలి ఆ సినిమాలో.

ఇంకొక సంఘటన ఏంటంటే...

ఆ సంఘటన గురించి, శ్రీమతి జమునకు నచ్చిన మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో...

డిసెంబరు 8 ఎల్లారీశ్వరి పుట్టినరోజుని పురస్కరించుకుని....

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 17



- ఇంద్రగంటి జానకీబాల

"మొదట్లో కోరస్‌లే పాడాను. చాలామంది కోరస్ పాడటం చాలా తక్కువగా భావిస్తారు. అది తప్పని నేననుకుంటాను. అందుకే కోరస్‌లు పాడానని నేను గర్వంగా చెప్పుకుంటాను. ఎందరితోనో కలిసిపాడటం వల్ల, పెద్ద గాయనులకు కోరస్ పాడటం వల్ల, వారందరూ పాడే విధానాన్ని పరిశీలించే అవకాశం వస్తుంది. ఆ గాయనుల దగ్గర నుండి ఎన్నో విషయాలు నేర్చుకోవడానికి అవకాశం వుంటుంది. అందుకే నేను కోరస్‌లు పాడటం ఎప్పుడూ మర్చిపోను".

"మేమిక్కడికి వచ్చినప్పుడు, నేను కోరస్‌లు పాడటం వల్లనే మా కుటుంబానికి గడిచింది. అదే నాకు నిలబడటానికి బలాన్నిచ్చింది"

ఇవి ఎల్.ఆర్. ఈశ్వరి ఆవేశంగా చెప్పే మాటలు.

సినీ పరిశ్రమ ఎప్పుడూ కొత్తదనాన్ని కోరుతుంది. పాట విషయంలోనూ, గాయనుల విషయంలోనూ, సంగీత దర్శకుల విషయంలోనూ, దేనిలోనైనా, నిరంతరం కొత్తదనం కోసం అన్వేషిస్తూ వుండటం ఆ పరిశ్రమ లక్షణం.

అప్పటికి ఎంతో ప్రముఖస్థానంలో వున్న గాయనుల గొంతుల నుండి వేరుగా వినిపిస్తూ, మంచి చమత్కారంగా వున్న ఎల్.ఆర్.ఈశ్వరి కంఠాన్ని గుర్తించి మొట్టమొదట విడి పాట(సోలో) పాడించినవారు ఎమ్.బి.శ్రీనివాస్. ఆ పాట ఎంతో పాప్యులర్ అయింది. అదే సి.నారాయణరెడ్డి రాసిన 'నా పేరు సెలయేరు - నన్నెవ్వరాపలేరు'.

నిజంగానే ఆ పాట తర్వాత ఎల్.ఆర్.ఈశ్వరిని ఎవ్వరూ ఆపలేదు. ఆమె కంఠానికి ఒక విలక్షణమైన శైలి వుంది. ఎక్కడో ఒకచోట జమునారాణి పోలిక వుందే అనిపించినా, అంతకంటే బలమైన, విసురైన కంఠం. శ్రుతికూడా కొంచెం హెచ్చు. ఉషారు పాటలు, కొంటె పాటలు, మధువొలకబోసే మత్తుపాటలూ ఈశ్వరి



సొత్తయినాయి. ఆమె పలికించే నిషా, కురిపించే మత్తూ అందర్నీ ఎంతగానో ఆకట్టున్నాయి. ఆమె పాడిన ప్రతిపాటా ప్రజాదరణ పొందుతూ వచ్చింది.

విజయలలిత, జ్యోతిలక్ష్మి, జయమాలిని లాంటి హుషారు తారలకు ఆమె గొంతు చక్కగా అమరింది.

తమిళనాడులో రామనాధ్ జిల్లాలో పరమకుడి అనే వూర్లో ఆమె బాల్యం గడిచింది. చిన్నప్పటినుంచీ సంగీతమే ప్రాణం. తల్లి నిర్మల, తండ్రి దేవరాజ్ ఇద్దరూ ఆమె పాటపట్ల మక్కువ కనబరిచినా, తను ఒక గాయనిగా తయారుకావడానికి, ప్లేబ్యాక్ పాడేందుకు, సినిమా పాటలయందు ఉత్సాహం చూపించ డానికి వారి అమ్మ నిర్మల గారే కారణమంటారు ఈశ్వరి. ఆమె యిచ్చిన ప్రోత్సాహమే తనకి ఎంతో దోహద మైందంటారావిడ. మాతృభాష తమిళమైనా తెలుగును సొంత భాష చేసుకుని ఆమె ఎన్నో పాటలు పాడారు. తెలుగు పాటలోని విరుపు, అవసరమైన చోట యాస, తెలుగు నుడికారం యిట్టే పట్టుకుని పాడారు.

తెలుగు, మలయాళం దగ్గరగా వుంటాయనీ, కానీ తమిళం తన భాషైనా కేవలం శ్రద్ధతో, ఆసక్తితో తెలుగు తెలుసుకుని, అర్థం చేసుకుని పాడాననీ అంటారు.

**'మాయదారి చిన్నోడు - మనసే లాగేసిండూ- నా .. మనసే లాగేసిండూ**

**మాఘమాసం వచ్చేదాకా - మంచిరోజు లేదన్నాడే..**

**ఆగేదెట్టాగా - అందాకా ఏగేదెట్టాగా'**

అంటూ ఆమె ఆంధ్రదేశాన్ని ఊపేశారు. ఈ పాట 'అమ్మమాట' అనే సినిమాలో సి.నారాయణరెడ్డి రాయగా, రమేష్‌నాయుడు సంగీతం కూర్చిన పాట.

'దేవుడు చేసిన మనుషులు' అనే చిత్రంలో

రమేష్‌నాయుడు సంగీతం కూర్చిన- ఆరుద్ర రచన.

**'మసక మసక చీకటిలో**

**మల్లెతోట వెనకాలా-**

**మాపటేల కలుసుకో'**.. అనే పాట కూడా ఎంతో పాప్యులరైంది.

ఈ పాటలతో ఎల్లారీశ్వరికి ఒక ముద్ర, ఒక ప్రత్యేకత వచ్చాయి. అలాగే విజయా కృష్ణమూర్తి సంగీతంలో ' రాజకోట రహస్యం' లో **'నీవు నాకు రాజా- మరి నేను నీకు రోజా'** ఎంతో పాప్యులరైంది.

**'మబ్బుల చాటున చంద్రునిలా'** (ఇరుగు పొరుగు, రచన : ఆరుద్ర, సంగీతం : వేణు), **'గాలిలోన పైటచెంగు'** (ప్రతిజ్ఞాపాలన, దాశరథి రచన, సంగీతం : మాస్టర్ వేణు).

అంతకుముందు పాడిన కొన్నిపాటలు ఆదరణ పొందినప్పటికీ, డెబ్బై తర్వాత ఎల్లారీశ్వరి విజృంభించి పాడారని చెప్పాలి. అప్పట్లో ఆమెకు అవకాశాలు కూడా ఆవిధంగా వెతుక్కుంటూ వచ్చాయి.

**'నందామయా- గురుడ నందామయా'** (జీవనతరంగాలు-రచన: సి.నారాయణరెడ్డి, సంగీతం: జె.వి. రాఘవులు).

**'ఏదో తాపం - ఏదో తాపం'** (దేశోద్ధారకులు- ఆరుద్ర, కె.వి.మహదేవన్),

**'ఓలమ్మో - ఓరినాయనో'** (జీవితం (1973) సి.నారాయణరెడ్డి, రమేష్‌నాయుడు);

**'కంచె కాడ'** (మానవుడు- దానవుడు, సి. నారాయణరెడ్డి, అశ్వత్థామ);

**'అర్ధరాతిరికాడ అత్తయ్య నాకు'** (కంచుకోట, కె.వి.మహదేవన్);

**'ఆకులు పోకలు యివ్వద్దూ'**(భార్యాబిడ్డలు, కె.వి.మహదేవన్).

ఈ పాటలు జనం మరీ విరగబడి విన్నారు. 'మొనగాడొస్తున్నాడు', 'రివాల్వర్ రాణి' 'కథానాయిక మొల్ల' వంటి చక్కని అవకాశాలు వచ్చాయి.

**'జిల్లాయిలే - జిల్లాయిలే'** (రైతుకుటుంబం, టి.చలపతిరావు) జనం నాలుకల మీద తెగ నాట్యం చేసింది. ఒక్కపాట వున్నా, రెండు పాటలున్నా, ఎల్లారీశ్వరి పాడిందంటే ఆ పాటలు పాప్యులర్ అయి తీరవలసిందే. అదీ ఆమె ప్రతిభకి గుర్తు.

"నాకు చాలావరకు ఇన్‌స్పిరేషన్ రేడియో సిలోన్. అక్కడ్నించే పాటలు వింటూ నేను నేర్చుకున్నాను"

"క్లాసికల్ సంగీతం నేర్చుకోవాలని ఎంతో కోరిక వున్నప్పుడు అస్సలు డబ్బులేదు. డబ్బురావడం మొదలైనాక నాకు అస్సలు టైము లేకపోయింది" అంటారు ఎల్.ఆర్.ఈశ్వరి. కానీ క్లాసికల్ సంగీతం రాని లోటేమీ ఆమె పాటలో ఎక్కడా కనిపించదు.

ఆమెకు మరీ అభిమానం గల మ్యూజిక్ డైరెక్టర్ రమేష్‌నాయుడని ఎంతో భక్తిగా చెప్తారామె. సత్యం, వేణు, కె.వి.మహదేవన్, ఎమ్.ఎస్.విశ్వనాథన్ ఆమె చేత ఎంతో వైవిధ్యమున్న పాటలు పాడించారు.

**'బలె బలె మగాడివోయ్'**-(మరోచరిత్ర);

**'హలో మైడియర్ రాంగ్‌నెంబర్'**- (మన్మథలీల) వాటికవే సాటి అనిపిస్తాయి.

ఆమె ఎన్నో పాటలు పాడారు. అన్నీ మూడొంతులు హిట్టయిన పాటలే.

"జిక్కీగారు చాలా మంచివారు. ఉత్తమురాలు. ఆమె నాకెంతో సాయం చేశారు. నాకు అన్నం పెట్టారు. ఎందరి దగ్గరకో నన్ను తీసుకెళ్ళి 'ఈ పిల్ల బాగా పాడుతుంది చూడండి' అని నా గురించి చెప్పారు. అలా చెప్పేవార్ని ఎక్కడా మనం చూడం. కొందరైతే అలా చెప్పరు సరికదా మనకొచ్చేది కూడా లాక్కుంటారు" అంటూ ఎంతో స్వచ్ఛంగా చెప్పారామె.

ఆమెకొక తమ్ముడు, చెల్లెలు వున్నారు. ఆమె చెల్లెలు అంజలి కొన్ని పాటలు కూడా పాడారు. (విజయనిర్మల తీసిన **'కవిత'** సినిమాలోని 'బాజా భజంత్రీలు మోగుతాయి పందిట్లో' పాట యల్.ఆర్.అంజలి **పాడినదే**) ఆకస్మాత్తుగా చనిపోయారామె. "నా మంచి చెడ్డలన్నీ మా అమ్మగారే చూస్తారు. ఆమెకు నేనంటే ప్రాణం" అని చెప్పారు ఎల్.ఆర్.ఈశ్వరి.

'మీకు జీవితంలో మరపురాని సంఘటన లాంటిదేమైనా వుందా'' అని అడిగితే- "ఉందండీ-నిజంగా ఆ సంఘటన నేనెప్పటికీ మర్చిపోను. తల్చుకున్నప్పుడల్లా నాకెంతో ఆనందం కలుగుతుంది. అప్పుడు నాకు ఆరేళ్ళు వుంటాయనుకుంటా. నేను స్టేజి ఎక్కిపాట పాడాను. పాట పూర్తిచేసి దిగగానే అంతా వచ్చి నన్నెంతో మెచ్చుకున్నారు. అప్పుడు ఒక 'అమ్మ' నా దగ్గరకొచ్చి ముద్దుపెట్టుకుని ఎంతో ప్రేమతో నాకొక కప్పు ప్రెజెంట్ చేశారు. అప్పుడు నాకామె ఎవరో తెలీదు. తర్వాత తెలిసింది ఆమె ఆర్.బాలసరస్వతీదేవి అని. నాకు ఆమె పాటంటే ఎంతో ఇష్టం. అదే కాకుండా ఆమె ఎంతో మంచివారని, ఎదుటి వారిలోని ఆర్టుని చూసి మురిసిపోతారని నాకర్థమైంది. ఆమె తమిళంలో పాడిన పాటలు ఎన్నో వున్నాయి. అవెంతో బాగుంటాయి. అవి నాకెంతో ఇష్టం" అంటూ ఎల్.ఆర్.ఈశ్వరి ఎంతో ఆనందపడుతూ చెప్పారు.

"మీకిప్పుడు సినిమాల్లో పాటలు లేవు కదా! మీకెలా వుంది"?

"నాకేం బాధ లేదండి. నేను పాడవలసిన పాటలన్నీ పాడాను. నాకు రావలసిన కీర్తి, డబ్బూ వచ్చాయి. నాకిప్పుడు ఎన్నో స్టేజి ప్రోగ్రామ్‌లొస్తున్నాయి. అదీకాక క్యాసెట్లు చేస్తున్నాం. వాటికి మంచి డిమాండ్ వుంది" అన్నారామె ఉల్లాసంగా.

'ప్రోగ్రాములకెవరెవరు వెళ్తారు?'

"ఆనంద్‌గారితో ట్రూప్‌గా వెళ్తుంటాం. 'మధు' నాకెంతో సహకారం యిస్తారు".

"మధు అంటే..?".

"ఆయన పాడుతారు. తెలుగులో ఎక్కువ లేదు. ఆయన 'అక్కా'అని నన్ను ప్రేమతో చూస్తారు. నేను తానా సభలకు వెళ్ళి పాడానంటే అంతా మధు చేసిందే. అతనే నాకు సహాయం, సహకారం అంతా చేస్తుంటారు".

ఎల్.ఆర్.ఈశ్వరి తెలుగు, తమిళం, మలయాళం భాషల్లో ఎక్కువ పాడినట్టు, కన్నడంలో తక్కువ పాడినట్లు ఆమే చెప్తారు.

"ప్రోగ్రాములెక్కువగా ఎటు వెళ్తారు?"

"తమిళనాడులో! ఆంధ్రా వైపు చాలా వుళ్ళు వెళ్తూ వుంటాం. అన్ని చోట్లా ఎంతో బాగా నా పాటల్ని శ్రోతలు ఆదరిస్తారు. హుషారుగా చప్పట్లు కొడతారు. వన్స్‌మోర్‌లతో మారుమోగిపోతూ వుంటుంది".

"మీ సాటి గాయనులు ఎలా వుంటారు సాధారణంగా?"

"రకరకాలుగా వుంటారండీ - కొందరికి వాళ్ళ పాటలు నేను లాగేసుకున్నానని వుంటుంది. అదెలా సాధ్యం? ఒకసారి అందరం కలిసి ప్రోగ్రామ్‌కి వెళ్ళినప్పుడు నన్ను కావాలనే వెనుక విడిచి, నా రూంలో నేను తయారై వచ్చేలోగా, వెళ్ళిపోయారు. అప్పుడు ఆనంద్‌గారు "ఈశ్వరి ఎక్కడ?" అని అడిగార్ట. నేను రూంలో నిద్రపోతున్నానని చెప్పార్ట. ఆయన వెంటనే నాకోసం వేరే కారు తీసుకొచ్చారు. అప్పుడు నేను చెప్పాను -'ఎప్పుడో రెడీయై కూర్చున్నాను. నాకెవరూ బస్సు బయలుదేరే విషయం చెప్పలేదు. నాకు తెలీలేదు' అని బాధపడ్డాను. ఆయన "ఫర్వాలేదు. మీ కోసం నేను ప్రత్యేకంగా కారులో వచ్చాను కదా' అంటూ నన్ను ప్రోత్సహించి, నా మూడ్ మార్చేశారు. ఆరోజు చివరగా పాడింది నేనే. నా పాటకి వచ్చిన అప్లాజ్ ఎవ్వరికీ రాలేదు. ఈశ్వరి వచ్చి ముందే పాడివుంటే మరొకళ్ళ పాట ఎవరూ వినేవారు కాదు' అనుకుంటూ అంతా నన్ను మెచ్చుకున్నారు."

"మీకు ప్రోత్సాహం మీ అమ్మ గారే కదూ" అంటే..

"నిజమే. కానీ నాకు నిజమైన ప్రోత్సాహం నా అభిమానులే (నా ఫాన్సే). ఫాన్స్ లేనిదే నేను లేను అనిపిస్తుంది. రోజూ ఎన్నో లెటర్స్ ఫాన్స్ నుంచి వస్తాయి. అవే నాకు నిజమైన ఎంకరేజ్‌మెంట్ -ప్రోత్సాహం".

"మీరు క్యాసెట్లలో ఏం పాటలు చేస్తారు?"-

"అన్నీ భక్తిపాటలు. ఈమధ్య 'సర్వం శక్తిమయం' అనే క్యాసెట్ చేశాం. అయ్యప్ప పాటలు. షిరిడీ బాబా పాటలు - అలా ఏదో ఒకటి, క్యాసెట్ కంపెనీ వాళ్ళు దేనికి మార్కెట్‌లో

డిమాండ్ వుంటే దాన్ని అడుగుతారు. పాటలోని భావాన్ని బట్టి పాడటమే నా వుద్దేశం. సినిమా పాట వేరు. భక్తిపాట వేరు" అంటారామె.

ఎల్.ఆర్.ఈశ్వరి సహజంగా ఫోర్స్ వున్న మనిషిలా కనిపిస్తారు. తను అనుకున్నది ఎదో భయంతో దాచి పెట్టే స్వభావంగా కనిపించదు. ఇల్లు, డబ్బు అన్నీ తన అదృష్టం వల్ల, దేవుడి దయవల్ల లభించాయని భావించినట్లు కనిపిస్తారు.

"ఎంతకాలం మనకి అవకాశం వుంటే అంతకాలం పాడతాం. అంతేకానీ కొత్తవారు రాకూడదు, ఎప్పుడూ మనమే పాడాలంటే కుదిరే పనికాదు. అది న్యాయం కూడా కాదు. ఇదొక పెద్ద ప్రవాహం. దీన్ని ఆపాలనీ, మనమే వుండాలనీ అనుకోవడం తప్పు. ఎవరికెంత ప్రాప్తమో అంతా వస్తూనే వుంటుంది. మనది కానిది మనకి రాదు కదండీ....

ఏదో మొదలు పెట్టాం. ఇలా ఇంత పెద్దగా రాగలనని కూడా ఆశించలేదు. అనుకోలేదు. అంతా భగవంతుని దయ. అదృష్టం" అన్నారు. "నా పుట్టినరోజు డిసెంబరు 8. సంవత్సరం .." అంటూ నవ్వేశారు.

సాధారణంగా కళాకారులు పుట్టే డిసెంబరులోనే ఎల్.ఆర్.ఈశ్వరి పుట్టారు. బాగుంది. సంవత్సరం ఏదైతే మనకేం?



# ఎల్లారీశ్వరి హిట్స్

**చిత్రం: జీవనతరంగాలు** **గానం: ఎల్.ఆర్. ఈశ్వరి**
**రచన: సి.నారాయణరెడ్డి** **సంగీతం: జె.వి.రాఘవులు**

నందామయా
గురుడ నందామయా
ఉందామయా
తెలుసుకుందామయా
మెరిసే సంఘం మేడిపండు - దాని
పొట్ట విప్పి చూస్తే పురుగులుండు
ఆ కుళ్ళు లేని చోటూ యిక్కడే
అనుభవించు రాజా యిప్పుడే
ఆనందసారం యింతేనయా ॥నందామయా॥
పుట్టినప్పుడు బట్ట కట్టలేదు - మరి
పోయేటప్పుడు అది వెంటరాదు
నడుమ బట్ట కడితే నగుపాటు
నాగరీకం ముదిరితే పొరపాటు
వేదాంతసారం యింతేనయా ॥నందామయా॥

**చిత్రం: దేవుడుచేసిన మనుషులు** **గానం: ఎల్.ఆర్. ఈశ్వరి**
**రచన: ఆరుద్ర** **సంగీతం: రమేష్‌నాయుడు**

మసక మసక చీకటిలో
మల్లెతోట వెనకాల
మాపటేల కలుసుకో
నీ మనసైనది దొరుకుతుంది
దొరుకుతుంది
ఓ...కే... యా..
యాయా యయాయా యాయా
యాయా యాయాయా యాయా హ.....
మా దేశం వచ్చినవాడా
మా బొమ్మలు మెచ్చినవాడా
తరతరాల అందాల
తరగని తొలిచందాల
ఈ భంగిమ నచ్చిందా!?
ఆనందం ఇచ్చిందా!?
అయితే... ॥మసక మసక॥
చోద్యాలు వెతికే వాడా
సొగసు చూసి మురిసేవాడా
కళ చేతికి దొరకాలంటే
నలుమూలలు తిరగాల
నీముందుకు రావాలా!
నీ సొంతం కావాలా!
అయితే..... ॥మసక మసక॥

**చిత్రం: మన్మథలీల రచన: వేటూరి** **సంగీతం: చక్రవర్తి**
**గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎల్.ఆర్. ఈశ్వరి**

ఆ: హలో... హలో..
అ: హలో మై డియర్ రాంగ్ నెంబర్
హలో మై డియర్ రాంగ్ నెంబర్
గొంతుకే వింటే ఎంత మధురం
చెంతకే వస్తే చాలు స్వర్గం ॥ గొంతుకే ॥
నీవింత శృంగారం... నీవింత శృంగారం ఒకమారు చూపగ రాదా
ఆ: హలో..
అ: హలో మై డియర్ రాంగ్ నెంబర్
ఆ: చూపితే ఏముంటుంది అందం
ఎందుకో నీలో ఇంత తాపం ॥ చూపితే ॥
అనుభవం ఎంతో ఉంది ఆగితే బాగుంటుంది
హలో..
అ: హలో మై డియర్ రాంగ్ నెంబర్
ఆ: చూపితే ఏముంటుంది అందం
ఆ: ఎందుకో నీలో ఇంత తాపం
అ: కవుల కల్పనవో... ఆ: నో
అ: మరుమల్లె తేనెవో ఆ: నో...నో...
అ: కవుల కల్పనవో..... మరుమల్లె తేనెవో
శిల్ప సుందరివో తెల్పగ రావో
ఆ: నాట్ యట్..
పూవునై వస్తే ఆగరే మీరు అ: రియల్లీ
ఆ: పూవునై వస్తే ఆగరే మీరు
మధువులే కోరి... గొడవ పెడతారు
అ: ఐ డోంట్ మైండ్
నీవింత శృంగారం ఒక మారు చూపగ రాదా
ఆ: హలో..
అ: హలో మై డియర్ రాంగ్ నెంబర్
గొంతుకే వింటే ఎంత మధురం
చెంతకే వస్తే చాలు స్వర్గం
ఆ: హృదయాన రాణిగ ఎవ్వరున్నారు
అ: రాణివైతె నువ్వే ఇంకొకరు లేరు
ఆ: వేచివుంటే పోదా
అ: మోజు తీర్చరాదా ఆ: ॥వేచి ॥
ఆ: మురిపాలు చాలండి
అ: మురిపించ వద్దండి
ఆ: హలో...
అ: హలో మైడియర్ రాంగ్ నెంబర్
గొంతుకే వింటే ఎంత మధురం
చెంతకే వస్తే చాలు స్వర్గం
నీవింత శృంగారం ఒక మారు చూపగ రాదా
ఆ: హలో... అ: హలో...

# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## విశాఖపట్టణం

నవంబరు 21 న ప్రేమసమాజంలో జరిగిన కార్యక్రమంలో నలభైమందికి పైగా జోక్స్, పాటలు, పేరడీపాటలు, స్కిట్స్ ప్రదర్శించి సభను అలరింపజేశారు. 'అయితే అటు-లేకుంటే ఇటు' (తృష్ణవేలు, మహమ్మద్ రఫీ) 'తిరుపతి ప్రయాణం' (అప్పారావు, మస్తాన్‌రెడ్డి) స్కిట్స్, సాయిప్రకాష్ జోకాభినయం, 'బొమ్మను చేసి' ప్యారడీపాట (గరిమెళ్ల నాగేశ్వరరావు)'పూలపాట' (చక్రధర్) 'హాయిరే కోడిపిల్లా' జానపదగీతం (డప్పు ప్రసాద్, రాపేటి అప్పారావు, కోరాడ అప్పారావు) ఇత్యాది పలు హాస్య-సంగీత పరమైన అంశాలు ఆకట్టుకున్నాయి. హాస్యోక్తులు చెప్పడానికి చిన్నపిల్లలు, మహిళలు ఉత్సాహం చూపడం, సభాసదులందరూ పట్టుబట్టి పదినిమిషాలపాటు సభను పొడిగించడం విశేషంగా చెప్పుకోదగ్గవి.

బహుమతుల విషయానికి వస్తే కళ్లు చిదంబరం అవార్డు పి.వేణుగోపాల్, డా॥ టి.నారాయణమూర్తి అవార్డు కవయిత్రి కో.వె.ల (ఆమె ఆ మొత్తాన్ని నిర్వహణ ఖర్చుల నిమిత్తం క్లబ్‌కు ఇచ్చివేశారు) సుమిత్ర మెమోరియల్ అవార్డు రత్నకుమారి, కొప్పుల పద్మావతి 'అందరిక హోమియో వైద్యం' పుస్తకాన్ని, శ్రీమన్నారాయణ 'పారిజాతం' కథల సంపుటాన్ని గెలుచుకున్నారు. సైన్సు రచయిత, ఆకాశవాణి ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ నాగసూరి వేణుగోపాల విశిష్ట అతిథిగా పాల్గొన్నారు.

దినదిన ప్రవర్ధమాన మవుతున్న 'హాసం క్లబ్' నిర్వహణా బాధ్యతలను పంచుకోవడానికి మరి కొందరు కార్యకర్తలు ముందుకు రావలసినదిగా శ్రీ మస్తాన్ రెడ్డి కోరారు.



ప్రత్యేక బహుమతి పొందిన జానపదగీతాల బృందం



'అయితే అటు - లేకుంటే ఇటు' స్కిట్

### Just for laughs

THANKS TO noted graphics artist, Sankhavarapu Srinivasa Rao of Hyderabad, the Haasam Club of Visakhapatnam recently organised a humorous musical-cum-dramatic-events Nite in the Premasamajam Auditorium.

Literary giants, Prof. K. Malayavasini (AU dept. of Telugu) and renowned writer, playwright and cine actor, Gollapudi Maruthi Rao, noted compere and writer Rambhatla Nrusimha Sarma, litterateurs Avasarala Ramakrishna Rao, Adapa Ramakrishna and Muddamsetti Hanumantha Rao, Visakha Humour Club Committee members — Nanduri Prabhakar, Ravi S. Gopi Krishna, mimicry artiste, K.V. Siva Rama Krishna and the likes spiritedly participated and regaled the audience.



**Gala start**

The evening got off to a grand gala start with the rendering of parody like lyrics in place of cine songs like "Lechindi - Nidura Lechindi" ("Gundammakadha") by the convener of the Club, T.L. Prasad.

The talks on "Ramayanamlo haasyam" by Prof. Malayavasini and "Jeevithamlo haasyam" by Avasarala Ramakrishna Rao filled the air with sublime pleasure and joy. Some of the jokes and parody like talks rendered by Rambhatla, Gollapudi, Gundana Joga Rao and others created ajovial ambience.

**Humorous skits**

There was presentation of two humorous skits as well. The first was a joint effort of another convener of the Club, Meda Mastan Reddy and Reddypanthula Chakradhar titled "Kirukula Rao and Chitukula Rani". The other was "Jaddi (Gaddi) Maalokam" scripted by Talabattula Lakshmi Prasad.

The cash prize of Rs.116 instituted by the noted cine comedian Kallu Chidambaram was bagged this month by young mimicry artiste Prasant. Madhavi Sanara, Vijayalakshmi, Bhoopathi Rao and Gunisree were awarded special prizes. Noted novelist and playwright Muddamsetti who was in charge of evaluating the performances, gave away the prizes.

• A.R.S.

హిందూ పత్రికలో 'విశాఖ హాసం క్లబ్' పై ప్రత్యేక వ్యాసం

'హాసం క్లబ్' ప్రారంభించదలచినవారు సంప్రదించవలసినది
శ్రీ ఎస్.వి.రామారావు,
040-24160279,
9849139030

## శ్రీకాకుళం



హిందీపాట పాడిన హేమలత

నవంబరు 14 న గాయత్రి లలితకళా విద్యాలయంలో జరిగిన తృతీయ సమావేశం చాచా నెహ్రూకు అంకితం చేయడం జరిగింది. పలువురు హిందీపాటలను, పాత సినిమా పాటలను, పేరడీ పాటలను పాడి వినిపించారు. 'చిటపట చినుకులు' పాటకు ప్యారడీగా 'కుతకుత ఉప్మా ఉడుకుతూ ఉంటే' పాటను రామ్మోహన్ పాడి వినిపించారు.

పరబ్రహ్మ వ్రాసి స్వరకల్పన చేసిన 'ఆంధ్రదేశం నాది' పాట వినిపించారు. చి॥ శరశ్చంద్ర మిమిక్రీతో, హేమలత 'ప్యార్ హువా ఇక్‌రార్ హువా' పాటతో, ఇంద్రసేన్ జోకులతో సభను అలరించారు. చిన్నం నాయుడు, రాజేష్, రంగారావు, లోకనాథం, జగదీశ్వరరావు, శ్రీనివాసరావు, పద్మనాభం, రవి తదితరులు పాల్గొన్న ఈ సభకు ఓ.రామారావు సంచాలకునిగా, దూసి బెనర్జీ సమన్వయకర్తగా వ్యవహరించారు.




జోక్స్ చెబుతున్న లోకనాథం



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

పిల్లల కోసం ప్రత్యేకం...




# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బియస్ ప్రసాద్

2వ భాగం

చిత్ర పరిచయం 7

సమన్వయం
మంజీర

(జరిగిన కథ - ఆంబోతు అనే జంతువుల అండర్‌వరల్డ్ డాన్ కోరిక మేరకు డా॥ జాన్ డూలిటిల్ ఓ అడవిని సంరక్షించే కార్యక్రమం చేపడతాడు. ఎవా అనే అరుదైన వన్యజాతికి చెందిన ఆడభల్లూకం ఒకటి అడివిలో ఉందని, దాన్ని సర్కస్‌లో పెరిగిన ఆర్చీ అనే మగభల్లూకంతో జత కలిపితే విచక్షణారహితంగా అడివిని నాశనం చేసే కంట్రాక్టర్లకు ప్రభుత్వం అడ్డు వేస్తుందని తెలుస్తుంది జాన్‌కి. కోర్టునుండి ఒక నెల గడువు తీసుకుని జాన్, ఆర్చీని ఎవా వద్దకు తీసుకెళతాడు. కానీ సర్కస్‌లో పెరిగిన ఆర్చీని చూసి, ప్రకృతి ఒడిలో పెరిగిన ఎవా ఆకర్షింపబడదు. వనవరినరాలకు అనుగుణంగా ఆర్చీని మార్చే పని మొదలుపెడతాడు జాన్ - ఇక చదవండి)

ఎవాను బుజ్జగించి ఆనందంగా ఇంటికి వచ్చిన జాన్‌కు ఇంటివరండాలో పెద్దకూతురు షెరెజ్ ఎదురయింది. యూరోప్ ట్రిప్‌కు వెళ్లడానికి తయారయిన ఆమెను అడివికి లాక్కొచ్చినందుకు జాన్‌కు పశ్చాత్తాపం కలిగింది. ఏదో ఒకటి మాట్లాడి ఊరడిద్దామని ప్రయత్నం మొదలుపెట్టాడు -

"హాయ్, రాత్రిపూట ఇక్కడ బాగా ఉంటుంది కదూ.."

చిరునవ్వు చిందించి షెరెజ్ ఊరుకుంది. తన ఇష్టాలు తనవి. తండ్రి కష్టాలు తండ్రివి. ఎవరు మాత్రం ఏం చేయగలరు?



"ఈ ప్రశాంత వాతావరణం, కాలుష్యం లేని పచ్చిగాలి, చుట్టూ కీచురాళ్ల రొద - ఇవన్నీ ఓ కొత్తదేశానికి వెళ్లిన ఫీలింగు కలుగుతోంది కదూ.."

'ఇంకా నయం, కొత్త ఖండానికి అనలేదు నాన్న' అనుకుంటూ షెరెజ్ ఇంకాస్త నవ్వి 'మరే' అంది.

సంభాషణ కాస్త పొడిగించి కూతుర్ని హుషారు చేయడానికి "ఆ కీచురాళ్లు ఏమంటున్నాయో తెలుసా, షెరెజ్" అన్నాడు జాన్.

అదే అతను చేసిన పొరబాటు. జంతువులు, క్రిమికీటకాల మాట ఎత్తగానే షెరెజ్‌కు ఒళ్లు మండిపోయింది.

"చూడు నాన్నా, కీచురాళ్లు ఏం పాటలు పాడతాయో, బోదురుకప్పలు ఏ ప్రేమగీతాలు వల్లిస్తాయో తెలిసేది నీకు! నాకు కాదు. నా దగ్గరకి ఏ కోతీ రాదు. వచ్చినా 'హలో షెరెజ్' అని పలకరించదు. పలకరించినా నేను 'హల్లో కోతిబావ గారూ, కాస్త మందు కొడతారా? గ్లాసులో పట్టుకురమ్మంటారా? లేక సీసా పళాన 'రా' కొట్టేస్తారా? అని అతిథిమర్యాదలు చేయను." అని విరుచుకుపడింది.

జాన్ వద్దకు తరచుగా వచ్చే తాగుబోతు కోతి అంటే షెరెజ్‌కు మహామంట. వీళ్లందరినీ నెత్తి కెక్కించుకునే తండ్రి అంటే ఇంకా మంట. అందుకే ఆ కోపాన్ని ఇలా వెళ్లగక్కింది. జాన్ గుక్కతిప్పుకునే లోపున మళ్లీ అందుకుంది -

"నేను సాధారణమైన మనిషిని నాన్నా! నాకీ జంతువులూ, అవీ పట్టవు. నా గోల నాది. నా గదిలో కూచుని మ్యూజిక్ వింటూ కూచు.."

"షెరెజ్, కాస్త ఇంటర్వెల్ ఇయ్యి తల్లీ! నేను చెప్పబోయిన దేమిటంటే కీచురాళ్లు గుసగుసలాడుతున్నాయి తప్ప ఒకర్ని ఒకరు పిలుచుకోవటం లేదని..! నా భాషాపాండిత్యం ప్రదర్శిద్దామనుకున్నాను కానీ నువ్వింత లెక్చరు దంచుతావని నాకేం తెలుసు! సరే కానీ.. నీ క్కావలసినట్టే నువ్వుండు. గదికి వెళ్లి హాయిగా సంగీతం విను." అని దణ్ణం పెట్టేశాడు జాన్.

"నేనదే చేయ బోతున్నాను." అని షెరెజ్ లోపలకు వెళ్లబోయింది.

ఇంతలోనే కారు హారన్ మోగింది. తలతిప్పి చూస్తే డొమినో పిజ్జావాళ్ల కారు కనబడింది. ఇది ఇక్కడ కెందుకు వచ్చిందాని జాన్ ఆశ్చర్యపడుతూండగానే సమాధానం కారు దిగింది.



షెరెజ్ బాయ్‌ఫ్రెండ్,

డామినో పిజ్జాలు డెలివరీ చేసే బాయ్ - ఎరిక్!

ఇలాటివాడితో పరిచయా లేమిటని తను నిరసించడం వల్ల కూతురు స్నేహం మానుకుందని ఆశపెట్టుకున్న జాన్, ఎరిక్ ఇంతదూరం వెంటాడి రావడంతో ఉలిక్కిపడ్డాడు. ఎరిక్ కారు శబ్దం వింటూనే షెరెజ్ బయటకు పరిగెట్టుకురావడంతో మతి పోగొట్టుకున్నాడు.

షెరెజ్‌ను చూస్తూనే ''వాడికి గుడ్‌బై చెప్పాసానన్నావ్'' అని ఆక్రోశించాడు.

దానికి బదులు ఎరిక్ నుండి వచ్చింది, తన స్టయిల్లోనే - "సంగతేంటి? మామా!"

జాన్ అతన్ని అనుకరిస్తూ, "నాకేంటి తెలుసు? సంగతేంటో నువ్వే చెప్పు నాయనా" అని అడిగాడు.

"వేరే సంగతేంటి? షెరెజ్‌కు నేనంటే పడి ఛస్తుందనుకుంటున్నాను. నే లేపోతే బాధపడుతుందనుకుంటున్నాను. అందుకే రెండురోజులుండి పోదామని వచ్చాను."

ఎరిక్ అతి సీదాసాదాగా చెప్పేశాడు కానీ జాన్ గుండెల్లో రైళ్లు పరిగెట్టాయి. వరాయి కుర్రాడు వచ్చి తన ఇంట రెండురోజులు తిష్టవేయడ మేమిటో అతనికి బోధపడలేదు. కూతురుకేసి తిరిగి, ''నువ్వేనా చెప్పు సంగతేమిటో, నాకేం అర్థం కావటం లేదు.'' అని అడిగాడు.

''ఇందులో అర్థం కాకపోవడానికేముందో నాకర్థం కావటం లేదు.'' అంది షెరెజ్ కూలాతికూల్‌గా.

"ఈ కుర్రాడు రెండు బాగ్‌లు పట్టుకుని దిగడ్డమేమిటి..రెండురోజులుండమేమిటి ?"

"అంతకంటె ఉండనివ్వనంది అమ్మ!"

"మీ అమ్మకు ఇవన్నీ తెలుసా? తెలిసే ఒప్పుకుందా?"

"నిక్షేపంలా తెలుసు."

జాన్ ఇంకేమీ మాట్లాడలేకపోయాడు. "సరే, అలాగే కానీయండి. కానీ ఇదిగో.. ఎరిక్.. నేనిప్పుడే చెబుతున్నాను. నువ్వు అక్కడా ఇక్కడా కాదు, లివింగ్‌రూమ్‌లోనే నీ సామాన్లు పెట్టుకోవాలి. అక్కడే నేల మీద పడుక్కోవాలి... స్లీపింగ్ బ్యాగ్ తెచ్చుకున్నావ్‌గా... తర్వాత ఇంకో ముఖ్యమైన సంగతి.. నువ్వూ, షెరెజ్ అడివిలో షికార్లు కొడతారేమో! జాగ్రత్త! అడివిలో ఉన్న యావత్తు జంతుజాలం నా ఫ్రెండ్సే! వాళ్లంతా నా గూఢచారులే! నీకు తెలుసుగా, నాకు జంతువుల భాష వచ్చని..!"

"అబ్బ, లోకమంతా తెలుసులే!" అంది షెరెజ్.

"అందుకే నువ్వంటే నాకు బయ్యం మామా" అన్నాడు ఎరిక్ సిగ్గూ ఎగ్గూ లేకుండా.

అతన్నింకేమీ మాట్లాడనీయకుండా షెరెజ్ ఇంట్లోకి నెట్టుకుంటూ పోయింది.

ఆర్చీని సహజభల్లూకంగా చేసే ప్రక్రియలో భాగంగా జాన్ ఓ వీడియో ప్రోగ్రాం ఏర్పాటు చేశాడు. ఎలుగుబంట్లు తమ ఆహారాన్ని తామే ఎలా సంపాదించుకుంటాయి అన్న విషయంపై డాక్యుమెంటరీ అది. చిన్నప్పటినుండీ వేళకింత పడేస్తే తినడం అలవాటు పడిన ఆర్చీకి ఇదంతా బోరుగా తోచింది. వెధవది తిండికోసం ఇన్ని తిప్పలా? ఇదంతా చచ్చీ చెడీ నేర్చుకోవాలా? అనిపించింది దానికి.

"టీవీలో వేరే ఛానెల్‌లో ఏవొస్తోందో చూడు కాస్త" అంది జాన్‌తో.

జాన్ మండిపడ్డాడు. "ఏమొస్తోందో నీ కనవసరం. ఎలుగుబంట్లు ఆహారం ఎలా సంపాదించుకుంటాయి అన్న టాపిక్ మాబోటివాళ్లకి. ఎలా సంపాదించుకోవాలి అన్న విషయం గ్రహించాల్సింది నువ్వు. నీ అంతట నీవే ఆహారం సంపాదించుకుని శీతాకాలంలో మల మల మాడిపోకుండా ఎలాగ బతకాలి? అన్నది చూసి నేర్చుకోవాలనే ఈ వీడియో చూపిస్తున్నాను." అన్నాడు.



ఆర్చీ ముఖం మాడ్చుకుని వీడియో చూడసాగింది. తెరమీద ఓ భల్లూకం నేలను తవ్వుతోంది. "అదేం చేస్తోంది?" అని అడిగింది ఆర్చీ.

"దాన్ని తవ్వడం అంటారు. నీకు భగవంతుడు పదునైన గోళ్లు ఎందుకిచ్చాడో తెలుసా?" అన్నాడు జాన్ కోపంగా.

"తెలీదు." అంది ఆర్చీ సిన్సియర్‌గా.

జాన్ నుదురు కొట్టుకున్నాడు.

ఇంతలో వీడియోలో వ్యాఖ్యాత "ఎలుగుబంట్లు చాలా బాగా ఈత కొడతాయి." అన్నాడు.

ఆర్చీ చిరునవ్వు చిందించి "ఈ ఎలుగుబంటికి మాత్రం ఈత రాదురా బాబూ" అంది.

"ఇక్కడ సోఫాలో విశ్రమించి నాకు ఈత రాదు, తవ్వడం రాదు అంటే బతుకు ముందుకు సాగదు. అన్నీ నేర్చుకోవాల్సిందే!" అని హుకుం వేశాడు. నేర్పించే టీచర్లంటే ఒళ్లుమండే స్టూడెంట్ల తరహాలోనే ఆర్చీకి జాన్ మీద కోపం వచ్చింది. ఏమీ నేర్చుకోకుండా ఇన్నాళ్లు గడపగా లేనిది, ఇంకొంతకాలం ఎందుకు గడవదో దానికి అర్థం కాలేదు. అందుచేత వెటకారం మిళాయించి, "ఈత రాకపోతే బతుకు సాగదంటున్నావు. నీకు బహుశా తెలియదేమో, ఈ మధ్యనే ఒక వింత సాధనం ఒకటి కనిపెట్టారు. దాన్ని 'పడవ' అంటారు. నీళ్లు దాటాలంటే అదుంటే చాలు. వూరికే నీళ్లలో పడి కాళ్లు తపతపా కొట్టక్కర్లేదు!" అని గయ్యిమంది.

ఇంత తెలివైన స్టూడెంటుతో టీచరుగారికి ప్రాణం చాలొచ్చింది. "నీ వాగుడుతో నా ఓపిక మొత్తం హరించుకుపోయింది. 'అన్‌బేరబుల్' అన్నమాటకు అసలైన అర్థం ఇప్పుడు స్ఫురిస్తోంది! ప్రస్తుతానికి నీ జ్ఞానజ్యోతిని ఆర్పి గూట్లో పెట్టుకో. రేప్పొద్దున్నే తెలతెలవారుతూండగానే బయలుదేరదాం. చేపలు పట్టడం ఎలాగో ఇప్పుడు చూశావుగా... రేపు నీకు ప్రాక్టికల్‌గా నేర్పిస్తాను." అంటూ ఆ రోజు పాఠాలకు మంగళం పాడాడు.

మర్నాడు ఉదయానికల్లా జాన్, ఆర్చీని ఓ చెరువులో దింపాడు. మధ్యలో ఓ రాయి మీద నిలబడి పాఠం ఆరంభించాడు - "ఓకే ఆర్చీ, ఈ చెరువునిండా చేపలే! మనం హాయిగా కావలసినన్ని పట్టి తినొచ్చు..."



ఆర్చీ మొహంలో ఆనందం లాటి జాడలేమీ కనబడలేదు. అది జాన్‌కేసి దీర్ఘంగా చూసి నిట్టూర్చి ఊరుకుంది.

"నా మొహం కేసి చూస్తే ఏమొస్తాయి? నీళ్లకేసి

చూడు. చేపలు తైతక్కలాడేది అక్కడ, నా మొహం మీద కాదు." అని విసుక్కున్నాడు జాన్.

అతని మాట మన్నించి నీళ్లకేసి చూసినా ఆర్చీకి ఉత్సాహమేమీ కలగలేదు. "ఈ వెధవ చేపలు ఓ చోట కుదురుగా ఉండలేవు. అటూ



ఇటూ ఊహూ తెగ తిరుగుతున్నాయి. అమ్మో, ఒకటి నన్ను గుద్దేసింది... అయ్యయ్యొయ్యో ఇంకోటి కూడానూ.. ఛ, చెడ్డ చీదరగా ఉంది."

"ఇదిగో మై డియర్ బొచ్చుభల్లూకమా! ఇక్కడ నిలబడి ఛీ ఛా అనడం కాదు. నువ్వు చేయాల్సింది - నీట్లో తలకాయ ముంచి నోటి కందినవి లటుక్కున పట్టుకోవాలి."

"యాక్" అంటూ ఆర్చీ ఆ ఐడియా కొట్టిపారేసింది.

"యాక్ లేదు, గీక్ లేదు. నిన్న టీవీలో చూపించాను చూశావా, అలాగే నువ్వూ చేయాలన్నమాట! అదీ నేననేది. తలకాయ నీట్లో ముంచి.. నోటి కందినవి.. కమాన్ ఆర్చీ! యూ కెన్ డూ ఇట్! నీ పక్కన నేనున్నాను. నీకే భయం లేదు. కమాన్ తలకాయ ముంచు వన్... టు... త్రీ..."

"అబ్బ వదలవు కదా" అంటూ ఆర్చీ తల నీట్లో ముంచింది. నీట్లో చేపలన్నీ ఆర్చీని చూడగానే దగ్గరకి చేరాయి. అవి కూడా ఆర్చీ సంగతి విని వున్నాయి. "ఓహో ఆర్చీ అంటే నువ్వేనన్నమాట! నీకు చేపలు పట్టడం ఎలా వస్తుంది బాబూ! ఎవరైనా పట్టి ఇస్తే మెక్కడమే కానీ స్వయంగా ఏం పడతావ్!"



అని వెక్కిరించాయి. అంతేకాదు "సంగతేమిటి మామా" అని పలకరించాయి ఎరిక్ స్టయిల్లో.

ఉక్రోషం కొద్దీ ఆర్చీ వాటిని పట్టుకోబోయింది కానీ ఒక్కటీ చేతికి చిక్కలేదు. తలకాయ బయటకు తీసేస్తే జాన్ తన్నేట్టున్నాడు. ఏమైతే అయిందని తలకాయ నీట్లోనే ఉంచింది కానీ ఊపిరందడం మానేసింది.

కాసేపటికి జాన్‌కి భయం వేసింది. "ఆర్చీ, ఆర్చీ" అని పిలిచాడు. అప్పటికే ఆర్చీకి స్పృహ తప్పింది. గట్టు మీదకు లాగి నీళ్లు కక్కించే ప్రయత్నంలో జాన్ తలప్రాణం తోకకు వస్తే గానీ ఆర్చీ తోకప్రాణం తలకు రాలేదు. వచ్చాక, కళ్లు తెరిచి చూసింది ఆర్చీ.

"ఊపిరందకపోతే నీట్లోంచి తల బయట పెట్టాలన్న సంగతి కూడా తెలియదా? అది తెలియడానికి పెద్ద తెలివితేటలు కావాలా?" అని చివాట్లేశాడు.

చావబోయి బతికినందుకు సంతోషిస్తున్న ఆర్చీ ఈ చివాట్లు పట్టించుకోలేదు. తన మరణానుభవాన్ని ఏకరువు పెట్టబోయింది. "కళ్లు మూతలు పడగానే నాకు ఓ పెద్ద వెలుగు కనబడింది. ఆ వెలుగు ఎంత ప్రకాశవంతంగా ఉందనుకున్నావ్.."

ఈ సబ్జక్ట్‌పై జాన్‌కి ఏమాత్రం ఇంట్రస్టు లేనట్టుంది. "నీ 'చావు' తెలివి నా దగ్గర చూపించకు. నిన్ను రఫ్ అండ్ టఫ్‌గా చేయడమే నా ధ్యేయం. పద, చేపలు కాకపోతే నువ్వు ఏం పట్టుకోగలవో అదే పట్టుకో! కానీ ఏదో ఒకటి పట్టుకోకుండా మనం ఇంటికి తిరిగి వెళ్లేది లేదు. అర్థమైందా?"

జాన్ అథార్టీ చూసి ఆర్చీకి బుర్ర తిరిగిపోయింది. "నిన్ను చూస్తుంటే మా తాత గుర్తుకువస్తాడు. తనూ ఇంతే, మహా స్ట్రిక్ట్!" అని విసుక్కుంది.

ఇదంతా చాటుగా గమనిస్తున్న కాంట్రాక్టర్ల లాయర్, జాన్ అవస్థ చూసి తనలో తానే నవ్వుకుంటూ వాళ్లను అనుసరించాడు.

కొంతదూరం నడిచాక జాన్ ఓ చెట్టు వద్ద ఆగి, బెరడు పీకాడు. దాని కింద పురుగులున్నాయి. సాధారణంగా ఎలుగుబంట్లు అలా పీకి పురుగులను చప్పరిస్తాయి. కానీ నాగరీకం నేర్చిన ఆర్చీ దాదాపు మనుష్యుల్లాగానే అయిపోయింది. అందుకని జాన్ ఇచ్చిన బెరడు ఫలహారాన్ని "నో థ్యాంక్స్" అంటూ నిరాకరించింది.

"ఫరవాలేదు, బావుంటాయి. తిను, తిను." అని ప్రోత్సహించాడు జాన్.

"అంత బావుంటే నువ్వే తిను. నాకక్కర్లేదు." అంది ఆర్చీ ఏవగించుకుంటూ.



లాయర్‌కు నవ్వాగలేదు. జాన్ కంటబడతానని భయపడి అక్కణ్నుంచి పారిపోయాడు.

ఆర్చీ ట్రెయినింగ్ తన ఒక్కడివల్లా కాదని గ్రహించిన జాన్ లక్కీని, తాను మాయాకు బహుమతిగా ఇచ్చిన ఊసరవెల్లిని కూడా నియోగించాడు. కాటేజీ బయట ముగ్గురూ కలిశారు. ఆర్చీ చేత ఓ ద్రాక్షగుత్తిని కోయించే యజ్ఞం మొదలుపెట్టారు.

ఆర్చీ చెట్టుపైకి దృష్టి సారించింది. "ఇప్పుడు ద్రాక్షపళ్లు కోయకపోతే ఏం?" అంది. "నాకు అందుతుందంటావా?" అని అనుమానం వెలిబుచ్చింది.

- (సశేషం)

(గత సంచిక తరువాయి)



కార్టూన్‌కు, ఆ మాటకొస్తే హాస్యానికి కావలసినది ఉత్ప్రేక్ష, అతిశయోక్తి. అవి ఉంటేనే కార్టూన్ రక్తి కడుతుంది. నీటిమీద నడుస్తాననే స్వామీజీల గురించి ఓ చురక!










సరసి కార్టూన్లు
250 కార్టూన్లు, 50 రూ॥లు
ప్రతులకు - విశాలాంధ్ర



అలాగే బలప్రదర్శన చేసే వెయిట్ లిఫ్టర్ల గురించి

పొద్దుతిరుగుడుపువ్వు నూనె వాడితే గుండెజబ్బులు నయం అవుతాయని ప్రచారం చేస్తున్నారు కానీ ఈ రకమైన ప్రమాదం గురించి ఎవరూ ఆలోచిస్తున్నట్టు లేదు.

అలాగే చైనా సరుకులు వాడితే వచ్చే అనర్థం గురించి కూడా హెచ్చరిస్తున్నారు సరసి!



మాయాబజార్ సినిమాలో తన బాల్యచేష్టలు నాటకరూపంలో చూసి మురిసే కృష్ణుణ్ని చూపించి ఓ తమాషా చేశారు. టైమ్ మెషీన్‌లో యశోదాకృష్ణులు మరింత ముందుకు వచ్చేస్తే కలిగే అనర్థం ఊహించారు సరసి!






వంటికి నీరు పట్టింది అంటాం కానీ ఏ లెవెల్‌కి పట్టగలదో ఊహించండి.




ఇలా ఈ పుస్తకంలో ఉన్న కార్టూన్లన్నీ ఏదో ఒక చమత్కారంతో అలరారుతున్నాయి. సరసి 1200 కార్టూన్లు వేశారని, 110 కథలు రాశారని, అంతర్జాతీయ కార్టూన్ల పోటీలో సైతం బహుమతులు పొందారని పుస్తకం ద్వారా తెలుస్తోంది.బాపుగారు బొమ్మ గీచి ఆశీర్వదించిన అదృష్టశాలి సరసి!



పళ్లెం అంచుల మీద నిలబడి నాట్యం చేసేవారి వంటింటివైపు ప్రసరించింది ఆయన చూపు. పాపం వంకర కంచాలు పారేసుకోలేరు కదా! రవి గాంచనిచో.. అన్న వాక్యాలు గుర్తుకు వచ్చేది ఇలాటిచోట్లే!



- ఎమ్బీయస్ ప్రసాద్





# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 25

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మన్ కూతురు అశ్విని తండ్రంటే భయపడే పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించి తండ్రిని ఒప్పించి పెళ్లాడింది. వారి శోభనం జరగడానికి కొన్ని గంటల ముందు ఓ సాధువు ఎక్కడినుండో వచ్చి కోడలు గర్భం దాలిస్తే నీకు చావు తప్పదని శ్రీరామ్ తండ్రి వీరభద్రాన్ని హడలగొడతాడు. దాంతో ఒకే చూరుకింద ఉన్నా కొత్తదంపతులు కలవకూడదని ఆంక్షలు విధిస్తాడాయన. ఎడబాటు భరించలేక వారు ఎవరికీ చెప్పకుండా విజయవాడలో 'హనీమూన్' జరుపుకుందామని ప్లాను చేస్తారు. అశ్విని ముందే ఊరెళ్లిపోతుంది. శ్రీరామ్ తన ఫ్రెండు పెళ్లి వంక పెడతాడు.

- ఇక చదవండి

"పిల్స్ వాడేవా?.. సర్‌ప్రయిజింగ్ ! మరి ప్రెగ్నెన్సీ లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయే.." ఆశ్చర్యపోతూ అనుకుందామె.

"ఒకోసారి మనకళ్లు, చెవులూకూడా మనల్ని మోసం చేస్తాయి డాక్టర్! అలాంటప్పుడు మీ 'డయోగ్నసిస్' లో పొరపాటు జరక్కూడదని ఎక్కడుందీ?"

"నో! జరగదు! హండ్రెడ్ పర్సెంట్ అయామ్ రైట్ ! సర్వీసులో వేలమంది గర్భవతుల్ని పరీక్షించాను... వందల మందికి కాన్పులు చేశాను.. ఎప్పుడూ ఎక్కడా అలాంటి పొరపాట్లు జరగలేదు." దృఢమైన స్వరంతో అశ్వినివైపు సూటిగా చూస్తూ చెప్పిందామె.

అశ్వినికి గుండెలు జారిపోయాయి. డాక్టరమ్మ వైపే అయోమయంగా చూస్తూ - అచేతనంగా ఉండిపోయింది. ఆమెను చూస్తూ డాక్టరు చెప్పింది -

"ఆఫ్‌కోర్స్!.. ఒకోసారి 'పిల్స్' పనిచేయక పోవచ్చు.. అలాంటి సందర్భాలు నేను చాలా చూశాను. ఒక్క 'పిల్స్' మాత్రమే కాదు.. ఆపరేషన్ ఫెయిలయిన కేసులు కూడా బోలెడున్నాయి. అయినా పెళ్ళయిన ఆడపిల్లకి - తను తల్లయినప్పుడే తనివి తీరుతుందంటారు! అలాంటిది నువ్వందుకు భిన్నంగా ఆలోచించటం విడ్డూరంగా వుంది!"

"అదంతా మీకు తర్వాత చెప్తాను డాక్టర్! ముందు, మీరు నాకో సహాయం చెయ్యండి!"- ఆమె చేయిపట్టుకుని అర్థింపుగా చూస్తూ చెప్పింది అశ్విని.

"ఏం చెయ్యమంటావ్?"

"ఈ విషయాన్ని మా అత్తగారికి తెలియన్వికండి !...ప్లీజ్ !"

"ఏం? ఎందుకనీ?? నువ్వు తల్లివి కావటం ఆవిడకు ఇష్టంలేదా!?" ఆశ్చర్యపోతూ ప్రశ్నించిందామె.

"అదంతా తర్వాత చెప్తానన్నానుగా !"

"కానీ మీ అత్తగారు అమాయకురాలేం కాదు... లోకజ్ఞానం కలిగిన మనిషి ..పైగా ముగ్గురు పిల్లల్ని కన్నతల్లి... ఇప్పుడు డాక్టరుగా నా ధర్మాన్ని నేను నిర్వర్తించ లేకపోయినా, రేపెపుడో రెండు మూడు నెలలు తర్వాత - శారీరకంగా నీలో వచ్చే మార్పుల్ని చూసి ఆవిడ గ్రహించకపోదు.. అపుడు నా పరిస్థితేమిటో ఆలోచించు.."

"అంతవరకూ రానివ్వను.. ఆ పూచీ నాదీ! ప్రస్తుతానికి ఈ గండం గడిచేలా చూడండి. నేను మీ హెల్త్ సెంటరుకి వచ్చి. త్వరలో అన్ని విషయాలూ మాట్లాడతాను!" చెప్పింది అశ్విని.

ఆమె మాటను కాదనలేక పోయింది డాక్టరమ్మ.

"రాత్రి భోజనంలో ఏం తిందోకానీ- సరిగ్గా అరగలేదు. అందుకే కడుపులో తిప్పి వాంతిచేసుకుంది. ఆనక ఆరోగ్యకేంద్రానికి పంపించండి.. ట్యాబ్‌లెట్స్ ఇస్తాను!" అని పార్వతమ్మకు చెప్పి వెళ్లిపోయిందామె.

అప్పటికెలాగో గండం గడిచినందుకు తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది అశ్విని. ఆ రాత్రి శ్రీరామ్ భోజనం చేస్తూంటే -పొద్దున్నే జరిగిన విషయమంతా అతనికి రహస్యంగా చెప్పింది.

అది వింటున్న శ్రీరామ్‌కి తింటున్న అన్నం సహించకుండా పోయింది.

"అలా ఎలా జరిగిందీ?" దిగ్భ్రాంతిగా చూస్తూ అడిగేడు.

"నేను వాడిన పిల్స్ పనిచేయలేదని చెప్పిందా డాక్టరమ్మ! అయినా ఇక దాని గురించి చర్చించుకోవటం అనవసరం. ఇప్పుడు జరగాల్సిందేమిటో ఆలోచించాలి."

ఆమె మనోగతాన్ని అర్థం చేసుకుంటూనే అన్నాడు శ్రీరామ్ -

"కట్టుకున్న భార్య- తనను తండ్రిని చేస్తోందన్న వార్త విన్నాక - ఏ భర్తయినా, తన్మయత్వంతో తలమునకలవుతాడే తప్ప - తలపట్టుకుని కూర్చోడు! కానీ మనింట్లో పరిస్థితి నీకు తెలుసుగా! మా నాన్న అపర ఛండశాసనుడు, మనం నాటకం ఆడి మోసం చేశామని తెలిస్తే ఆయనగారి అహం దెబ్బతింటుంది! ఆయనకి జాతకాలంటే మహాపిచ్చి! ఆఖరికి చిలకజోస్యాన్ని కూడ గుడ్డిగా నమ్మేరకం! దానికితోడు - హార్టు పేషంటు! ఆ స్వామిజీ మాటల్లో యదార్థం ఎంతుందో మనకు తెలీదు కానీ - ఇప్పుడు నీకిలా ప్రెగ్నెన్సీ వచ్చిందని చెప్తే ఆయన గుండె ఆగిపోవటం ఖాయం"అన్నాడు.

భర్త మాటలకు బదులు చెప్పలేక నిస్సహాయంగా చూసింది అశ్విని.

"ఓ పనిచెయ్యి!" అంతలోనే ఒక నిర్ణయానికి వచ్చినట్టుగా అన్నాడతను మళ్లీ.

"ఏం చెయ్యాలో చెప్పు!" అడిగింది.

"మళ్ళీ ఏదో వంకన - మా ఊరెల్లి 'నర్సింగ్‌హోం'లో అబార్షన్ చేయించుకో!"

అతని వైపు తీక్షణంగా చూసింది అశ్విని -

"ఛస్తే చేయించుకోను ! అయినా నాకు నెల తప్పితేనే మావయ్యగారి గుండె ఆగిపోతుందనీ అప్పుడిక అబార్షన్ చేయించుకున్న ప్రయోజనం వుండదనీ - ఆ స్వామిజీ చెప్పాట్ట కదా..! అందుకే ఆ ఆలోచన అనవసరం ..ఏది ఎలా జరగాలని రాసిపెట్టుంటే అలాగే జరుగుతుందని సరిపెట్టుకుందాం... ప్రస్తుతానికి ఈ విషయం ఎవరికీ తెలియకుండా జాగ్రత్తపడదాం.'

"కానీ... ఇది దాచినా దాగని విషయం కదా అశ్వినీ.."

"కావచ్చు... ఈ సంగతి మీ వాళ్లు గ్రహించడానికి ఇంకా సమయం పడుతుందిగా... అంతవరకూ బయట పడద్దంటున్నాను!" చెప్పిందామె ఒక నిశ్చయానికి వచ్చినదానిలా!

* * *

తమ్ముడి పెళ్ళి జరిగిన తర్వాత - మళ్లీ ఆర్నెల్లకు - దసరా పండుగ వంకతో హైదరాబాదునించి, గీత పుట్టింటికి వచ్చింది.

ఈ పండక్కయినా- ఎలాగో అలా మావగారి దగ్గర్నించి తనకు రావాల్సిన కట్నం డబ్బు రాబట్టుకోవాలన్న పట్టుదలతో -ఆమె వెంట రాజేంద్ర కూడా దిగబడ్డాడు.

పండుగ నాలుగురోజులూ ఆడపడుచుతో బాగా కాలక్షేపం చెయ్యవచ్చునని ఆనందించింది అశ్విని. బావగారితో టౌను కెళ్లి కొత్త సినిమాలు చూడచ్చునని ముచ్చటపడ్డాడు లక్ష్మణమూర్తి.

ఆరోజు పొద్దున్న -తొమ్మిది గంటలవేళ- ఉయ్యాలబల్ల మీద కూర్చుని పేపర్లో వారఫలాలు చూసుకుంటున్న వీరభద్రం దగ్గరకు వచ్చాడు రాజేంద్ర.

"మీతో కొంచెం మాట్లాడాలి మావయ్యగారూ!"

"ఏదైనా రహస్యమా?"పేపర్లోంచి తలఎత్తి అల్లుడివైపు సూటిగా చూస్తూ అడిగేడు వీరభద్రం.

అదేక్షణంలో గ్లాసుతో మజ్జిగ తెచ్చి భర్తకు అందించింది పార్వతమ్మ.

"అ.. అబ్బే..ర..రహస్యంకాదండి.. మీరు ముందు...మజ్జిగ పుచ్చుకోండి..తర్వాత మాట్లాడతాను..!" తడబడుతూ చెప్పాడు రాజేంద్ర.

మజ్జిగ తాగేసి ఖాళీగ్లాసు భార్యకిచ్చాడు






వీరభద్రం..

ఆవిడ వంటింట్లోకి వెళ్లిపోయాక.. ఉయ్యాలబల్ల దిగి రాజేంద్ర దగ్గరకు వచ్చి - 'క్లోజప్' లో చూస్తూ అన్నాడు వీరభద్రం.

"అల్లుడూ.. కడు స్వతంత్రుడు ...కనుక మీరు నిర్భయముగా మాట్లాడవచ్చు!"

"మాట్లాడట్టం అంటే... అదీ.. అసలూ... అదే.. నేనామధ్య సంక్రాంతి పండక్కి ఇక్కడకు వచ్చాను కదా..."

"అవును.. అటుపిమ్మట -మీ బావమరిది వివాహమునకు కూడ విచ్చేసితిరి..!"

"వచ్చాననుకోండీ ...కానీ అప్పుడు అడగలేకపోయాను!"

"అడగలేకపోయారూ ?.. ఏమిటీ?.. ఇప్పుడగండీ!" - రాజేంద్రకు ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ అన్నాడు వీరభద్రం..

ఆయనగారి ముఖంలోకి చూనన్తూ అడగటానికి తటపటాయిస్తున్నాడు రాజేంద్ర. ..కొబ్బరినూనె సీసాతో అప్పుడే అక్కడకు వచ్చిన నారాయణ , రాజేంద్ర పడుతున్న అవస్థను గమనించాడు..

"తమిరిలా ఎదురుగా కూసుని - సూటిగా సూత్తే అల్లుడు గోరు ఇంకేం అడుగుతారండి?" అన్నాడు వీరభద్రం తలకు నూనె పట్టిస్తూ ..

"మీరు నోరుముయ్యండి!" మండి పడ్డాడు వీరభద్రం..

అయినా, నారాయణ ఊరుకోలేదు. రాజేంద్రవైపు చూసి, ముసిముసిగా నవ్వుతూ చెప్పాడు -

"బాబూ...! అయ్యగోరి ముకంలోకి సూస్తే ఇట్టాగే నోరు పడిపోతుందని... సెప్పాలనుకున్న ఇసయం సెప్పలేక దిక్కులు సూత్తారండి.. ఒకేల, ధైర్యం సేసి సెప్పాలనుకున్నా - 'రాముడి పెళ్లాం పేరు శూర్పనక' సెప్తారండి..! అందుకనీ -తమరో పని చెయ్యండి .. అయ్యగోరి ముకంలోకి సూడకుండా అటెపు తిరిగేసీ -మీరు సెప్పదల్చుకున్నది సెప్పెయ్యండి!" నారాయణ ఇచ్చిన సలహా రాజేంద్రకు నచ్చింది ..క్షణం ఆలస్యం చేయకుండా ఆచరణలో పెట్టేశాడు...

"మావయ్యగారూ! మా పెళ్లయి మూడేళ్లయిపోయింది... అయినా నాకు రావాల్సిన కట్నం బాకీ , మీరింకా తీర్చలేదు.. ఎప్పుడూ అడిగినా - ఏదో వంక చెప్పి విషయాన్ని దాటేస్తున్నారు! ఈ సారి తాడోపేడో తేల్చుకోవాలని- మీరు పిలవకపోయినా వచ్చాను!.. ఈ పండక్కి నా బాకీ తీరిస్తేనే - మీ అమ్మాయి నాతో తిరిగివస్తుంది.. లేదంటే... మీ ఇంట్లోనే వుండిపోతుంది... ఆలోచించుకోండి.. శలవు!" పక్కకు తిరిగి పాఠం వప్పగించినట్టు చెప్పేసి పక్కగదిలోకి పారిపోయాడు.

అల్లుడు సంధించిన 'శపథాస్త్రం' సూటిగా వచ్చి వీరభద్రం గుండెకు గుచ్చుకున్నట్టయింది. ఏం చేయాలో తోచలేదు.

"అయ్యగోరు! తమరు నాకు ఉరిశిచ్చ ఎయ్యనంటే ఓ సిన్న మాట సెప్తానండి!" తలపై నూనె మర్దన చేస్తున్న నారయణ అన్నాడు.

" చెప్పి అఘోరించు !"

"ఈ రోజుల్లో - కట్నాలు కానుకలూ తీసుకురాలేదని, పెళ్లాల మీద పెట్రోలు పోసి తగలపెడుతున్న మొగుళ్లు ఎంతో మందున్నారండి.. నిన్న రేత్రి, టీవిలో కూడా ఆదేదో 'నేరాలు - గోరాలు' కార్యక్రమంలో సూపించారు కూడానండి!.... కానీ అల్లుడుగోరు మంచోరు కనుక- మూడేళ్లు ఓపిక పట్టారండి.. ఇప్పుడు కూడా మర్యాదగానే అడిగేడు కదండీ?.. అరికివ్వాలిసిన ఆ కట్నం డబ్బు ఇచ్చేస్తే తవరికీ మర్యాదగా వుంటుందండి.. ఏవంటారండీ?"

"తమర్ని నోరుమూసుకోమంటాను!... వనివాడివి, పనివాడిలాగా ప్రవర్తించక- వనికిమాలిన నలహాలిస్తే - వనిలోంచి తొలగిస్తానంటాను!" -నారాయణవైపు కళ్ళెర్ర చేసి చూస్తూ చెప్పాడు వీరభద్రం.

"సిత్తం !.. నేను పనివాణ్ణే అయినా - పాతికేళ్లనుంచీ తమరు నన్ను ఈ ఇంట్లో మడిసిలాగా సూసుకుంటున్నారు! ఆ సనువు తోనే సెప్పానయ్యా... అయినా మీరు పరాయివాళ్లకేం ఇవ్వటంలేదుగా.. సొచ్చాత్తూ మీ అల్లుడి గోరికే! అల్లుడికి డబ్బిస్తే - అమ్మాయిగోరూ కూడా ఆనందపడిపోతారు! అందుకే సెప్పాను.. ఆపైన తమరిట్టం!" అంటూ పెరట్లోకి వెళ్లిపోయాడు నారాయణ.

వీరభద్రం ఆలోచనలో పడ్డాడు...

అల్లుడికి తను బాకీ వడిన మాటే వాస్తవమే..అప్పట్లో పంటలు దెబ్బతినటం వల్ల అనుకున్న మొత్తాన్ని ఇవ్వలేక పోయాడు. కానీ ఇపుడు ఆ బాకీ తీర్చగల స్తోమత తనకుంది!

అయితే, అంతరాత్మ అందుకు అడ్డం పడుతోంది.

తను మండల స్థాయి నించి- జిల్లాస్థాయి మావల సంఘానికి అధ్యక్షుడిగా ఎదిగేడు. 'వరకట్న' నిషేధానికి నడుం బిగించాడు. వారానికోసారి చుట్టుపక్కల గ్రామాలకు వెళ్లి ఉపన్యాసాలిస్తున్నాడు... ఉపదేశాలిస్తున్నాడు... ఉద్యమిస్తున్నాడు... ఉద్యమస్థాయిలో కృషి చేస్తున్నాడు.. వరకట్నం నిషేధపు బిల్లును పటిష్ఠంగా అమలు జరిపేలా చూడవలసిన బాధ్యత గురించి - తమ ఎజెండాలో ఒక అంశంగా చేర్చమంటూ ఆ మధ్య ప్రభుత్వంతోచర్చలు జరపటానికొచ్చిన 'వార్' ప్రతినిధులకు ఒక లేఖ ద్వారా తెలియజేశాడు. ఆనాడు వీరేశలింగం పంతులు, వితంతు వివాహాలు జరిపించినట్టుగా - ఈనాడు కట్నం కానుకలు లేని ఆదర్శ వివాహాలు చేయిస్తున్నాడని తను పేరు తెచ్చుకున్నాడు.

అలాంటప్పుడు - తనే, ఇప్పుడు అల్లుడికి దాసోహమైపోయి - కట్నం డబ్బు అతని చేతిలోపెడితే - రేపెప్పుడైనా ఈ విషయం ఎవరికైనా తెలిస్తే -తనను అందరూ హేళన చేస్తారు. అధ్యక్ష పదవి పోయినా ఫరవాలేదు.. 'రావుబహద్దర్ల' వంశప్రతిష్టే మంట గలిసిపోతుంది.

అందుకే ఆరునూరైనా - నూరు ఆరైనా అల్లుడికి తలవంచకూడదని నిర్ణయించు కున్నాడు.

అంతకుముందు ఓ సందర్భంలో చిదంబరం చెప్పిన సలహాను పాటించి, 'అల్లుడి గండం' నించి బయట వడాలని నిశ్చయించుకున్నాడు వీరభద్రం.

ఆరోజు స్కూల్‌కి వెళ్లాడన్నమాటేగానీ- క్లాసులేవీ తీసుకోకుండా, తన గదిలోనే కూచుని-కార్యాచరణ పథకాన్ని ఎలా అమలు చేయాలో ఆలోచిస్తూండి పోయాడు..

సాయంత్రం స్కూలు వదిలింతర్వాత-బంట్రోతు వీరయ్య క్లాసు గదుల తలుపులన్నింటికీ తాళాలు వేసి వచ్చాడు.

"అయ్యా !... తమరు బయల్దేరితే - ఈ రూమ్‌కి తాళం వేస్తాను!" -అన్నాడు.

"ఎక్కడికి బయల్దేరాలీ?" -అడిగేడు వీరభద్రం అతనివైపు అయోమయంగా చూస్తూ.

"అదేంటి బాబు..!? స్కూలు ఇడిసిపెట్టేశారుగా.. తమరు ఇంటికెళ్ళరా?"

"ఎవరింటికీ?"



ఆ ప్రశ్నవినగానే వీరయ్య ఉలిక్కిపడ్డాడు.

"ఎవరింటికేంటి బాబూ..? తమరింటికే.. అబ్బాయిగోరు ఇందాకనే వెళ్ళిపోయారు. అల్లుడుగోరు వచ్చారంట కదా! ఇద్దరూ కల్సి టౌనుకెళ్లి బట్టలు కొనుక్కుంటారంటా." చెప్పాడు.

"అబ్బాయెవరు ?.. అల్లుడు ఎవరు?".. అర్థం కానివాడిలా చూస్తూ అడిగేడు వీరభద్రం.

"అమ్మాయిగోరూ, అల్లుడూ వచ్చారని తమరు, నిన్న చెప్పారుగా?"

"అమ్మాయా ?- అమ్మాయెవరు?"

"ఓర్నాయనో.. తమరికి ఏదో అయిపోయింది"! -గాభరాపడిపోయి, గుండెలు బాదుకుంటూ- అటుగా వెడుతున్న రంగారావు మేస్టార్ని పిలిచాడు వీరయ్య.

"ఏమైంది వీరయ్యా?" ఖంగారుపడుతూ వచ్చాడు రంగారావు.

"మన హెడ్‌మాస్టరయ్యగోరికి ఏదో అయిపోయింది. సూడండి బాబు" చెప్పాడు దిగులుగా. ఆయనకు అర్థం కాలేదు.

"ఏమైంది సార్ ?" - చేతిలో వున్న ముక్కుపొడుం డబ్బాని లాల్చీ జేబులో వేసుకుంటూ అడిగాడు.

"నాకేం కాలేదు.. మాములుగానే వున్నాను..! ఇంతకీ తమరెవరో తెలుసుకోవచ్చునా?" ఆయనవైపు వింతగా చూస్తూ ప్రశ్నించాడు వీరభద్రం.

ఇపుడు రంగారావు కూడా ఉలిక్కిపడ్డాడు.

"నేనండీ.. రంగారావుని !" చెప్పాడు.

'మీరు .. రంగారావా... మీరు చనిపోయి చాలా సంవత్సరములైందిగా!"

"నేను.. నేను చనిపోవటం ఏమిటండీ? చెట్టంత మనిషిని మీకెదురుగా వచ్చి నిలబడితే?" - తన పాదాల క్రింద నేల కంపించినట్లవుతూంటే- కలవరపడుతూ అడిగాడు.

"ఓః! నా ఎదుట నేవున్నారుకదూ! పొరబడితిని.. మీరు ఎన్వీరంగారావేమో అనుకొంటిని!"

ఆయన ధోరణిని గమనించిన రంగారావు- ఆయనకు మతిభ్రమణం కలిగిందనుకున్నాడు. వీరయ్యను పక్కకు పిలిచి చెప్పాడు-

"మనహెచ్.ఎమ్. గారికి పైత్యం ప్రకోపించి వుండాలి, లేదా... మతి భ్రమించి వుండాలి. త్వరగా ఇంటికి తీసుకెళ్లి దిగబెట్టటం మంచిది!"

"రండిబాబూ ! ఇంటికెడదాం!" అంటూ వీరయ్య-వీరభద్రం చేయి పట్టుకున్నాడు.

"ఎవరింటికీ?" అడిగాడు వీరభద్రం.

"తమరింటికే?"

"మా ఇల్లు ఎక్కడో- నాకు గుర్తుకు రావటంలేదు. మీకు తెలియునా?"

"మాకు తెలుసులెండి.. పదండి వెడదాం!" -అంటూ ఆయన్ని కుర్చీలోంచిలేపి, బయటకు తీసుకొచ్చి -ఇంటివైపు నడిపించాడు రంగారావు.

ఇంటికొచ్చి-భార్యనీ కూతుర్నీ చూసింతర్వాత కూడా వీరభద్రంలో మార్పు రాలేదు.. వీరయ్య ద్వారా.. భర్త ప్రవర్తన గురించి వివరంగా తెలుసుకున్న పార్వతమ్మ అవాక్కయిపోయింది.

"ముఖం కడుక్కుని రండి... టిఫిన్ తిందురుగానీ!" అని పిలిస్తే

"నీళ్ళగది ఎక్కడున్నదీ?" -అని ప్రశ్నించాడు వీరభద్రం.

ఓసారి గుడికివెళ్ళి దైవదర్శనం చేసుకునివస్తే - భర్త పరిస్థితి చక్కబడుతుందన్న ఆలోచనతో-

"గుడికి వెడదాం.. వస్తారా?" అని అడిగింది పార్వతమ్మ.

"ఈ ఊరిలో గుడి ఎక్కడున్నదీ?.. బాగా దూరమా?" - అంటూ ప్రశ్నించాడు. పక్కవీధిలోనే వున్న రాములవారి గుడికి- తన భర్త ధర్మకర్తగా వుంటూ, వారానికి నాలుగురోజులు అక్కడకు వెడుతూ కూడా- అలా అడిగాడంటే - తప్పకుండా మతిభ్రమించే వుండాలనుకుందామె.

భోజనం అయిన తర్వాత -

"పెంద్రాళే పడుకుని నిద్రపోండి"- అంటే

"నాకో తుంగచాపా, దిండూ ఇప్పించండి ..మీ వీధి అరుగుపై విశ్రమిస్తాను!" అన్నాడు.

భర్త ధోరణి గమనించిన పార్వతమ్మ 'ఆయనకు ఏ గాలైనా తగిలిందో, ఎవరైనా చేతబడే చేశారో ' అని భయపడి కూతుర్ని కౌగలించుకుని ఏడ్చేసింది. మరికాసేపటికి టౌన్నించి తిరిగొచ్చిన కొడుక్కీ, అల్లుడికీ -జరిగిన విషయమంతా చెప్పి- మళ్ళీ బావురుమంది.

మర్నాడు పొద్దున్నే -శ్రీరామ్, రాజేంద్రలు, వీరభద్రాన్ని ఆరోగ్యకేంద్రానికి తీసుకెళ్లి డాక్టరుకి చూపించాడు. ఆయన ఏవేవో పరీక్షలు చేసి- శారీరకంగా ఎలాంటి అనారోగ్యమూ లేదని తేల్చిచెప్పాడు. ఆ విధమైన మతిభ్రమణానికి, మానసిక రుగ్మత ఏదైనా కారణం కావచ్చుననీ- హైదరాబాద్ తీసుకెళ్లి- మెంటల్ హాస్పిటల్లో వుండే మానసిక వైద్యనిపుణుల చేత పరీక్ష చేయిస్తే మంచిదనీ సలహా ఇచ్చాడు..

* * *

ఆ మర్నాడే అందరూ కలిసి హైదరాబాద్ చేరుకుని రాజేంద్ర ఇంటికి వచ్చారు.

"ఇది ఎవరి గృహము?"-టాక్సీ దిగి లోపలకు వస్తూ - పక్కనున్న పార్వతమ్మను ప్రశ్నించాడు వీరభద్రం.

"అమ్మాయిగారిల్లు! దాని పెళ్లయ్యాక మనం ఇక్కడికి మూడుసార్లు వచ్చాం. గుర్తులేదా?"-

గుర్తుచేసుకున్న వాడిలా బుర్రగోక్కుంటూ వెర్రిచూపులు చూస్తూండిపోయాడు వీరభద్రం.

తాళికట్టిన భార్యనీ, రక్తం పంచుకు పుట్టిన పిల్లల్నీ కూడా గుర్తుపట్టలేకపోతున్న వీరభద్రం పరిస్థితి గమనించిన రాజేంద్ర బేజారైపోయాడు.

"ఇంత మతిమాలిన మనిషి ఇక నా కట్నం బాకీ ఎలా తీరుస్తాడూ?"-భార్యను పక్కకు పిలిచి రహస్యంగా అడిగాడు.

**-(ఇంకావుంది)**




సంగీత సాహిత్యాలకు పెద్ద పీట వేసే తత్త్వంగల విజయావారి చిత్రాలలో

# జగదేకవీరుని కథ

కి గల స్థానం ప్రత్యేకం. అందుకు గత రెండు సంచికలుగా విశ్లేషిస్తున్న పాటలకు తోడుగా
ఈ సంచికలో మరో మూడు పాటలు...

అతడు : ఆశా ఏ కాశా నీ నీడను మేడలు కట్టేశా ॥ఆశా॥
ఆమె : చింతలో రెండు చింతలో
నాచెంత కాదు నీ తంతులు.. ఓయ్.. ॥చింతలో॥
అతడు : ఓ.. ఓ.. ఓ... ఓయ్...
వద్దంటే కాదె ముద్దుల బాలా
ప్రేమ పరగణా రాసేశా ॥ఒద్దంటే॥
నిన్ను రాణిగా... నిన్ను రాణిగా చేసేశా
చేతులు జోడించి మ్రొక్కేశా.... ఆశా... ॥ఆశా॥
ఆమె : ఓ.. ఓ.. ఓ... ఓయ్...
కోశావు లేవోయి కోతలు
చాలా చూశానులే నీ చేతలు ॥కోశావు॥
రాజు ఉన్నాడూ - రాజు ఉన్నాడు
మంత్రి ఉన్నాడు సాగవు సాగవు
నీ గంతులు.. చింతలూ ॥చింతలూ॥
అతడు : రాజా... మంత్రా... ఎవరూ? ఎక్కడా?
తా తరికిట తా తరికిట తళాంగు తక ధా
ర్రాజు గారి బూజు దులిపేస్తా
మ్మంత్రిగారి చర్మం వొలిచేస్తా ॥రాజు॥
కోటలో పాగా... కోటలో పాగా వేసేస్తా
గట్టిగ నీ చెయ్యి పట్టేస్తా... ఆశా... ॥ఆశా॥






ఈ పాటను ఘంటసాల, స్వర్ణలత ఆలపించగా రేలంగి, గిరిజ అభినయించారు. రాజనాల, సి. యస్.ఆర్..కూడా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఎక్కువగా మధ్యమావతి రాగంలోనూ అప్పుడప్పుడు శ్రీరాగం ఛాయలలోనూ సంచరించిన ఈ గీతంలో హాస్యరస స్పర్శతో పాటు మధ్యమావతి

రాగాన్ని సాధన చేయాలనుకునే వారికి కావలసినంత విషయం ఉంది. ఈ హాస్యగీతాన్ని నేడు వస్తున్న హీరో హీరోయిన్ల యుగళగీతాల ముందు పెట్టి వింటే ఏవి అపహాస్యం పాలవుతాయో తిరిగి వివరించి చెప్పనవసరంలేదు. ఒకే ఒక ఆశ ఉండే గిరిజకు 'ఏకాశ' అని, రెండే రెండు కోరికలుండే రేలంగికి 'రెండు చింతలు' అని పేర్లు పెట్టడంతో పాటు వాటిని పాటలో ఇరికించడం, ప్రేమపరగణా లాంటి ప్రయోగం- ఇవన్నీ పింగళి చమత్కారానికి అద్దంపడతాయి. హాస్యగీతాలు పాడేటప్పుడు ఘంటసాల ఇచ్చే ఝలక్‌లు కొన్ని ప్రత్యేకంగా ఉంటాయి. పల్లవిని చేరుకోవడానికి చరణాంతాలలో వచ్చే 'ఆశా..'దగ్గర ఇచ్చే గమకాల్లాంటి గిరికీలు, "రాజుగారి బూజు దులిపేస్తా, మంత్రిగారి చర్మం ఒలిచేస్తా" అనే వాక్యాలు మొదటి సారి అంటున్నప్పుడు ముక్కుతో పాడినట్టుగా నాజల్ ఎఫెక్ట్‌తో ఒత్తిమరీ పాడడం లాంటివి ఆ ఝలక్‌లలో కొన్ని.

ఆ...ఆ....ఆ...ఆ..

అతడు : మనోహరముగా మధుర మధురముగ -
మనసులు కలిసెనులే
ఆమె : మమతలు వెలసెనులే ॥మనో॥
అతడు : ఇది చంద్రుని మహిమేలే - అదంతేలే సరేలే -
మనకిది మంచిదిలే ॥ఇది॥
ఆమె : మంచిది యైనా కొంచెమైనా వంచన నీదేలే
అయినా - మంచిదిలే ॥మనో॥
అతడు : ఇది మోహన మంత్రమేలే - అదంతేలే సరేలే -
మనకిది మేలేలే ॥ఇది॥
ఆమె : మేలే అయినా మాలిమైనా - జాలము నీదేలే
అయినా మేలేలే....... ॥మనో॥



ఈ పాటను ఘంటసాల, సుశీల ఆలపించగా ఎన్.టి.రామారావు, బి.సరోజాదేవి, యల్.విజయలక్ష్మిపై చిత్రీకరించారు. ఈ చిత్రంలో ఎన్.టి.ఆర్.కి గల యుగళ గీతాలు రెండు. ఐనదేమో ఐనదీ పాట మొదటిదయితే ఇది రెండవది. నిజానికి ఐనదేమో ఐనది పాటకు జనాకర్షణ శక్తి ఎక్కువ. మరి ఈ పాట కూడా గుర్తుండి పోవాలంటే ఈ పాటవల్ల కథకు ఓ ప్రయోజనం ఉండితీరాలి. కథ ప్రకారం ఎన్.టి.ఆర్ ను పెళ్ళాడిన బి.సరోజాదేవి, యల్. విజయలక్ష్మి-మీరు నా గానమునే వినవలెను, మీరు నా నాట్యమునే చూడవలెను -అంటూ ఇరకాటంలో పెట్టేస్తారు. ఆ ఇబ్బంది నుండి బైటపడడానికి బి.సరోజాదేవి అతనికి 'ఓం ఏకోనేకో హమస్మి' అనే మంత్రాన్ని ఉపదేశిస్తుంది. ఆ మంత్రభావంతో అతడు ఇద్దరుగా మారి అటు బి.సరోజాదేవి మందిరంలో ఆమె గానాన్ని వింటాడు. ఇటు ఎల్.విజయలక్ష్మి మందిరంలో ఆమె నాట్యాన్ని చూడ గలుగుతాడు. పతాక సన్నివేశంలో ఆ మంత్ర ప్రభావంతోనే అయిదుగురిగా మారి ఒకేసారి 4 వాద్యాలను వాయిస్తూ 'శివశంకరీ' పాటను ఆలపించి దేవతానుగ్రహ పాత్రుడవుతాడు. అలా అతడిని ఆదుకునే ఆ మంత్రాన్నివ్వడానికి ఓ బలమైన కారణం, అందుకు అనువైన సన్నివేశం, పాటతో ముడిపడి ఉండేట్టు తీర్చిదిద్దటం వల్ల సన్నివేశం ప్రాధాన్యంగా ఈ పాటకూడా ప్రేక్షక శ్రోతల మన్ననలను అందుకోగలిగింది. ఈ పాటను ప్రత్యేకించి ఒక రాగానికి చెందేట్టు - రాగ ప్రాధాన్యగీతంగా మలచలేదు పెండ్యాల. కేవలం మనోధర్మంతో మలచుకుంటూపోయేరు. పాటలో సాహిత్యపరంగా చిలిపితనం ఉంది. చమత్కారం ఉంది. వాటినివిప్పి చెప్పడం కన్న ఎవరి అనుభవానికి వార్ని ఒదిలేస్తే మంచిది. అలిగిన ప్రియురాలిని మచ్చిక చేసుకునే ప్రియుడు, ఆ సన్నివేశాన్ని తనకు అనువుగా మలచుకుంటే, అది గ్రహించిన ప్రియురాలు 'నీ సంగతి తెలుసులే' అన్నట్టు కౌంటర్ ఇస్తూనే కరిగిపోవటం ఇవన్నీ ఎవరికివారు తమ తమ అనుభవాలను నెమరు వేసుకుంటూ పాట సాహిత్యంతో బేరీజు వేసుకుంటే పింగళివారి మీద గౌరవం రెట్టింపవుతుంది. ఆయన బ్రహ్మాచారి అనే విషయం ఈ సందర్భంగా మరోసారి గుర్తుచేసుకుంటే ఆ గౌరవం ఆరాధనగా కూడా మారుతుంది. సృజనాత్మకతకు, భావుకతకు ప్రత్యక్షానుభవం అవసరం లేదనిపిస్తుంది.

ఆదిలక్ష్మి వంటి అత్తగారివమ్మ ॥2॥
సేవలంది మాకు వరములీయవమ్మ ॥2॥ ॥ఆది॥
జయంతి : కలుగునే మీ వంటి సాధ్వి అత్తగా మాకు
తొలి మేము చేసిన పుణ్యమున గాక
నాగిని : మందార మాలతీ పారిజాతాలతో
అందముగ ముడివేసి అలరజేసేము ॥ఆది॥
జయంతి : మనసు చల్లన కాగ మంచిగంధము పూసి
మా ముచ్చటలు తీర్ప మనవి చేసేము
మరీచి : పారాణి వెలయించి పాదపూజను చేసే
వారుణి : కోరికలు తీరునని పొంగిపోయేము ॥ఆది॥





ఈ పాటను లీల, సుశీల ఆలపించగా బి.సరోజాదేవి, యల్.విజయలక్ష్మి,జయంతి, బాల, ఋష్యేంద్రమణిపై చిత్రీకరించారు. తెలుగు సినీ చరిత్రలో తల్లిమీద, తండ్రిమీద, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లమీద పొగుడుతూ వున్న పాటలు చాలానే ఉన్నాయి. అయితే అత్తగారిని పొగుడుతూ ఉన్న పాటలెన్ని అనే ప్రశ్న గనకవస్తే ఈ పాట స్ఫురణకు వచ్చినంత త్వరగా మరో పాటకు అవకాశం చిక్కదు. అందుకు పింగళికి ప్రథమ తాంబూలం ఇచ్చి తీరవలసినదే ! ఈ పాటకు పీలూ రాగం ఆధారం. పీలూ రాగంపై పెండ్యాలకున్న మక్కువ, పట్టు చాలా ఎక్కువని - 'పరువు ప్రతిష్ట' లోని ప్రభుగిరిధారి శౌరీ రావయా, 'మహాకవి కాళిదాసు' లోని ఎందుకు వేసిన వేషమయా, 'శ్రీ కృష్ణార్జున యుద్ధం' లోని 'నీకై వేచితినయ్యా ఓ ఏకాంత రామయ్యా' - మొదలైన పాటలు నిరూపిస్తాయి. విచిత్రం ఏమిటంటే పీలూ రాగానికి ప్రామాణిక సినీగీతాలను పేర్కొనవలసి వస్తే ఈ పాటలను మినహాయించటం కుదరదు. 'జగదేకవీరుని కథ' చిత్రంలోని ఈ 'ఆదిలక్ష్మి' వంటి పాట ద్వారా ఆ రాగం సుసంపన్నమైంది.

**ఘంటసాల వారి స్వర జీవితంలో ప్రతిష్ఠాత్మక గీతంగా నిలిచిపోయిన 'శివశంకరీ' పాట గురించి వచ్చే సంచికలో స్వరాలతో సహా.....**



నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## సైకిళ్ల మీద కోతులు

"రౌడీరాముడు - కొంటెకిష్టుడు" సినిమా తీశారు యన్.టి.రామారావు. అందులోని ఒక సన్నివేశం హైద్రాబాదు సెంట్రల్ జైల్లో తీశారు. ఖైదీలు లంకాదహనం నాటకం వెయ్యడం, కథప్రకారం నిజంగా దహనం జరగడంతో ఆ వేషాల్లోనే కొందరు ఖైదీలు తప్పించుకుని పారిపోడం- లాంటి ఘట్టాలు తీశారు. రామారావు రావణుడి వేషంలో తప్పించుకోగా, కొందరు కమేడియన్లు కోతుల వేషాల్లో తప్పించుకుంటారు. ఆ కోతులు -చిట్టిబాబు, మోదుకూరి సత్యం, రాంబాబు, పొట్టిప్రసాద్, సారథి ఇత్యాదులు.

వీళ్లు సైకిళ్ల మీద పారిపోతారు - కోతుల వేషాల్లోనే. కోతిమూతులు, తోకలు, పైన చొక్కాల్లేకుండా సైకిళ్లు తొక్కుతుంటే,జనానికి ఫన్నీగా వుంది. తర్వాత, రవీంద్రభారతి దగ్గర కొన్ని సైకిలు షాట్లు తీశారు. అక్కడయిపోయిన తర్వాత 'బ్రదర్స్ - మీరందరూ అలాగే సైకిళ్ల మీద రామకృష్ణా స్టూడియోస్‌కి వచ్చేయండి. దార్లో షాట్స్ తీసుకుంటూ వస్తారు దర్శకుడు కె.రాఘవేంద్రరావు" అని చెప్పి బయల్దేరారు యన్.టి.ఆర్.!

ఈ కోతివేషాల్లో వాళ్లంతా సైకిళ్లు తొక్కడం చూస్తూ జనం ఒకటే నవ్వు! వెనకాల పోలీసులు కూడా వున్నారు- వాన్‌లో. ఎండ పైన పేలుస్తోంది. కోతితోకలు సైకిలు సీట్ల మీద నిలవడంలేదు. వాటితో తొక్కడం, నోళ్లు నొక్కేసిన కోతి మూతులతో ఎండలో తొక్కడం- తొక్కలేక తొక్కడాలతో కపివేషధారులు అవస్థ పడ్డారు. కొంత దూరం వెళ్లాక, పొట్టిప్రసాద్ తొక్కలేక - అలా అంటే బాగుండదని, శోషవచ్చినట్టు రోడ్డు మీద పడిపోయాడు. అప్పటికి తియ్యవలసిన షాట్స్ అయిపోయినాయి.

రామకృష్ణా స్టూడియోస్ రోడ్డులో తియ్యాలి. వెనకాల వస్తున్న ప్రొడక్షన్ వ్యాన్ ఆగి, పొట్టి ప్రసాద్‌నీ, అతని సైకిల్‌నీ ఎక్కించుకుని సాగిపోతే, తక్కిన వాళ్లు "ప్రసాద్ గాడు తెలివైనవాడ్రా" అని అభినందించారు. మూర్ఛపోయిన పొట్టిప్రసాద్‌ని స్టూడియోలో దింపి- నీళ్లుచల్లి, నీళ్లు తాగించి- షోడశోపచారాలు చేశారు.

ఈలోపల సైకిలారూఢులైన ఒక్కొక్క వానరుడూ, నెమ్మదిగా నిదానంగా చేరసాగారు. పొట్టి ప్రసాద్‌ని చూసి, తక్కినవాళ్లు నవ్వుకుంటూ వుంటే రామారావుగారికి అర్థమైపోయింది. "ఓహో... ఇలాంటి నాటకం ఆడావా నువ్వు..!... పద, ఆసుపత్రికి తీసుకెళ్తాను" అంటూ ఆయన కూడా నవ్వడం మొదలు పెట్టారు - పొట్టి ప్రసాద్ ఏడుపుమొహం పెట్టగా మూతులు తీసేసిన కోతులు మళ్లీ కిచకిచమని నవ్వాయి!

❖ ❖ ❖

## అంబులెన్స్ చేసిన మేలు

ఒక ఆంగ్ల సినిమా ఆధారంగా, కొన్నేళ్ల క్రితం రెండు సినిమాలు మొదలైనాయి. పాప ప్రధాన పాత్రగా ఆ కథ నడుస్తుంది. పేరేం పెట్టారోగాని, ఒక సినిమా విడుదలైంది - రెండోది తొలికాపీ వరకూ వచ్చి ఆగిపోయింది. ఈ సినిమా నెల్లూరులో తీశారు. గోపిభీమ్‌సింగ్ దర్శకుడు. నేనూ ఆ సినిమాలో వేషం కట్టాను.

అక్కడ షూటింగ్ జరుగుతూవుండగా, ఏదో కారణం మీదపడి, 'నెల్లూరు బంద్' ఏర్పడింది ఓరోజు. ఆరోజు నేను, ఇద్దరు ముగ్గురు నటీనటులూ మద్రాసు బయల్దేరాలి. ఎలా బయల్దేరడం? ఊరంతా బంద్! రైళ్లు నడుస్తూన్నాయిగాని, బస్సుల్లాంటివాహనాలేవీ నడడవడం లేదు. కార్లూ ఆపేస్తున్నారు. రైల్వే స్టేషన్‌కి వెళ్లాలి. ఏ మార్గం గుండా వెళ్లినా కార్లు ఆపేస్తారు. అందులోనూ తెలిసిన "సినిమా మొహాలు" వుంటే ఇంకా ఇబ్బంది. కాని, వెళ్లితీరాలి.. ఎలా? నా బుర్రకి ఒక ఐడియా దొరికింది. ఇది ప్రొడక్షన్ వాళ్లకి చెబితే ఫలిస్తుందా?

అలా తటాపటాయిస్తునే మేనేజర్‌తో అన్నాను."ఏ ఆసుపత్రి నుంచైనా, అంబులెన్స్ తెప్పించగలరా?" అని. "ఎందుకూ? ఎవరికేం జరిగింది?" అన్నాడు మేనేజరు. "..గలరా?" "చెప్పండి"

"మీరు పిలిపిస్తే మేం నలుగురం అందులో ఎక్కి - రైల్వే స్టేషన్‌కి వెళ్లిపోతాం. అంబులెన్స్ ఆపరుగదా" అన్నాను. నా బుర్రలో మట్టితోపాటు కాస్త చురుకుదనం కూడా వుందని గ్రహించినవాడై -అతనూ చురుక్కుమని 'భేష్' అన్నాడు. ఇరవైనిమిషాల్లో మేం రెడీ, వ్యాధిగ్రస్తుల వాహనం కూడా రెడీ. గుట్టు చప్పుడు కాకుండా వాహనంలో దూరి, తలుపులు మూసి కూచున్నాం.

"గంయ్ గంయ్ గంయ్" మని కొమ్ము (హారన్) కొడుతూ అంబులెన్స్ ఐదునిమిషాల్లో ఖాళీరోడ్డు కూడా గనక, స్టేషన్ చేరుకుంది. మరొక ఐదునిమిషాల్లో స్టేషన్ ప్లాట్‌ఫారం మీద పడి - "హమ్మయ్య" అనుకున్నాం అందరం- చేసిన సాహసానికి పకపకా నవ్వేసుకుంటూ. మా సాహసం విన్న దర్శకుడు, బృందం కూడా అక్కడ గలగలా నవ్వినట్టు - ఆ తర్వాత వార్తలు అందాయి.

❖ ❖ ❖

## అదే, ఆరుద్రీయం!

బాపురమణల సినిమా 'గోరంతదీపం' -తీస్తున్నపుడు- "నాలుగురీళ్ల ఎడిటెడ్ వెర్షన్ సిద్ధమైంది, చూద్దాం" అని నన్నూ పిలిచారు. వాళ్లతోపాటు ఆరుద్రగారు, ఎమ్వీఎల్, నేను వున్నాం.

సుభాషిణి అని, ప్రివ్యూ థియేటర్ వుండేది మద్రాసులో! అక్కడికి వెళ్లాం. కరెంటు లేదు. కొంతసేపు నిరీక్షించగా, జెనరేటర్ వేశారు. అదీ, కరంట్ స్నేహితురాలేకదా, పనిచెయ్యలేదు.

"పక్కనే ఇంకో థియేటర్ వుంది. అక్కడ జనరేటర్ వేస్తారు పోదాం" అన్నారు రమణగారు.

వెంటనే ఆరుద్రగారు- "అది సజ్జనరేటరో, దుర్జనరేటరో" అని చమత్కరించారు-అందర్నీ నవ్వుల్లో ముంచేస్తూ!

అలాగే ఓసారి ఎగ్మూర్ వేపు వెళ్లాం. ఎవరెవరు కార్లో వున్నారో గుర్తులేదుగాని, ఆరుద్రగారున్నారు - ఎంచేతంటే ఆయన రువ్విన చమత్కార బాణం గుర్తుందిగనక! ఓ దగ్గర కాఫీ తాగాలనుకున్నాం. తాగబోతూ వుండగానే -దాని రంగు బయటపడి, ఓ చుక్క గుక్కవెయ్యగానే "దరిద్రం" అనిపించింది. కప్పులు 'డౌన్' చేశాం.

"దగ్గర్లో నే అట్లాంటిక్ హోటలుంది. అక్కడ కాఫీ బాగుండవచ్చు. వెళదామా?" అన్నాను.

వెంటనే ఆరుద్రగారు, "ఏమో, అది ఎట్లాంటిక్ హోటలో ఏమిటో, వద్దులెండి" అన్నారు కాఫీ కంటే ఫ్లావర్‌తో వున్న చమత్కారంతో!

❖ ❖ ❖

## కొత్త అవార్డ్?

ఈమధ్య ఉత్తమ చిత్రాలకి, ఉత్తములకీ ప్రభుత్వం "నంది అవార్డులు" అందజేసింది. హీరోలకీ, హీరోయిన్లకీ ఇచ్చారు, వాళ్లకి పాడినవాళ్లకీ, డబ్బింగ్ చెప్పినవాళ్లకీ ఇచ్చారు. హీరోయిన్‌గా భూమికకు ఇచ్చినపుడు ఒకాయన "ఆమెకూ ఇచ్చారు. ఆమె పాడలేదు, మాట చెప్పలేదు. అలా అందరికీ ఇస్తున్నప్పుడు - డూప్స్‌కి మాత్రం ఎందుకివ్వరు? హీరోలకి ఫైట్స్‌లో సహకరించే డూప్స్ వుంటారు; హీరోయిన్లు రాకపోతే లాంగ్‌షాట్స్‌లో డూప్స్ నటిస్తారు. వాళ్లు పరుగెత్తవలసివస్తే డూప్స్! స్విమ్మింగ్ పూల్స్‌లో దూకవలసివస్తే డూప్స్! మరి, వీళ్లూ వాళ్లకి పేరు తెస్తున్న వాళ్లేకదా. అంచేత డూప్స్‌కి కూడా ఒక అవార్డ్ అందజేస్తే బావుంటుంది" అన్నారట అవార్డ్స్ కమిటీ చైర్మన్ గుమ్మడిగారితో, ఆయన నవ్వుతూండగా!

❖ ❖ ❖

## 'సం'గీతా రహస్యాలు

1952లో 'జాల్' అని హిందీ సినిమా వచ్చింది. గురుదత్ తీశాడు. యస్.డి.బర్మన్ సంగీత దర్శకుడు. అందులో "ఎ రాత్ ఎ చాందినీ ఫిర్ కహా - సున్ జా దిల్ కి దాస్తా" అని, హేమంత్ కుమార్ పాడిన పాట పాప్యులరయిన పాట. అదేపాట వరసని రోహిణివారు, 'ప్రతిజ్ఞ' (1953, నాయకుడిగా కాంతారావు తొలి చిత్రం)లో యథాతథంగా వాడారు. కళ్యాణం పాండురంగ సంగీత దర్శకుడు. ఆపాటని ఎ.ఎమ్.రాజా పాడారు.



రాజశ్రీ పొడక్షన్ వారు (సుందర్‌లాల్ నహాతా, తాతినేని ప్రకాశరావు) "జయంమనదే" (1956)ఆరంభిస్తూ అదే 'జాల్'పాట వరసని కాపీ చెయ్యమని సంగీత దర్శకుడు ఘంటసాలతో అన్నారు. కుదరకపోతే తప్ప ఘంటసాల, కాపీ చెయ్యరు. అయితే, దర్శక నిర్మాతల మాట మరీ కొట్టి పారేసినట్టుగా కాకుండా, "అదే మీటర్‌లో, స్థాయిలో అంతకంటె బాగా వుండేలా పాట చేస్తాను" అని, "ఓ చందమామా, అందాల భామ ఎందున్నదో తెల్పుమా" పాటకి వరస చేసి వినిపించారు.

'జాల్' పాటకీ, ఈ పాటకీ ఎత్తుబడిలో ఏమీ సంబంధం వుండదుగాని, "సున్ జా దిల్ కి దాస్తా" దగ్గర మాత్రం "ఎందున్నదో తెల్పుమా" కలుస్తుంది. "ఓ చందమామా" పాట పుట్టుక అలా జరిగింది.

- ఆర్కే

## సైకిలుమోత

"ప్రైవేట్ మాస్టార్"(1967)లో నేను పోస్ట్‌మాస్టారును (పోస్ట్‌మార్టమ్, పోస్ట్ ప్రొడక్షన్‌లాగా, మాస్టారు ఉద్యోగం అయిపోయిన తర్వాత అన్న అర్థంలో కాదు - పోస్ట్ ఆఫీస్ మాస్టారు -అని గమనించవలెను) ఈ పోస్ట్ మాస్టారు ఆ గ్రామంలో అందరికీ పరిచితుడు. అందరి విషయాలూ తెలిసినవాడు. అంచేత, వాళ్ల వాళ్లకొచ్చిన ఉత్తరాలు, మనియార్డర్లూ అన్నీ తనే ముందుగా చదివేసి, వాళ్లకి తనే అవి బట్వాడా చేస్తూ వాటిలో విషయాల్ని చెప్తుస్తూ పైగా వ్యాఖ్యానిస్తాడు కూడా.

అలాంటి పాత్ర అది. (రచన: ముళ్లపూడి వెంకటరమణ, దర్శకత్వం: కె.విశ్వనాథ్) ఆ పాత్ర మొదటిసారిగా సినిమాలో కనిపించినపుడు, కొత్తసైకిలు మోసుకుంటూ వెళ్తూ కనిపిస్తాడు- ఉత్తరాలకట్ట ఓ చంకలో పెట్టుకుని మోస్తూ ...

"ఇదేమిటి మాస్టారూ! సైకిలు ఎక్కకుండా తొక్కకుండా మీరు దాన్ని మోసుకెళ్తున్నారేమిటి?" అని ఒకడు అడుగుతాడు. దానికా పోస్ట్‌మాస్టారు-" నాయనా ఇదికొత్త సైకిలు. దారంతా ముళ్లడొంకలూ... టైర్లు పంచరయిపోతే కష్టంగదా. కొత్త సైకిలుగదా. అందుకని మోసుకుపోతున్నాను" అంటాడు.

ఆ షాటు అయిపోయింది. ప్రొడక్షన్ బాయ్-నా దగ్గర్నుంచి సైకిలు తీసుకుని, తను మోసుకుంటూ, ఆ అవుట్‌డోర్‌లో మాకు ఇచ్చిన బసవరకూ వెళ్లాడు- భుజాన కావడిలా వేసుకుని. అక్కడికి చేరిన తర్వాత నేను అతన్ని అడిగాను- "నేనేదో షాటు కోసం మోశాను. నువ్వెందుకయ్యా ఇంత దూరం మోసుకొచ్చావు? రోడ్డు ఇక్కడ బాగానే వుందిగా- తొక్కవచ్చుగా" అని.

"మీరనన్నట్టే కొత్త టైర్లు - మాసిపోతాయి, పాడయిపోతాయి, ఎంచేతంటే, ఈ కొత్తసైకిలును 'ఎలా వున్నదాన్ని అలా వప్పజెబుతాం' అన్న కండిషన్‌తో షాపునుంచి అద్దెకి తీసుకొచ్చాం. అంచేత ఎంతదూరమైనా మొయ్యాలి. టైర్లు మాసిపోతే ఎలా? వాడు అమ్ముకోవాలిగదా" అన్నాడు ప్రొడక్షన్ బాయ్. ఉన్నగుట్టురట్టు చేస్తూ!

పైగా రహస్యంగా ఇంకోమాట కూడా అన్నాడు - "బడ్జెట్ సినిమాలు ఇలాగే వుండాలి సార్, ఒక్క షాటుకోసం కొత్త సైకిలు కొంటే బడ్జెట్ పెరిగి పోతుందికదా!"

●



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

| | |
|---|---|
| **రచన** | : దాశరథి |
| **గానం** | : ఘంటసాల, పి.లీల |
| **సంగీతం** | : ఘంటసాల |
| **రాగం** | : తిలంగ్ (హిందుస్తాని రాగం) |
| **తాళం** | : ఖండచాపు (కర్ణాటక సం॥) -ఝుప్‌తాల్ (హిందుస్తాని సం॥) |
| **ఆరోహణ** | : సగమపనిస |
| **అవరోహణ** | : సనిపమగమగస |

షడ్జము, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, కాకలినిషాదం ఆరోహణలోను, కైశికినిషాదం, పంచమం, శుద్ధమధ్యమం, అంతరగాంధారం, అవరోహణలోను పైన చూపబడిన క్రమంలో ఉపయోగించబడే స్వరాలు.

**ల**లిత సంగీతంలో యీ రాగాన్ని వినియోగించేటప్పుడు చతుశృతి రిషభాన్ని కూడా తరచూ వాడడం జరుగుతూంటుంది. ఈ రాగం హిందుస్తాని శాస్త్రీయ, లలిత శాస్త్రీయ, రంగస్థల సంగీతాలలో బాగా ప్రాచుర్యాన్ని పొందినది. లలిత సంగీతంలో కూడా యీ రాగం వాడుకలో వున్నదే. హిందుస్తాని సంగీతంలో మహా విద్వాంసులుగా పేరుగాంచిన పండిత్ విష్ణుదిగంబర్ పలూస్కర్ ఎంతో మంది శిష్యులను తయారుచేశారు. వారిలో వినాయక్ రావ్ పట్‌వర్ధన్, నారాయణరావ్ వ్యాస్ ప్రముఖులు. క్రితం శతాబ్దిలో అనగా 1930 దశకంలో తిలంగ్ రాగంలో నారాయణ్‌రావ్ వ్యాస్ పాడిన 'శ్యామసుందర్ మదన్‌మోహన్' అనే భజన్ గ్రామఫోను రికార్డుగా వెలువడి దేశమంతా మారుమోగింది. ఆ భజన్‌ను స్ఫూర్తిగా చేసుకుని సాలూరు రాజేశ్వరరావు 1935లో "దీనావనుడనే" అనే గీతాన్ని పాడారు ఒక చిత్రంలో. లలిత సంగీతంలో తిలంగ్ రాగాన్ని ఉపయోగించి

## వెలిగించవే చిన్న వలపు దీపం

ఘంట: వెలిగించవే చిన్ని వలపుదీపం
ఎందుకే నామీద యింతకోపం
లీల: మనసులో ప్రణయమే కనకదీపం
దాని వెలిగించుకోకున్నపాపం
ఘంట: నీమోముపై కుంకుమే నాకుదీపం
అది చూచినంతనే కలిగేనుతాపం
వెలిగించవే చిన్ని వలపుదీపం
చ॥లీల: నీ కనులలోననే నిలిచెనేదీపం
ఆ దీపమున్నదే నాకేమిలోపం
ఘంట: గగనంపు మేడలో కలదులేదీపం
అది మలగి పోయెనా అవనికేశాపం
వెలిగించవే చిన్ని వలపుదీపం
చ॥లీల: తారకానవదీప తోరణాలవిగో
జగతిలో వెలుగుకే కారణాలవిగో
ఘంట: ఎదలోన అనురాగ మెనయుటే దీపం
ఆ దీపమున్నచో నాకేమిలోపం
వెలిగించవే చిన్ని వలపుదీపం

స్వరకర్తలు చాలా మంది మధురమైన పాటలు మన కందించారు. రజనిగారు స్వరపరచిన "స్వతంత్ర భారతజనని నీకిదె నితాంత నవనీరాజనము" అనే గీతం ఆకాశవాణిలో చాలా ప్రాచుర్యాన్ని పొందినది.

ఈ ప్రపంచాన్ని వెలిగించేది, సంసార బంధంలో కట్టి పడేసేది, ఆత్మీయతా రూపంలో


ఘంటసాల

ఆనందాంబుధిలో ముంచి తేల్చేది ప్రేమ. ప్రేమ ఒక వెలుగు. మానవజీవనం ఆశావహం చేసి ముందుకు నడుపుతుంది. ఆనందమయం చేసి అంతులేని తృప్తిని అందిస్తుంది. అలాంటి ప్రేమను గురించి దాశరథి గారి కలం నుండి వెలువడిన మధుర స్రవంతి 'వెలిగించవే చిన్న వలపు దీపం' అన్న యీ యుగళగీతం. మనసులో ప్రేమ దీపం వెలగకపోతే బ్రతుకు పాప పంకిలమౌతుంది. తన హృదయంలో ప్రేమ దీపం వెలిగించుకున్న ప్రియుని కళ్ళకు ప్రేయసి నుదుటి కుంకుమదీపం అంటారు కవి. ఎంత చక్కని భావన! ఆ కుంకుమ చూచితే కలుగును తాపం. ఆ తాపమేమిటో అనుభవజ్ఞు లెరుగనిది కాదు. ప్రియుని కన్నుల వెలిగే అనుంగు దీపమే ఆమెకు సర్వస్వము. ఇరుహృదయాల అనురాగ దీపాలు వెలిగితే తారా తోరణాల నడుమ పున్నమ జాబిలి వెన్నెలే కదా లోకమంతా.

అనుభవైక వేద్యమైన అద్భుత ప్రణయగీతమిది. తిలంగ్ రాగంలో చక్కని లలితగీతంగా ఘంటసాల మృదుమధురమైన సంగీతాన్ని కూర్చారు. ఆ గీతాన్ని లలితమైన, సురుచిరమైన భావ పరీమళాలనలది అద్భుతంగా గానం చేశారు ఘంటసాల, శ్రీమతి లీల.

డిసెంబర్ 4, 2004న ఘంటసాలవారి జయంతి సందర్భంగా ఆయనను స్మరించుకుంటూ యీ మధుర లలిత గీతాన్ని రసజ్ఞులకు అందిస్తున్నాను.

### శ్రీమతి పి.లీల

**తె**లుగు చలన చిత్రరంగంలో ఉన్నత శ్రేణి గాయనీ మణులుగా పేరుగాంచిన వారిలో శ్రీమతి పి.లీల ప్రముఖులు. సుమధురమైన గాత్రంతో అటు శాస్త్రీయ సంగీతమైనా, ఇటు లలిత సంగీతమైనా, అలవోకగా గమకాలు, సంగతులు భావయుక్తంగా పలికించగల విదుషీమణి ఆమె. 'శ్రీలలితా శివజ్యోతి సర్వకామదా', 'జయజయజయమంగళగౌరి', 'శ్రీతులసి ప్రియ తులసి జయమునీయవే', 'రాగసుధారసపానముజేసి',(త్యాగరాజకీర్తన)

వంటి గీతాలలోని కర్ణాటక సంగీతశైలి, 'తీయని ఊహలు హాయిని గొలిపే వసంతగానమె హాయ్', 'ఏమిటో యీ మాయా ఓ చల్లని రాజా వెన్నెల రాజా', 'తెలుసుకొనవే చెల్లి అలా నడుచుకొనవె చెల్లీ', 'అందమె ఆనందం ఆనందమె జీవిత మకరందం' వంటి భావగీతాలలోని లాలిత్యము ఆమె కంఠంలోని విశిష్టతను చాటి చెబుతాయి.

ఘంటసాల, పి.బి.శ్రీనివాస్, ఎ.ఎం.రాజా మొదలగు వారితో ఆమెపాడిన యుగళగీతాలు తెలుగువారిని ఎంతగానో ఆకట్టుకున్నాయి. ఆమె మాతృభాష తెలుగు కాకపోయినా, ఆమె పాడిన కొన్ని వందల పాటలలో ఎక్కడా కూడా మనకు భాషాపరంగా లోపం కనబడదు. సాలూరు రాజేశ్వరరావు, ఘంటసాల, సి.ఆర్. సుబ్బరామన్, ఓగిరాల రామచంద్రరావు, మాస్టర్‌వేణు, మొ॥లగు ప్రముఖ స్వరకర్తలు ఆమెచేత ఎన్నో అద్భుతమైన గీతాలు పాడించారు. ఆకాశవాణి మద్రాసుకేంద్రంలో కూడా డా॥ బాలమురళీకృష్ణ గారి సంగీత నిర్వహణలో కొన్ని లలిత గీతాలు శ్రీమతి లీల పాడినవి ఆకాశవాణి శ్రోతల హృదయాలలో సుస్థిర స్థానాన్ని పొందాయి. ఆయన స్వరపరచిన జయదేవ అష్టపది 'తవవిరహే వనమాలి సఖి సీదాపతిరాధే'ని లీల మధురంగా గానం చేశారు.

చిన్నవయసులోనే లీల కర్ణాటక సంగీతాన్ని మణి భాగవతార్, చెంబై వైద్యనాథ భాగవతార్, రాజగోపాల అయ్యర్‌ల వద్ద అభ్యసించి మంచి ప్రావీణ్యతను సంపాదించుకున్నారు. శాస్త్రీయ సంగీతం పట్ల ఆమెకున్న భక్తి, శ్రద్ధ అపారం. 1999 వ సంవత్సరంలో పి.బి.శ్రీనివాస్ గారితో ఒక కచేరిలో పాడడానికి హైద్రాబాద్ వచ్చినప్పుడు ఆమెతో నేను ముచ్చటించడం జరిగింది. సినిమారంగం నుండి విరమించిన తరువాత కర్ణాటక సంగీత కచ్చేరీలు బాగా చేస్తున్నానని ఆమె చెప్పారు. గంభీరమైన ఆమె గాత్రం శృంగారము, భక్తి మొదలగు అన్ని భావాలను మధురంగా పలికించిన పాటలెన్నో వున్నాయి.

''ఏడుకొండలవాడ వెంకటారమణా'' (పెళ్ళిచేసిచూడు), ''అమ్మా శ్రీ తులసి దయారాశివమ్మా''(సంసారం), ''తెల్లవారవచ్చె తెలియగ నాసామి'' (చిరంజీవులు), ''నడిసేయంకోగాలి నడిసేయబోకే'' (రాజమకుటం), ''దేవ దీన బాంధవా'' (పాండవవనవాసము), ''కలనైనా నీతలపే'' (శాంతినివాసం), ''కరుణించు మేరిమాతా'' (మిస్సమ్మ),''ఏనాటికైనా నీ దాననే'' (చిరంజీవులు) వంటి అద్భుతమైన పాటలు ఏనాటికీ మరపురాని మచ్చుకు కొన్ని మాత్రమే. చలన చిత్ర సంగీతానికి స్వర్ణయుగమనదగిన ఆ కాలంలో నిష్ణాతులైన సంగీత దర్శకులు ఆమె చేత అజరామరమైన పాటలు పాడించారు. ఆమె కన్నడం, మలయాళం, సింహళ భాషలలో కూడా చాలాపాటలు పాడారు. తెలుగు చలన చిత్ర సంగీతానికి వన్నె చేకూర్చిన కొద్ది మందిలో లీల కూడా ఒకరు అనడం అతిశయోక్తి కానేరదు. ●

ఘం|| ఘంటసాల

; నీసా సా, రిస | నీపనీప మామ | ; గమాప మగ | గా, మ గా, |
. వెలిగిం.చ. | వే . . . చిన్ని | . వలపు దే. | పం . . . . |

; గా, మమప | పాపా పనీ | ; మా, ప నీ | సా, నీ పనీప |
. ఎం. దు కే. | నా మీ ద. | . యిం. త తో | పం . . . . |

; నీ సా సా, రిస | నీపనీప మామ | ; గమాప మగ | గా, మ గా, |
. వెలి గిం. చ. | వే . . . చిన్ని | . వలపు దే. | పం . . . |

; గా, మ మప | పాపా పనీ | ; మా, ప నీ | సా ; , |
. ఎం. దు కే. | నా మీ ద. | . యిం. త తో | పం . . |

లీల:-

; మపాప పా | పప పనీ పమ | ; పసానీ పమ | మా, ప గమరిగా, |
. మనసు లో | ప్రణయ. మే. | . తెనకె దే. | పం . . . |

; గా, మ మప | పాప పనీ | పమప నీసరిస | నీ ; , |
. దా. ని వెలి | గించుతా. | కు. న్నమా . . . | పం . . |

ఘంట:-

; మపా సా, సా | సా, సా, సా | సా సమగ | స నీ సా, |
. నే. మా.ము | పై. కుంకు | మే నా. కు | దే. పం. |

; పనీస గా గా | గా మగస | ; నీ సా గా, మా | మపగమప పా, ; |
. అది యా. చి | నం త నే. | . తెలి సె. ను | తా . . . . పం . . |

" వెలిగించవే చిన్నివలపు దీపం!

చరణాలు 1, 2 చరణాలు బాణీలో పల్లవిలోని "మనసులో ప్రణయమే....
.......కలిసెను తాపం" వరకే వుంటుంది.

నీ = కైశికి నిషాదం నీ = కాకలి నిషాదం





పి. లీల

## తిలంగ్ రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. ఇదియే జీవితానందము (పల్లవి, తొలి చరణం వరకు) | స్వర్ణమంజరి | ఘంటసాల, సుశీల | ఆదినారాయణరావు |
| 2. నా చందమామా | పాండవ వనవాసం | ఘంటసాల,సుశీల | ఘంటసాల |
| 3. నీలకంధరా దేవా (పల్లవి, మొదటి చరణం వరకు) | భూకైలాస్ | ఘంటసాల | సుదర్శనం, గోవర్ధనం |

# ఘంటసాల స్వరపరచి గానం చేసిన చిత్రేతర గీతాలలో కొన్ని...



పసిడి పాలాల్లో పల్లెపడుచు తన మామకోసం
కలవరపడుతూ - ఇలా పిలుస్తోంది

రచన
కొనకళ్ళ

రావోయి బంగారి మావ
నీతోటి రహస్య మొకటున్నదోయి ॥రావోయి॥
నీళ్ళతోరల వెన్క నిలుచున్న పాటనే.... ఏఏఏ... ॥నీళ్ళ॥
గలగలల్ విని గుండె ఝల్లుమంటున్నది ॥రావోయి॥
అవిసె పూవులు రెండు అందుకున్నయ్ నాకు ॥అవిసి॥
తుంచి నా సిగలోన తురిమిపోదువు గాని ॥రావోయి॥
ఏటి పడవ సరంగు పాట గిరికీలలో ఆ... ఆ... ఆ... ॥ఏటి॥
చెలికాడ మనవగల్ కలబోసికుందాము ॥రావోయి॥

రచన
వి.జి.కె.చారి

శ్రీశైలవాసా శేషాద్రివాసా
గరుడాద్రివాసా వేంకటాద్రీశా
నారాయణద్రీశ వృషభాద్రివాసా
వృషశైలవాసా సర్వలోకేశా
తిరువేంకటాధీశా జగదీశా
కరుణ నేలగరావె కమలేశా ॥తిరు॥
కోటి గొంతులు నిన్ను గోవిందయని పిలువ
కోటి చేతులు నీకు కోరి జోతలు చేయ
కోరికల దీర్చేటి కొంగు బంగారమై
కొండలేడింటిపై కొలువు దీరేవయ్యా ॥తిరు॥
పాతకమ్ముల దీర్చు పంచ ధారల నడుమ
బహుపుణ్య ప్రదమైన స్వామి హృది తీరాన
ఆనంద నిలయాన అందాన కొలువున్న
ఆనందరూప మము ఆదరించగరావె ॥తిరు॥
శివరూప మీవంచు చెప్పుదురు కొందరు
ఆది శక్తి వటంచు అందురింకొందరు
నారాయణుడవంచు నమ్ముదురు కొందరు
మూడు శక్తులు గూడ ముచ్చటౌ రూపమ్ము ॥తిరు॥

రచన
జి. జాషువా

మా చిట్టిపాప నా ఒళ్లో పోసాడు.....నెల బాలుడై ఆనందాన్ని
కుప్ప బోసాడు...చిట్టి బాబూ!
బొటవ్రేల ముల్లోకములు చూచి లోలోన
నానంద పడు నోరులేని యోగి
తల్లిదండ్రుల తనూ వల్లరీ ద్వయికి వ
న్నియ తెచ్చు తొమ్మిది నెలల వలపు పంట
అమృతంబు విషమను వ్యత్యాస మెఱుగనికా
ఆస్వాదింప జను వెఱ్ఱి బాగులాడు
అనుభవించు కొలంది నినుమడించుచు మరం
దము జాలువారు చైతన్య ఫలము
భాషరాదు వట్టి పాలు మాత్రమే త్రాగు
నిద్రపోవు లేచి నిలువలేడు...
ఎవ్వరెరుగ రితనిదే దేశమో కాని
మొన్న మొన్న నిలకు మొలిచినాడు
కౌగిట్లో కదలి గారాలు కురుస్తాడు.. ఉయ్యేల్లో ఉల్లంలో
ముద్దులు మురిపిస్తాడు...
గాన మాలింపక కన్నుమూయని రాజు
అంబకౌగిటి పంజరంపు చిలుక
కొదమ కండలు దేరుకొను పిల్ల వస్తాదు
ఊయేల దిగని భాగ్యోన్నతుండు
ఊ ఊలు నేర్చిన యొక వింత చదువరి
సతిని ముట్టని నాటి సాంబమూర్తి
ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి
తన యింటి క్రొత్త పెత్తనపు దారి
ఏమి పని మీద భూమికి నేగినాడో
నుడుప నేర్చిన పిమ్మట నడుగవలయు
ఏండ్లు గడచిన ముందు ముందేమొ గాని
ఇప్పటికి మాత్రమే పాప మెఱుగడితడు
నాయనా! పురిటింటి తెరువరీ! కులజ్యోతీ! నీకు దీర్ఘాయువురా!
నవ మానములు, భోజనము నీర మెఱుగక
పయనించు పురిటింటి బాటసారి
చిక్కు చీకటి చిమ్ము, జానెడు పొట్టలో
నిద్రించి లేచిన నిర్గుణుండు
నునుచెక్కికుల, బోసినోటి పువ్వులలోన
ముద్దులు చిత్రించు మోహనుండు
అక్షయంబైన, మాతృక్షీర మధుధార
లన్నంబుగా దెచ్చుకొన్న యతిథీ
బట్టగట్టడు, బిడియాస బట్టు పడడు
ధారుణీ పాఠశాలలో చేరినాడు కానీ
వార మాయెనో లేదో మా ప్రకృతి కాంత
కఱపియున్నది వీని కాకలియు నిద్ర
పిచ్చి తండ్రీ! ఏమా ముచ్చట్లు ? ఎవరితో ఈ కేకిసలు?
లేదు...లేదు...ఏడవడు తండ్రీ... ఏడవకు... పిచ్చితండ్రీ!
ఊయేల తొట్టి, యేముపదేశ మిచ్చునో,
కొసరి యొంటరిగ నూ కొట్టు కొనుస్రునో ॥డి॥
అంబతో తనకెంత సంబంధ మున్నచో
యేడ్చి యూడిగము చేయించు కొనును ॥నా॥
పరమేశ్వరుండేమి, సరసంబు లాడునో
బిట్టుగా, గేకిసల్ గొట్టు కొనునుం ॥
మూన్నాళ్ళ లోన నెప్పుడు నేర్చుకొనియెనో
పొమ్మన్నచో చిన్న బుచ్చుకొనును
ముక్కుపచ్చలారి పోయి ప్రాయము వచ్చి
చదువు సంధ్యనేర్చి బ్రతుకునపుడు
నాదు పసిడికొండ నారత్నమని (తల్లి
పలుకు పలుకు లితడు నిలుపుగాక ! ॥తల్లి॥

| రచన : సముద్రాల | గానం : ఘంటసాల |
|---|---|

అన్నదమ్ములలోన అతి ప్రియతముని
నకులుని ధర్మనందనుడు కోల్పోయె...
అసమాన శూరుడు అమర సన్నిభుడు
పార్థుడు కురురాజు బందడైపోయె
అమిత బాహుబలుండు అపరాజితుండు
భీమసేనుడు కూడ విజితుడై పోయె
ధర్మావతారుడౌ ధర్మసూనుండె
తన్నొడ్డిపణముగా తానోడిపోయె.... ఓడిపోయె

| రచన : 'భారతం' నుండి | గానం : ఘంటసాల |
|---|---|

ధారుణి రాజ్య సంపద మదంబున గోమలి గృష్ణజూచి రం
భోరు నిజోరు దేశమున నుండగ బిల్చిన యిద్దురాత్ము!దు
ర్వార మదీయ బాహుపరివర్తిత చండ గదాభి ఘాత భ
గ్నోరు తరోరు జేయుదు సుయోధను నుగ్ర రణాంతరంబునన్!

కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్ చూచుచుండన్ మదో
ద్ధురుడై ! ద్రౌపదినిట్లు చేసిన ఖలున్! దుశ్శాసనున్ లోకభీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ అని నాస్వాదింతు నుగ్రాకృతిన్

| రచన : సముద్రాల | గానం : మాధవపెద్ది సత్యం |
|---|---|

కాలుంగూతలు కూయబోకుమిక నో గర్వాంధ సర్వస్వమున్
చూఱంబుచ్చినవారు చూపునది వాక్శూరత్వమే ఇప్పడే
ఈ రాజేంద్రులు వృద్ధ బాంధవులముందే నేను నీకర్హ స
త్కారంబున్ ఒనరింతు నీ భుజబలౌద్ధత్యమ్ము చూపించుమా!

| రచన : సముద్రాల | గానం : పి.లీల |
|---|---|

కృష్ణా ! కృష్ణా! కృష్ణా!
దేవా ! దీనబాంధవా! అసహాయురాలరా! కావరా
దేవా ! దీనబాంధవా! అసహాయురాలరా! కావరా
కాలుని ఐనా కదనములోనా
గెలువజాలిన నా పతులూ
కాలుని ఐనా కదనములోనా
గెలువజాలిన నా పతులూ
ధర్మ బంధము త్రెంచగలేక మిన్నకుండేరు స్వామీ
నిన్నే మదిలో నమ్ముకొనేరా
నీవే నా దిక్కు రారా!! ॥దేవా॥
మకరిపాలై శరణము వేడిన కరిని కాపాడినావే ॥మకరి॥
హిరణ్యకశిపు తామసమణచి ప్రహ్లాదు రక్షించినావే
కుమతులు చేసే ఘోరమునాపి ॥2॥
కులసతి కాపాడలేవా ॥దేవా॥
గోవిందా..! గోపీ జనప్రియా!
శరణాగత రక్షకా !
పాహిమాం పాహి! పాహి! కృష్ణా!

| గానం : బాలమురళీకృష్ణ |
|---|

శ్లో॥ శ్రీవిష్ణుం జగతాం నాథం!
జ్ఞాన విజ్ఞాన మోక్షదం!
మహాపాప హరం దేవం!
తం సూర్యం ప్రణమామ్యహం!!

శ్లో॥ అరుణాయ శరణ్యాయ
కరుణారస సింధవే!
అసమాన బలాయ
ఆర్త రక్షణాయ నమో నమః ॥

| రచన : సముద్రాల | గానం : ఘంటసాల |
|---|---|

సాకీ: న్యాయానికే పరాజయమా!
వంచనకే ధర్మము తలవంచేనా
విధి వంచితులై విభవము వీడీ
అన్న మాటకోసం - అయ్యో అడవి పాలయేరా ॥విధి॥
నీ మది రగిలే కోపానలమూ
ఈ మహినంతా దహియించేనని
మోమునుదాచేవ ధర్మరాజా!
కో: అయ్యో అడవిపాలయేరా
సభలో చేసిన శపథముదీరా
పాపులననిలో త్రుంచెద నేనని
బాహువులూచేవ భీమసేనా!
కో: ఆ..ఆ..ఆ.. అడవిపాలయేరా
అలములోన కౌరవసేనా ఆమ్ములవానా ముంచెద నేనని
ఇసుమును చల్లేవ సవ్యసాచీ! ॥విధి॥
ఏ యుగమందూ - ఏ యిల్లాలూ
ఎరుగదు తల్లీ ఈ అవమానం ॥ఏ యుగమందూ॥
నీ పతిసేవయే నీకు రక్ష !

| రచన : సముద్రాల | గానం : లీల, ఎల్లారీశ్వరి |
|---|---|

ఇద్దరు: మహినేలే మహారాజు నీవే
మనసేలే నెరజాణ నేనే ॥మహినేలే॥
ప్రియభామల సరసలీలల
ప్రేమమీర ఏలుకోరా రాజా
మహినేలే మహారాజు నీవే
1నర్తకి: అందచందాలలోన
2నర్తకి: వలరాజు
1నర్తకి: మధుమందహాసాలలోనా
2నర్తకి: నెలరాజు
అందచందాలలోనా
1నర్తకి: వలరాజు
2నర్తకి: మధుమందహాసాలలోనా
1నర్తకి: నెలరాజు
ఇద్దరు: తనువూనినా తరుగమానినా ॥2॥
సరిరారు నీకు రాజరాజా ॥మహినేలే॥
1నర్తకి: చతురహాస్యాలలో ఓ ఓ ఓ
2నర్తకి: లలిత లాస్యాలలో ఆ ఆ ఆ ఆ ఆ ఆ
1నర్తకి: రసిక విద్యా రహస్యాలలో...
1నర్తకి: అనురాగ పారవశ్యాలలో..
ఇద్దరు: మాసరి రామని రంభామేనకలే
అమరసీమ చేరినారురా రాజా
హ హ హ ॥మహిమనేలే॥

| గానం : సుశీల |
|---|

శ్లో॥ శ్రీకృష్ణా! కమలానాథా!
వాసుదేవా! సనాతనా!
గోవిందా ! పుండరీకాక్షా!
రక్షమాం కరుణానిధే॥

| రచన : సముద్రాల | గానం : సుశీల |
|---|---|

గీ॥ ధర్మపరుడైన పతిని శోధనము చేయ
వచ్చె- శాపాయుధుండు దుర్వాసమౌని
ఏ విధి ముగింపజేతువో ఈ పరీక్ష
భక్త సంత్రాణశీల గోపాలదేవా... ఆ...ఆ.. గోపాలదేవా

రచన : సముద్రాల గానం : సుశీల, ఘంటసాల

ద్రౌపది: ఆ..ఆ..ఆ..ఆ..
హిమగిరి సొగసులూ మురిపించునూ మనసులూ
హిమగిరి సొగసులూ
భీమ: (వచనం) ఊ! ఆపావేం పాడు!
ద్రౌపది: హిమగిరి సొగసులూ మురిపించునూ మనసులూ
హిమగిరి సొగసులూ మురిపించునూ మనసులూ
చిగురించునేవో ఏవో ఊహలూ
హిమగిరి సొగసులూ మురిపించునూ మనసులూ
చిగురించునేవో ఏవో ఊహలూ
యోగులైనా మహా భోగులైనా మనసుపడే మనోజ్ఞసీమా!
భీమ: (రాగం) ఆ ఆ ఆ!
ద్రౌపది: యోగులైనా మహాభోగులైనా మనసుపడే మనోజ్ఞసీమ
భీమ: సురవరులూ సరాగాల చెలులూ
ద్రౌపది: (రాగం) ఆ ఆ ఆ!
భీమ: సురవరులూ సరాగాల చెలులూ
కలిసి సొలసే అనురాగసీమా
ద్రౌపది: హిమగిరి సొగసులూ మురిపించునూ మనసులూ
ఈ గిరినే ఉమాదేవి హరునీ సేవించీ తరించెనేమో!
భీమ: (రాగం) ఆ ఆ ఆ!
ద్రౌపది: ఈ గిరినే ఉమాదేవి హరునీ సేవించీ తరించెనేమో!
భీమ: సుమశరుడూ రతీదేవి చేరీ
ద్రౌపది: (రాగం) ఆ ఆ ఆ!
భీమ: సుమశరుడూ రతీదేవి చేరి కేళి తేలి లాలించె లేమా!
ద్రౌపది: హిమగిరి సొగసులూ మురిపించునూ మనసులూ!
భీమ: (రాగం) ఆ ఆ ఆ!
ద్రౌపది: హిమగిరి సొగసులూ మురిపించునూ మనసులూ!
భీమ: (రాగం) ఆ ఆ ఆ!

గానం : ఘంటసాల

ఆంజనేయా... మహానుభావా..
శ్లో॥ మనోజం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానర యూధ ముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి॥

గానం : ఘంటసాల

శ్లో॥ భజే రమ్య రంభావనీ నిత్యవాసం
భజే బాల భాను ప్రభా చారుభాసం...
భజే చంద్రికా కుంద మందార హాసం
భజే సంతతం రామ భూపాల దాసం॥
దండకము:
జయ! జయ!మహాసత్వబాహో! మహా వజ్రదేహో!
పరీభూత సూర్యా! కృతామర్త్య కార్యా!
మహావీర, హంవీర, హేమాద్రి ధీరా!
ధరాజాత, శ్రీరామ, సౌమిత్రి సంవేష్టితాత్మా, మహాత్మా!
నమో వాయుపుత్రా! నమో సచ్ఛరిత్రా!
నమో జానకీ ప్రాణదాతా! భవిష్యద్విధాతా!
హనూమంతా! కారుణ్య వంతా! ప్రశాంతా!
నమస్తే ! నమస్తే ! నమస్తే! నమః॥

శ్లో॥ శ్రీరామచంద్రం శ్రితపారిజాతం
సలక్ష్మణం భూమి సుతా సమేతం
లోకాభిరామం రఘువంశ సోమం
రాజాధిరాజం శిరసా నమామి॥

రచన : సముద్రాల గానం : ఎస్. జానకి

యక్షిణి: ఆ..ఆ....ఆ... ఆ ఆ ఆ ఓ వన్నెకాడ ఊ..
ఓ వన్నెకాడా నిన్ను చూచి నా మేను పులకించెరా
ఓ వీరా నన్నేలి కులికించరా ॥ఓ వన్నెకాడ॥
మరులు పెంచే మంచిగంధం
మల్లెపూపాన్పు వేచేనోయీ ॥మరులు॥
నీ దయగోరి నిలచేనోయీ ॥ఓ వన్నెకాడ॥

ఉరుకుల పరుగుల దొరా
మగసిరికిది తగదురా
ఉరుకుల పరుగుల దొరా నీ మగసిరికిది తగదురా
ఆ..ఆ...ఆ...ఉరుకుల పరుగుల దొరా....
చూడరా యిటు చూడరా
సరి యీడుజోడు వన్నెలాడినేరా! ఓయ్ ॥చూడరా॥
వలపుగొలిపే బింకాల
కళలతనిపే పొంకాల
వదిలిపోబోకురా....ఆ..ఆ..ఆ... ॥ఉరుకుల॥

తాళలేరా మదనా! మదనా మదనా మదనా...
నే తాళలేరా మదనా మదనా మదనా మదనా
నే తాళలేరా మదనా
విరులశరాల వేగిలిచాల విరహమోర్వజాల...ఆ ఆ...
విరులశరాల వేగిలిచాల విరహమోర్వజాల...
ఇలలో లేని అమరసుఖాల
తేలజేతు వేగ ఎదను గదియర
తాళలేరా మదనా! మదనా మదనా మదనా
నే తాళ, నే తాళ, ఇకతాళ లేరా మదనా

రచన : సముద్రాల గానం : ఘంటసాల, సుశీల

శశి: ఓ...ఓ...
అభి: రాగాలు మేళవింప
శశి: ఆహా!
అభి: హృదయాలు పరవశింప
శశి: ఓహో!
అభి: ఆడేము మధుర సీమ
తనిసేము అమరప్రేమ!
శశి: రాగాలు మేళవింప
అభి: ఆహా!
శశి: హృదయాలు పరవశింప
అభి: ఓహో!
శశి: ఆడేము మధురసీమ
తనిసేము అమరప్రేమ
మురిపించు మల్లెసరమౌచు నీదు
ఉరమందు విరిసిపోయెనా ॥మురిపించు॥
అభి: విరితేనెలాను మధుపమ్ముపోలె
నే మేను మరచి పోయేనా
శశి: రాగాలు మేళవింప
హృదయాలు పరవశింప
అభి: ఆడేము మధురసీమ
తనిసేము అమరప్రేమ
అభి: ఆనంద మొలుక నా డెందమందు
నిను దాచుకొందునోబాలా ॥ఆనంద॥
శశి: నాకన్నుదోయి నీరూపె నిలిపె
పూజించుకొందు బావా
అభి: రాగాలు మేళవింప
శశి: హృదయాలు పరవశింప
అభి: ఆడేము మధుర సీమ
శశి తనిసేము అమరప్రేమ!
ఇద్దరు:రాగాలు మేళవింప
హృదయాలు పరవశింప.. ఆహా.. ఆహా..హా..

రచన : కొసరాజు గానం : ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి, బృందం

గోపాల: మొగిలిరేకుల సిగదానా
మురిడి గొలుసుల చినదానా
రావే నా సిలక ఏమే ఈ అలక
గోపిక: చిలిపీ చూపుల చిన్నోడా చెవుల పోగుల పిల్లోడా!
చాలూ నీ గోలా నా పూసు నీకేలా!
(మంత్రములు)
గోపాల: కొసరి కొసరి రమ్మంటేనూ
ఇసురుకుంటు అటు ఉరికావూ!
బృం: ఒయ్! ఇసురుకుంటు అటు ఉరికావూ!
గోపిక: ఏటినీళ్ళకెడుతుంటే పైట పట్టుకొని గుంజావూ
బృం: పైట పట్టుకొని గుంజావూ!
గోపాల: సరసానికి చేశానే
గోపిక: ఓ..ఓ..
గోపాల: వరసలాడి మురిశానే
గోపిక: ఊ...ఊ.. గోపాల: ॥సరసానికి॥
నలుగురిలోనా కొంటెతనానా నవ్వులపాలూ చేశావూ..
బృం: చిలిపీ చూపుల చిన్నోడా
చెవుల పోగుల పిల్లోడా
చాలూ నీ గోలా నా పూసు నీకెలా
(మంత్రములు)
గోపాల: బుద్ధితెలిసేనే వయ్యారి
ముద్దు తీర్చవే ఒకసారీ
బృం : ఒయ్! ముద్దు తీర్చవే ఒకసారి
గోపిక: వగలమారి మొనగాడా
ఇక వదలకోయి నా నీడ
బృందం: వదలకోయి యిక నా నీడ
బృందం: వదలకోయి యిక నా నీడ
గోపాల: ఇద్దరమొకటైతేను
బృందం: ఓ...ఓ...
గోపిక: ఎడమే లేకుంటేను
బృందం: ఊ...ఊ...
గోపాల: ఇద్దరమొకటైతేను
బృందం: ఓ...ఓ...
గోపిక: ఎడమే లేకుంటేను
బృందం: ఊ...ఊ...
ఇద్దరు: అలకలుతీరా, పులకలుమీరా
కమ్మగ కాలం గడచేనూ
గోపికల బృందం : చిలిపీ చూపుల చిన్నోడా
గోపాలకులబృందం: మొగలిరేకుల సిగదానా
గోపికల బృందం: హో హో హో

గానం : మాధవపెద్ది

మాయలమారివై మొయిలు మాటునడాగి వృథాట్టహాసముల్
చేయకు నీ ప్రగల్భములు చేతలలో కనిపింపజాలినన్
ఆయుధమున్ ధరించి సమరావని నన్నెదిరింప రమ్ము వ
జ్రాయుధు డడ్డ నీ మదము నార్చెద కూల్చెద గర్వమోహితా

గానం : ఘంటసాల

మాయలతో జనించి మటుమాయలు వృత్తిగనెంచు నీవు అహో
మాయల నిందసేతువె అమాయకులైన పృథాకుమారులన్
మాయలుపన్ని నాడు అవమానముచేయగ లేదె ఆ గతిన్
మాయలతోనె నీ దురభిమానము మాపెదనో సుయోధనా

రచన : సముద్రాల గానం : ఘంటసాల, సుశీల

అభి: నా చందమామ నీవె భామ
తారలే అన నీ నీడనే నా ప్రేమసీమ
నీ నీడనే నా ప్రేమసీమ
శశి: (రాగం) ఆ ఆ ఆ ! ఓ ఓ ఓ ఆ ఆ.. అభి: ॥నా చందమామా॥
అభి: నీ కంఠవీణా రాగాలు తీయ
నీ కన్నుదోయీ మోహాలు పూయ
శశి: (రాగం) ఆ ఆ ఆ......
అభి: నీ కంఠవీణ రాగాలు తీయ
నీ కన్నుదోయి మోహాలు పూయ
నీ పాద మంజీరాలా నా ప్రేమ మ్రోయ ॥2॥
నటియించరావే మెరపుతీవ - హాయిగా ॥నా చందమామ॥
శశి: ఓ ఓ ఓ
అభి: ఎలకోయిల గొంతుమూయ ఎలుగెత్తి పాడవే
శశి: (రాగం) ఆ.... ఆ... ఆ..
అభి: వనమయూరి పరువుమాయ వలపునాట్యమాడవే
అడుగడుగున లయలుగులికి
హొయలు చిలికి ఏలవే
ప్రేమమధుర శిల్పచిత్ర రేఖా శశిరేఖా!
శశి: ఆ..ఆ..ఆ..

రచన : ఆరుద్ర గానం : సుశీల, పద్మనాభం

మాయాశశి: బావాబావా పన్నీరు
బావకు మరదలు బంగారు
బాజాలు మోగండె బాకాలు ఊదండే
ఎందుకు కంగారు ॥బావా॥
లక్ష్మణకుమారుడు:అయ్యో! అబ్బ !అమ్మ!
మాయాశశి: చిలిపిచేష్టలతో వలపెకోరునట
ముద్దూతీర్చమని సద్దుచేయునట ॥చిలిపి॥
మరులుకొనే బాల తను మనసుపడే వేళ ॥2॥
ఉలికిపడి ఉనికిచెడి ఉక్కిరి బిక్కిరి అవుతాడంట
ఓ... బావా ! బావా !
లక్ష్మణకుమారుడు: మరదలా!
మాయాశశి: బావా బావా పన్నీరు బావకు మరదలు బంగారు
పరుగులుతీసే ఉరకలు వేసే బావను ఆపేరు
సుందరాంగుడట గ్రంథసాంగుడట
ఏడు మల్లియల ఎత్తు తూగునట ॥సుంద॥
కలికికొనగోట ఆ చెంప ఇలా మీట ॥2॥
అబలవలె అదిరిపడి లబోదిబో అంటాడంట
ఓ బావా!
లక్ష్మణకుమారుడు:మరదలా!
మాయాశశి: బావాబావా పన్నీరు బావకు మరదలు బంగారు
వలపులలోనా జలకములాడ బావను తిప్పేరు
బావాబావా పన్నీరు బావకు మరదలు బంగారు
వలపులలోనా జలకములాడ బావను తిప్పేరు
బావాబావా పన్నీరు బావకు మరదలు బంగారు
వలపులలోన జలకములాడ బావను ముంచేరు

రచన : సముద్రాల గానం : పి.బి. శ్రీనివాస్

ఉ॥ ఓ... కమలాననా వికసితోత్పల లోచన నీలవేణి ఓ...
కోకిలవాణి దీనులగు కుంతి కుమారుల పొందికన్న చీ
కాకులు చాలునింక సరికాంతల కందని భోగభాగ్యముల్
చేకుర జేతునన్ బతిగజేకొని యేలవె కొగలీయవే

రచన : సముద్రాల గానం : లీల

ఉ॥ శాతనఖాగ్రఖండిత లసన్మద కుంజర కుంభముక్తము
క్తాతతశైలకందర గుహాంతర సుప్తమృగేంద్ర కేసర
వ్రాతము పట్టి ఊతునని రంకెలు వేయగబోకు క్రోధ ని
ర్ఘాత మహోగ్ర భీమునెదురన్ నశియింతువు నీవు సైంధవా

రచన : సముద్రాల　　　గానం : మాధవపెద్ది,ఘంటసాల

దురో: సీ॥ ఏకచక్రపురాన యెగ్గు సిగ్గులు మాని
తిరిపెమెత్తిననాడె తెల్లమాయె
భీమ: తిరిపెమెత్తుటెగాదు తెగించి జరాసంధు
మట్టిజేసిన జగజెట్టి నేను
దుర్యో: మాధవు మాయతో మగధేశు కూల్చిన
జయమెంచి జబ్బలు చఱచుకొనకు
భీమ: గంధర్వపతి పాశబంధమ్ము విప్పి నీ
పరువుగాచినమాట మరచినావె
దుర్యో: హా ! మరతునే కులసతి నవమానపరుప
మౌన మూనిన నాటి నీ మగతనంబు
భీమ: ఆ! ధర్మనిరతి నశక్తిగా తలచునీదు
కనుల పొరలు మాపెదను ఈ క్షణమె తులువ

# కథా సంగ్రహం

జయప్రదంగా పాండవులు రాజసూయ యాగాన్ని నిర్వర్తించారు. వీడ్కోలు సమయమున ఆరగించమని శ్రీకృష్ణునకు అభిమన్యుడు బాణంతో గుచ్చిన పండునిస్తాడు. బాణం నుంచి ఆ పండును తీస్తూ వుండగా కృష్ణునకు వేలు తెగుతుంది. వెంటనే ద్రౌపది తన చీరె చెంగు చింపి కృష్ణుని వేలుకు కడుతుంది. శ్రీకృష్ణుడు ఆమె భక్తికి ముగ్ధుడై "నమ్మినవారి నెన్నడూ ఆ దైవం విడువడమ్మా"అని ఆమెకు అభయమిచ్చి ద్వారకకు పయనమై వెళ్ళిపోతాడు.

అక్కడ హస్తినాపురంలో దుర్యోధనుడు రాజసూయ యాగంలో వైభవాన్నీ, మయసభలో తనకు జరిగిన భంగపాటునూ తలచుకొని ప్రతీకారం కోసం బుసలు కొడుతూ వుంటాడు. మాయలమారి శకుని "పాండవులను ద్యూత క్రీడ కాహ్వానిస్తే వారి సర్వస్వాన్నీ హరించి నీ పాదదాసులను చేస్తానని" రారాజుకు ఉపాయం చెప్తాడు.

దుర్యోధనుడు తండ్రిని ఒప్పించి, విదురుని పంపించి, పాండవులను రప్పించి కపట ద్యూతం ఆరంభిస్తాడు. ద్యూతపు మత్తులో ధర్మరాజు తన తమ్ములనూ, తన్నూ, ద్రౌపదినీ పణంగా ఒడ్డి ఓడిపోతాడు.

దుర్యోధనుని ఆజ్ఞానుసారం దుశ్శాసనుడు పాంచాలిని నిండు కొలువులోనికి ఈడ్చుకొని వస్తాడు. సర్వజన సమక్షంలో ఆ పతివ్రతామతల్లిని అవమానిస్తారు. ఆ అవమానాలను చూచి సహించలేక, భీమసేనుడు ఘోర సంగ్రామంలో దుర్యోధనుని తొడలు విరుగకొడతాననీ, దుశ్శాసనుని వక్షస్థలం చీల్చి రక్తం త్రాగుతానని భీషణ ప్రతిజ్ఞలు చేస్తాడు. దానితో దుర్యోధనుడు మరీ రెచ్చిపోయి ద్రౌపదిని వివస్త్రను చేయమని దుశ్శాసనుని ఆజ్ఞాపిస్తాడు.

'ఎవరు నాకు దిక్కు' అని ఆ మహాసాధ్వి ఆక్రోశిస్తున్న సమయంలో దీనబాంధవుడైన ఆ శ్రీకృష్ణపరమాత్మ అఖండ వస్త్రదానం చేసి ఆమెను రక్షిస్తాడు.

ఈ మహాద్భుతంతో ధృతరాష్ట్రునకు తెలివి వచ్చి, పశ్చాత్తాపపడి పాండవులు జూదంలో కోల్పోయిన సర్వస్వాన్నీ తిరిగి వారికిచ్చివేస్తాడు.

కథ అడ్డం తిరిగిందే అని దుర్యోధనుడు విచారిస్తూవుంటే శకుని ధర్మరాజుని మళ్ళీ ఉద్రేకపరిచి జూదంలో దింపుతాడు. ఈసారి ఎవరు ఓడిపోతే వారు పన్నెండేళ్ళు అరణ్యవాసమూ, ఒక ఏడాది అజ్ఞాతవాసము చేయాలి. నియమభంగమైతే మరల పన్నెండేళ్ళు అరణ్యవాసమూ ఒక ఏడు అజ్ఞాతవాసమూ చేయాలి.

ఈసారి కూడా ధర్మరాజు ఓడిపోయాడు. విధివంచితులై వైభవమువీడి అన్నమాటకోసం అడవిపాలయారు పాండవులు. హస్తినాపురినుండి అభిమానంతో తమతో వచ్చిన మహాజనానికి అన్నపానాదులు సమకూర్చడం కోసం ధర్మరాజు సూర్యభగవానుని ప్రార్థించి "అక్షయపాత్ర" సంపాదిస్తాడు. ఏరోజుకారోజు ద్రౌపది భుజించి, శుద్ధిచేసేవరకూ అక్షయంగా ప్రసాదిస్తుంది ఆ పాత్ర!

శ్రీకృష్ణుడు ద్వారకనుంచి వచ్చి పాండవులను ఓదారుస్తాడు. పాశుపతాస్త్ర సంపాదనకై అర్జునుణ్ణి తపస్సు చేయమని హిమగిరి ప్రాంతాలకు పంపిస్తాడు. తనతోపాటు సుభద్రాభిమన్యులను ద్వారకకు తీసుకొనివెళ్తూ పాండవులతో వచ్చినవారందర్నీ తిరిగి హస్తినాపురికి పంపించివేస్తాడు.

బ్రహ్మాండమనే కౌరవుల గూఢచారి పాండవులకు తెలియకుండా వారి వెన్నంటి తిరుగుతూ వుంటాడు. బకాసురుని తమ్ముడు కిమ్మీరుడనే రాక్షసుణ్ణి పాండవులపైకి ఉసికొల్పుతాడు. భీమసేనుడు ఆ భయంకర రాక్షసుణ్ణి నుగ్గునుగ్గుచేసి చంపేస్తాడు.

కౌరవుల ప్రోద్బలంతో దూర్వాసమహర్షి శిష్యసమేతంగా పాండవాశ్రమానికి వచ్చి భోజనం పెట్టమని తొందర చేస్తాడు. అప్పటికే అక్షయపాత్ర శుద్ధిచేసి ఉండటం వలన ద్రౌపది దిక్కుతోచక శ్రీకృష్ణుని ప్రార్థిస్తుంది. ఆ జగన్నాటక సూత్రధారి తన మహిమవల్ల వారందరి ఆకలి తీర్చి దూర్వాసమహర్షిని భంగపరుస్తాడు.

పాండవులు వున్న ప్రాంతంలో కార్చిచ్చు ప్రారంభమై వారి ఆశ్రమానికి నలుమూలలా నిప్పంటుకుంటుంది. ఆ భయంకర అగ్నిజ్వాలల్లోంచి పాండవులను ఘటోత్కచుడు రక్షించి వారిని ఆకాశమార్గాన గంధమాదన పర్వతాలకు చేరుస్తాడు. ద్రౌపదీ భీమసేనులు ఈ పర్వతవనసీమలలో విహరిస్తూవుండగా గాలి వాలున వారిముందు ఒక సౌగంధిక కమలం వాల్తుంది. ద్రౌపది వాటికై మనుసుపడగా ఆమె కోరిక తీర్చుటకు భీముడు బయల్దేరి దారిలో హనుమంతుని దర్శనం చేసుకుంటాడు. ఆ మహామహుని వలన సౌగంధిక సరస్సు జాడ తెలుసుకుని ఆ సరోవరము చేరుకుంటాడు. అక్కడ యక్షరాక్షసులమాయలను ఛేదించి, సౌగంధిక కమలాలను సంపాదిస్తాడు.

అర్జునుడు అమరావతినుండి తిరిగివస్తాడు. పాండవులందరూ తిరిగి ద్వైతవనం చేర్తారు.

పాండవులను పరిహసించడానికి దుర్యోధనాదులు ఘోషయాత్ర పేరిట వారి ఆశ్రమం ప్రక్కనే విడిదిచేసి వారు చేస్తున్న యాగానికి అంతరాయంగా నృత్యవినోదాలు యేర్పాటు చేస్తారు. అంతటితో తృప్తినొందక ఆ కుటిల కౌరవులు చిత్రసేనుడనే గంధర్వరాజు కేళీ సరోవరం అతిక్రమించబోయి అతని మాయాజాలంతో పాశబద్ధులౌతారు. కాగలకార్యం గంధర్వులే తీర్చినా ధర్మరాజు భీమార్జునులను పంపి కౌరవులను రక్షిస్తాడు.

అవమానించబోయి అవమానింపబడినందులకు దుర్యోధనుడు ఖిన్నుడై విరక్తిచెంది, ప్రాయోపవేశం చేయడానికి సంకల్పిస్తాడు. శకుని తన మాయమాటలతో శశిరేఖా లక్ష్మణ కుమారుల వివాహం చేస్తే బలరామకృష్ణులు తమ పక్షమవుతారనీ, అప్పుడు పాండవుల ఆట కట్టించవచ్చుననీ, దుర్యోధనునకు నచ్చచెప్పి ప్రాయోపవేశం విరమింపజేసి హస్తినాపురికి తీసుకువెళ్తాడు.

ప్రియ శిష్యుడైన దుర్యోధనునిపై గల అభిమానంతో బలరాముడు శశిరేఖాలక్ష్మణకుమారుల వివాహానికి అంగీకరిస్తాడు. లగ్నం కూడా నిశ్చయమౌతుంది.

ఈ విషయం పాండవులకు తెలియగానే భీముడు ఉగ్రుడై ఘటోత్కచుని తలచి ఎలా అయినాసరే ఆ వివాహం భగ్నం చేయమని చెప్పి పంపిస్తాడు.

కృష్ణుని సలహాతో మాయాశశిరేఖయై లక్ష్మణకుమారుని పెళ్లాడటానికి సన్నద్ధుడౌతాడు. లగ్నం సమీపిస్తుంది.

అదే సమయాన సింధుదేశాధీశుడైన సైంధవుడు తన మేనల్లుడైన లక్ష్మణకుమారుని వివాహానికై ద్వారకకు బయల్దేరి వెళ్తూ మార్గమధ్యంలో పాండవాశ్రమంలో ఒంటరిగా ద్రౌపదిని చూచి మోహించి ఆమెను బలత్కారంగా తన రథంమీద యెక్కించుకొని పారిపోతాడు. భీముడు వానిని వెన్నాడి పట్టుకొని చంపబోగా ధర్మరాజు అడ్డుపడి వాని ప్రాణాలు కాపాడుతాడు.

కానీ, భీమసేనుడా సైంధవునకు తగిన ప్రాయశ్చిత్తం చేయాలని కత్తితో వాని బుర్రగొరిగి తన కుమారుని ఘటోత్కచుని తలుస్తాడు.

అదే క్షణాన పెండ్లికుమార్తెగా సింగారించుకొని శశిరేఖ రూపంలోవున్న ఘటోత్కచుడు తన తండ్రి పిలుపువిని వెంటనే అదృశ్యమై పోతాడు.

అసలు శశిరేఖ పెళ్లి పీటలపైన కూర్చోవలసి వస్తుంది. భీముడు చేతిలో గర్వభంగం పొందిన సైంధవుడ్ని ఘటోత్కచుడు బంధించి పెళ్లి మంటపం ముందు పడేటట్లు చేసి, బలరాముని ముందు కౌరవుల నీచ బుద్ధి బయట పడేటట్లు చేస్తాడు. అసలు శశిరేఖను, అభిమన్యుడ్ని పెళ్లి మంటపంతో సహా పెకలించుకుపోయి అరణ్యంలో ఉన్న పాండవుల మధ్యకు చేరుస్తాడు. శశిరేఖ, అభిమన్యులకు అక్కడే వివాహం జరుగుతుంది. వివాహ సమయానికి విచ్చేసిన శ్రీ కృష్ణుడు ఆశీర్వదించి పాండవులను అజ్ఞాత వాసానికి సంసిద్ధం చేస్తాడు.

-శుభం-

## తారాగణం

**ఎన్.టి.రామారావు, సావిత్రి,**
**ఎస్.వి.రంగారావు, గుమ్మడి**
కాంతారావు, బాలయ్య, హరనాథ్, సత్యనారాయణ
రాజనాల, లింగమూర్తి, మిక్కిలినేని,
ప్రభాకరరెడ్డి, ముక్కామల, రమణారెడ్డి, పద్మనాభం,
ఎల్.విజయలక్ష్మి, సంధ్య, వాణిశ్రీ , వీణావతి,
సవితాదేవి, సరస్వతి, బేబిశశిరేఖ, ధూళిపాళ,
ఏ.వీ.సుబ్బారావు, మల్లాది, రామరాజు,
నారాయణ, కృష్ణమూర్తి, విశ్వనాథం, రమేష్,
అల్లురామలింగయ్య, సీతారాం, మద్దాలి, అశ్వత్థామ,
నారాయణరాజు, రాధాకృష్ణమూర్తి, కోటేశ్వరరావు, కాశీనాథ్,
పహిల్వాన్ కాంతారావు(నెల్లూరు)
అతిథి నటులు : రాజసులోచన, ఋష్యేంద్రమణి,
నాగయ్య, అజిత్‌సింగ్


కమలాకర కామేశ్వరరావు


ఘంటసాల


సముద్రాల


కొసరాజు


ఆరుద్ర

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| నేపథ్యగాయకులు | : ఘంటసాల, పి.బి.శ్రీనివాస్, మాధవపెద్ది, బాలమురళీకృష్ణ, పి.సుశీల, లీల, జానకి, ఎల్.ఆర్. ఈశ్వరి. |
| నృత్యములు | : సరస్వతి, మాలతి, దేవకి, హేమామాలిని (ఢిల్లీ) |
| నిర్వహణ పర్యవేక్షణ | : పి. గంగాధరరావు |
| దర్శకత్వం | : కమలాకర కామేశ్వరావు, బి.ఎ. |
| నిర్మాత | : ఎ.ఎస్.ఆర్.ఆంజనేయులు |
| రచన | : సముద్రాల |
| పాటలు | : సముద్రాల, ఆరుద్ర, కొసరాజు |
| సంగీతం | : ఘంటసాల |
| కళ | : ఎస్.కృష్ణారావు |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : సి. నాగేశ్వరరావు |
| ఆపరేటివ్ కెమెరామన్ | : యం. చంద్రశేఖర్ |
| నృత్యదర్శకుడు | : పసుమర్తి కృష్ణమూర్తి |
| కూర్పు | : సంజీవి, వీరప్ప, అంకిరెడ్డి |
| మేకప్ | : పీతాంబరం, నాగేశ్వరరావు, పోతరాజు, వీర్రాజు, భద్రయ్య |
| దుస్తులు | : నారాయణమూర్తి, అచ్యుతరావు |
| ఆభరణములు | : రాజాబాదర్ |
| సెట్ ప్రాపర్‌టీస్ | : సినీక్రాఫ్ట్స్ |
| స్టిల్స్ | : డి.రాధాకృష్ణమూర్తి (మాతా స్టూడియోస్) |
| పబ్లిసిటి | : స్టుడియో కేతా, స్టుడియో రూపకళా, స్టుడియో ఈఠంకి |
| ప్రొడక్షన్ మేనేజరు | : హరిప్రసాదరావు |
| ఆఫీసు మేనేజరు | : వెంకట్రామయ్య |
| అసోసియేట్ డైరెక్టరు | : జి.కేశవరావు |
| అసిస్టెంటు డైరెక్టరు | : కె. రాఘవేంద్రరావు బి.ఏ. |
| స్టంట్సు | : సాంబశివరావు |
| స్పెషల్ ఎఫెక్ట్సు | : మదన్ (ప్రసాద్ స్టూడియోస్) |
| స్టుడియోస్ | : వాహిని, విజయ, మెజెస్టిక్ |
| ప్రాసెసింగ్ | : విజయలాబరేటరీస్ - ఎస్.ఆర్.రంగనాధన్ |
| సీనిక్ ఎఫెక్ట్సు | : ఆర్.జయరామరెడ్డి |
| సెట్టింగు | : కె. శ్రీనివాసన్, టి. నీలకంఠన్ |
| మౌల్డింగు | : వేలుస్వామి, దొరస్వామి |
| శబ్దగ్రహణం | |
| పాటలు | : వి.శివరామ్, బి.ఎ. బి.యస్.సి(వాహిని ) (ఎ.వి.యమ్) |
| మాటలు | : పి.యమ్.మదన్‌గోపాల్ |
| రీరికార్డింగ్ | : ఎ.ఆర్.స్వామినాధన్ |
| స్టూడియో ప్రోగ్రామ్సు | : ప్రకాశరావు, రామదాసు, సుందరం |
| ఛీఫ్‌ఎలక్ట్రిషియన్ | : శంకర నారాయణ |


మాధవపెద్ది


పి.బి.శ్రీనివాస్


బాలమురళీకృష్ణ


ఎస్.జానకి


పి.సుశీల


ఎల్.ఆర్.ఈశ్వరి


పి.లీల



డిసెంబరు 4 ఘంటసాల జయంతిని పురస్కరించుకుని

సినీ సంగీత ప్రియుల కోసం...

హాసం

